# తిరుపతి పట్టణ ప్రముఖులు



కొసూరి హనుమంతు

**TIRUPATI PATTANA PRAMUKHULU**

1994, ఆగస్టు.

వెల: రు.: 30/-

ప్రచురణ:

Er. కె. హనుమంతు, B.E, F.I.E.,
525, రెడ్డి & రెడ్డి కాలనీ
తిరుపతి - 517 501
Phone: 23756

ముద్రణ:

ఎల్.వి. గ్రాఫిక్స్
ప్రకాశం రోడ్
తిరుపతి-517 501
ఫోన్: 21894

# విషయ సూచిక

# ముందు మాట

మా స్వగ్రామం, మదనపల్లె పట్టణం గురించి అప్పుర ప్రముఖులు ఒక పుస్తకం ప్రచురించినారు. దానిలో మదనపల్లె పట్టణ ప్రముఖుల గురించి, అతి స్వల్పంగా ఒక్కొక్క వ్యక్తి గురించి వ్రాసి వున్నది గమనించి, ఇంకా విస్తృతంగా వీరి జీవిత విశేషాల సేకరణ చేసి, ప్రచురించి వుంటే బాగుండేదనే అభిప్రాయం కలిగింది. తిరుపతి పట్టణ ప్రముఖులు అన్న గ్రంథం, ఒకటి తయారు చేద్దామనే ఈ చిన్ని గ్రంథం వ్రాయడానికి పూనుకున్నాను.

ప్రముఖులలో ఎవరెవరి పేర్లు వెయ్యాలి అన్న చర్చ వచ్చింది. నాకు తెలిసిన, నేను వినిన పేర్లను సేకరించినపుడు, ఎల్డర్స్ ఫోరమ్ సభ్యులు, మిత్రులు, శ్రీ టి.నారాయణ రెడ్డి, ఎస్.ఇ. రిటైర్డు; శ్రీ ఐ.జి.కె. రెడ్డి, ఇ.ఇ. రిటైర్డ్; మరియు శ్రీ సి. సుధర్శనం, మరిన్ని పేర్లను సూచించి, సహకరించారు.

దాదాపు ఒక సంవత్సరంగా, వీరిలో దొరికినన్ని జీవిత విశేషాలను సేకరించి, పాఠకుల కందిస్తున్నాను.

అడిగిన తోడనే వారి జీవిత వివరాలను అందజేసిన పెద్దలకు ప్రత్యే కించి నా నమస్సుమాంజలులు.

ఇంకెందరో పెద్దలు, ప్రముఖులు వున్నారు. వారందరి జీవిత విశేషాలను ప్రచురించాలనే ఆశ, ఆసక్తి వున్నా, తొలి విడతగా, ఈ 40 పెద్దల జీవిత విశేషాలను విడుదల చేద్దామనే సంకల్పించడం జరిగింది.

పాఠకులు, పెద్దలు ఇంకొిందరి ప్రముఖుల పేర్లను సూచించి, వారి జీవిత విశేషాలను అందజేస్తే, కృతజ్ఞతతో స్వీకరించి, రెండవ సంపు టంగా ప్రచురిద్దామనే సంకల్పం వుంది.

స్థానికులేకాక, తిరుపతిలో వుద్యోగరీత్యా నివాసముండి, ఇక్కడే స్థిర నివాసం ఏర్పరచుకొన్న పెద్దలను కూడా వారి ప్రాముఖ్యాన్ని బట్టి ఈ పుస్తకంలో చేర్చడం జరిగింది.

ఈ పుస్తకమును తెలుగులో వ్రాయాలా, ఇంగ్లీషులో వ్రాయాలా, అన్న ప్రశ్న వచ్చినప్పుడు, స్థానికులైన ప్రముఖుల గూర్చి, ఎక్కువ మంది

స్థానికులే చదువుతారు కాబట్టి తెలుగుభాష లో వ్రాయడమే సముచిత మని నిర్ణయం చేశాను.

కొన్ని చోట్ల సాంకేతిక పదాలను తర్జుమా చెయ్యలేకనూ, సందర్భోచితంగా వుంటుందని కూడా, ఇంగ్లీషు పదాలనే వుపయోగించడం జరిగింది.

తొలుత నాకు భాష మీద అధికారం లేదనే సంకోచం పీడించింది. అయినా సాహసించి, పెద్దల జీవిత విశేషాలు, ముఖతా కొందర్ని కలిసి, కొందరి గురించి యితర ప్రచురణలలో చదివి, ఇంకొందరివి వారి ఆప్తుల ద్వారా తెలిసికొని, వ్రాత ప్రతి తయారు చేసిన తర్వాత, మిత్రులు, ఆప్తులు శ్రీ కుర్రా రామి రెడ్డి, ఐ.ఏ.ఎస్ (రిటైర్డు), డా॥ బ్రహ్మాండం నరసింహం, దానిని శ్రమ కోర్చి చదివి, మెరుగులు దిద్దారు. వీరిర్వురికీ నేనెంతో ఋణపడి యున్నాను.

ఈ పుస్తకం రూపొందించడంలో, ప్రచురించడంలో, నన్ను ప్రోత్సహించి, సహకరించిన నా ధర్మపత్ని శ్రీమతి ఆనందమ్మకు నేను సదా కృతజ్ఞుణ్ణి. ఇంకా, కాపీ చెయ్యడంలో సహకరించిన, కుమారి వి. జయ పద్మకు, కుమారి సి. పద్మజకు నా అభినందనలు. ఇతరత్రా నాతో సహకరించిన శ్రీ కె.యస్. హరగోపాల్‌కు నా అభినందనలు.

చక్కని ప్రింటు చేసి, సుందరంగా పుస్తకాన్ని తీర్చి దిద్దిన, ఎల్.వి. ప్రెస్ అధినేత శ్రీ M. రాజేంద్రన్‌కు, నా కృతజ్ఞతలు.

నా ప్రథమ పుస్తక రచనా ప్రయత్నాన్ని ప్రోత్సహించి, తొలి పలుకు కూడా వ్రాసిన, పూజ్యులు సుప్రసిద్ధ సాహిత్య విమర్శకులు శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం గారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతాంజలులు.

కాలం మరుగున పడుతున్న ప్రముఖ వ్యక్తుల జీవిత విశేషాలను వెలుగుకు తెస్తూ, వారి వ్యక్తి ప్రాశస్త్యాన్ని, ప్రస్తుత, భావి తరాల వారికి అందించడానికి ఈ చిన్ని పొత్తము వుపకరిస్తుందని ఆశిస్తూ.

తిరుపతి
ఆగస్టు, 1994

భవదీయుడు,
కోసూరి హనుమంతు

# తిరుపతి పట్టణం

కృతేతు నరసింహోz భూ త్రేతాయాం రఘునందనః
ద్వాపరే వాసుదేవశ్చ కలౌ వేంకట నాయకః

కృతయుగంలో నరసింహమూర్తి, త్రేతాయుగంలో దశరథ రాముడు, ద్వాపరయుగంలో వాసుదేవుడు, కలియుగంలో శ్రీ వేంకటేశ్వర స్వామి ప్రత్యక్ష దైవాలని శాస్త్ర ప్రమాణము. అటువంటి ఏడుకొండల వాని పాదసన్నిధిలో గల తిరుపతి పట్టణ అవిర్భావము, ఆసక్తిదాయకంగా వుంది.

శ్రీ గోవిందరాజస్వామి విగ్రహము చిదంబరంలో వుండేది. శైవుడైన చోళరాజు వైష్ణవద్వేషి. ఆ వైష్ణవ విగ్రహాన్ని సముద్రంలో పారేద్దామనే దురుద్దేశ్యంతో వున్నాడని గమనించి, అక్కడి కొంతమంది పూజారుల సహాయంతో శ్రీరామానుజులు, దాన్ని రాత్రికి రాత్రి తరలించి, అతి వ్యయప్రయాసల కోర్చి, అప్పటి కొట్టూరు అనబడే ఈ గ్రామం దగ్గరికి చేర్చాడు. ఫిబ్రవరి 24వ తేదీ క్రీ.శ. 1130న, సంప్రదాయ సిద్ధంగా, ఆ విగ్రహాన్ని ప్రస్తుత దేవాలయమున్నచోట ప్రతిష్ఠింప జేశారని చరిత్ర చెప్తున్నది. ఆ దేవాలయం చుట్టూ, నాల్గు రాజవీధులు, ఉత్తరమాడ వీధి, దక్షిణమాడ వీధి, సన్నిధి వీధి, పశ్చిమమాడ వీధి ఏర్పరచారు. ఈ సముదాయానికే రామానుజపురం అనే పేరు ఆనాడు వాడుకలో వుండేది. ఆనాటి రామానుజ పురమే ఈనాటి తిరుపతి.

కపిలేశ్వర స్వామి దేవాలయం 1013 - 1045 మధ్యకాలంలోనూ, పెరియ రఘునాథ దేవాలయం - శ్రీ రామ దేవాలయం 1480 - 81 లోనూ; వసంతమండపం 1494 లోనూ; గోవింద పుష్కరిణి 1522 లోనూ; ద్వారపాలకులు 1549 లోనూ, పెద్దగోపురం 1628 లోనూ నిర్మించారని చరిత్ర చెప్తున్నది. అంటే, తిరుపతి పట్టణం ఎనిమిది వందల, అరవై ఏండ్ల ఘనచరిత్ర గల పురాతన పట్టణమని తెలుస్తున్నది.

1901 లో తిరుపతి పట్టణ జనాభా కేవలం: 15,485, అప్పటి నుండీ 1911: 16,701; 1921: 17,434; 1931: 19,138; 1941: 20,143; 1951: 25,207; 1961: 35,846; 1971: 65,843; 1981: 1,15,292; 1991: 1,88,540 గా పెరుగుతూ వుంది.

మద్రాసుకు 130 కి.మీ; బెంగుళూరుకు 245 కి.మీ. దూరానగల తిరుపతి పట్టణం దాదాపు ప్రస్తుతం పదునారు చదరపు కిలోమీటర్ల వైశాల్యం గల పట్టణము.

తిరుమల కొండకు శ్రీ వెంకటేశ్వరస్వామిని దర్శించే భక్తులు రోజుకు సగటున 25,000 నుండి 50,000 వరకూ వస్తూ పోతూ వుంటారు.

తిరుపతి ప్రఖ్యాత విద్యాకేంద్రం కూడా. శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయము, శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయము; ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయము; సంస్కృత కేంద్రీయ విశ్వవిద్యాలయము; నృత్యసంగీత కళాశాల, తదితర పోస్ట్ గ్రాడ్యుయేట్ డిగ్రీ కళాశాలలు, స్కూళ్ళు అనేకం వున్నాయి. తిరుమల గిరి మీద వేద విద్యా విశ్వవిద్యాలయం స్థాపిద్దామనే ప్రయత్నం కూడా వుంది.

తిరుపతి పట్టణానికి 22 కి.మీ. దూరంలో తిరుమల గిరిపై శ్రీవెంకటేశ్వర విశ్వ విఖ్యాత దేవాలయము; మూడు కి.మీ.లలో తిరుచానూరులో శ్రీ పద్మావతి అమ్మవారి దేవాలయము; 12 కి.మీ. లలో మంగాపురం వద్ద శ్రీనివాస కళ్యాణ శ్రీ వేంకటేశ్వర స్వామి దేవాలయము; 28 కి.మీ.లలో శ్రీ కాళహస్తీశ్వర స్వామి దేవాలయము దర్శనీయ పుణ్యక్షేత్రాలు. పట్టణంలోనే శ్రీ గోవిందరాజస్వామి దేవాలయము, శ్రీరాములవారి దేవాలయము, శ్రీ కపిలేశ్వరస్వామి దేవాలయము ప్రఖ్యాతి గాంచినవి.

22 కి.మీ.లలో కళ్యాణిడ్యాం, తిరుపతికి త్రాగునీటి సప్లై ప్రాజెక్ట్, 14 కి.మీ.లలో చరిత్ర ప్రసిద్ధి గల చంద్రగిరి కోట దర్శనీయ స్థలాలు.

పట్టణ శివారైన రేణిగుంట నుండీ మూడు తెలుగు దినపత్రికలు, ఈనాడు, ఆంధ్రజ్యోతి, ఉదయం ప్రకటితమౌతున్నాయి.

పారిశ్రామికంగా కూడా, రైల్వే క్యారేజి రిపేర్ షాప్; స్ప్రాక్టెక్, స్టైల్స్, అఖిల సిరమిక్ టైల్స్ ఫ్యాక్టరీలు; ఇ.సి.టి.వి. వారి టెలివిషన్ సెట్ల తయారీ; అమర రాజ బ్యాటరీస్, శ్రీ వెంకటేశ్వర కో-ఆపరేటివ్ చక్కెర ఫ్యాక్టరీ; గ్రైండ్‌వెల్ నార్టన్ ఫ్యాక్టరీ; జి.ఎమ్.ఎల్ చిప్స్; సిబార్ ఆటోపార్ట్స్; వోల్టార్క్ ఎలెక్ట్రోడ్స్; శ్రీనివాస సిస్టైన్ ఫ్యాక్టరీ మున్నగు నవి ఈ పట్టణ శివార్లలో స్థాపించబడి, సమర్థవంతంగా నడుపబడుతూ, వేలాది కార్మికులకు ఉపాధి కల్పిస్తున్నాయి.

రోజూ అనేక రైళ్ళు, బస్సులు, దేశ ముఖ్య నగరాల నుండీ తిరుపతికి వస్తూ పోతూ వుంటాయి.

రేణిగుంట వద్ద విమానాశ్రయం కూడా వుంది. అనేక హోటళ్ళు, తి.తి.దే. సత్రాలు వెలసి, యాత్రికులకు సౌకర్యంగా దిన దినాభివృద్ధి చెందుతున్న పట్టణమిది. 10 K.W. టి.వి. రిలే కేంద్రము; 3 K.W. F.M. రేడియో కేంద్రము కూడా వున్నాయి.

సగటు వర్షపాతం: సంవత్సరంలో 951.4 m.m. ఉష్ణోగ్రత: 44.5°C Max.; 14.4°C Min.

# ప్రస్తావన

శ్రీ వేంకటేశ్వర స్వామి పాద పీఠి అయిన తిరుపతి పట్టణం దివ్య క్షేత్రంగా ప్రపంచ ఖ్యాతి పొందినది. ప్రశస్తిలో 'వాటికన్' తో పోలుస్తున్నారు. పట్టణం విస్తరించింది. 1901 లో 15,485 ఉన్న జనాభా నేడు దాదాపు రెండు లక్షలకి పెరిగింది. స్వాతంత్ర్యానంతర కాలంలో విశ్వ విద్యాలయాలు, సాంస్కృతిక సంస్థలు, పరిశ్రమలు, వ్యాపార వ్యవస్థలు పట్టణాభివృద్ధికి సూచనలు. తిరుమల-తిరుపతి దేవస్థానం ఒక గొప్ప మత-సాంస్కృతిక-విద్యా సంస్థ. ఈ అభివృద్ధిని గూర్చి, ఈ శతాబ్దిలో తిరుపతి చరిత్ర క్రమాన్ని గూర్చి, తెలియ జేసే గ్రంథం ఏదైనా వెలువడిందో లేదో నాకు తెలియదు! ఈ శతాబ్దిలో 'చరిత్ర' ను గూర్చి దృక్పథం మారింది. 19 వ శతాబ్దిలో కార్లైల్ అనే ఆంగ్ల రచయిత 'Heroes and Hero- worship' (మహనీయులు-వారి ఆరాధన) అనే గ్రంథం వ్రాశాడు. గొప్ప వారైన వ్యక్తుల చరిత్రే దేశ చరిత్రగా, మానవ చరిత్రగా భావింప బడేది. 20 వ శతాబ్దిలో దృక్పథం మారింది. ఆర్థిక, రాజకీయ, సామాజిక పరిణామాలకు ప్రాధాన్యం లభించింది. మానవులందరు సమానులు అన్న దృష్టి బలపడటం, ప్రజా స్వామ్యం ఆమోద యోగ్యం కావడంతో, వ్యక్తులకు, వ్యక్తుల చరిత్రకు ప్రాధాన్యం తగ్గింది. 'Eminent Victorians' by Lytton Strachey (విక్టోరియా రాణి యుగంలో ప్రసిద్ధులు) అనే గ్రంథంలో గొప్పవారి లోపాలను వ్యంగ్యంగా ఎత్తి చూపడం అందుకు నిదర్శనం. మార్క్సి జమ్, సామ్యవాదం, గతి తార్కిక చారిత్రక వాదం, వ్యక్తుల వైశిష్ట్యాన్ని అప్రధానంగా భావించే ధోరణికి కారణమయ్యాయి. అయినా లెనిన్, స్టాలిన్, మార్క్స్ ఆదర్శ పురుషులుగా ఆరాధింప బడుతూనే వచ్చారు. ఇటువంటి వ్యక్తి పూజ నియంతృత్వానికి, ఫాసిజానికి దారి తీసింది. ఆర్థిక దృష్టి, వ్యాపార సంస్కృతి బాగా స్థిర పడిన ఈ రోజుల్లో కూడా జన సామాన్యం, సినీ హీరోలను, రాజకీయ నాయకులను ఆరాధిం చడం మాన లేదు! చెప్ప వచ్చిందేమిటంటే ఒక దృక్పథానికి మరొక

దృక్పథం ప్రత్యామ్నాయం కారాదు! వ్యక్తుల కృషి, త్యాగం, వారి తెలివి తేటలు, లక్ష్య శుద్ధి లేకుండా అభివృద్ధి, అభ్యుదయం యాంత్రికంగా సాగి పోదు. మానవ శక్తి వ్యక్తినిష్ఠమై, తర్వాత సమాజనిష్ఠమౌతుంది. సామాజిక ప్రగతిని, ఉద్యమాలను, వాటి స్వరూపాన్ని పర్యాలోకిస్తూనే, వ్యక్తుల విశిష్టమైన, ప్రత్యేకమైన కృషినీ, పాత్రనూ గుర్తింప వలసిన అవసరం నేడు ఎంతైనా వుంది. "వ్యక్తిగా నేను అల్పుడను, ఏమి చెయ్యడానికీ నేనొక గుంపుని తయారు చేసుకోవాలి" అనే మనస్తత్వం ఈనాడు ముఖ్యంగా యువకుల్లో ప్రబలుతున్నది. అలా కాదు, వ్యక్తిగా నీ లోని శక్తి యుక్తుల్ని పెంపొందించుకొని, సమాజంలో స్థానం ఏర్పర చుకోవడమే సవ్యమైన మార్గమని మన విద్యావ్యవస్థ కూడా ఈనాడు బోధించ లేక పోతున్నది. యాభైఏళ్ల క్రితం ఒక ఉపాధ్యాయునికి, ఒక హెడ్ మాస్టరుకు వ్యక్తిగా గుర్తింపూ, ఆదరాభిమానాలూ ఉండేవి. ఇప్పుడవి మృగ్యం. మనం ఒక విశ్వవిద్యాలయానికి, ఒక సంస్థకు వెడితే, దాని ప్రస్తుత పరిస్థితిని గమనిస్తాము కాని, దానికి కారకులైన వారి కృషిని విస్మరిస్తాము. దీనివల్ల యువతరానికి మార్గదర్శకత్వమే కాదు, వారికి కావలసిన స్ఫూర్తి, ఉత్సాహము లభించడం లేదు! తిరుపతి పట్టణంలో జరిగిన అభివృద్ధి, పెంపొందిన సంస్థలు, వాటి కొరకు కృషి చేసిన ప్రముఖవ్యక్తులు, వారి జీవిత విశేషాలూ సేకరించి గ్రంథస్థం చేయబూనుకోవడం ఒక కొత్త వెలుగు. ఇదొక విశిష్టమైన సేవ. ఈ కృషికి పూనుకొన్న శ్రీ కోసూరి హనుమంతు అభినందనీయుడు.

శ్రీ హనుమంతు యిప్పటికి 40 మంది పుర ప్రముఖుల జీవిత విశేషాలను సేకరించి ఈ తొలి సంపుటి ప్రచురిస్తున్నాడు. ఇందులోని విశేషాలన్నీ తిరుపతి పట్టణం యొక్క అభివృద్ధితో, వివిధ రంగాలలో పొందిన అభ్యుదయంతో ముడిపడినవే! మొదటి సారి తెలుగు కవుల చరిత్ర వ్రాసిన వారు శ్రీ వీరేశలింగం గారు! ఆయన 'స్వీయ చరిత్ర' వ్రాసికొన్నారు కూడా. అది ఆంధ్రదేశంలో సంఘసంస్కరణ చరిత్ర, రాజమహేంద్రవరం చరిత్ర కూడా అయితే రాజమండ్రి పుర ప్రముఖుల చరిత్ర లేదు! ఆ విధంగా కవుల రచయితల చరిత్రలు. సైంటిస్టులు, పారిశ్రామిక వేత్తలు వంటి ప్రముఖుల 'WHO IS WHO'

గ్రంథాలు వెలువడినవి. అవి చాల వరకు ఏదో అవసరం వచ్చినప్పుడు సంప్రదించడానికి పనికి వచ్చే గ్రంథాలు. వాటిలో ఆయావ్యక్తులను గురించి చాల క్లుప్తంగా విశేషాలు ఉంటాయి. శ్రీ హనుమంతు తనదైన ఒక మధ్యేమార్గం అవలంబించాడు. ఒక్కొక్క వ్యక్తి కృషినీ, తక్కువ పరిధిలోనే అయినా, ఆ వ్యక్తి పట్ల ఆసక్తి కలిగేలా కథనం చేశాడు. ఎక్కడా గౌరవాదరాలకు మించిన ఆరాధన, పొగడ్త వంటి పెడదారి పట్టలేదు. తేడా ఏమిటో చూపించడానికి ఒకటి రెండు ఉదాహరణలు - శ్రీ శంకరం బాడి సుందరా చారి వివాహమాడిన వైనం; శ్రీ దాసు యువకుడిగా జిల్లా జడ్జి బంగళా ప్రహరీ గోడ దూకి, 'తెల్లజాతి వెధ వల్లారా, మాదేశం నుండి పొండి' అని గోడ మీద వ్రాయడం. ఇవి మామూలు bio-data యిచ్చే గ్రంథాల్లోకి ఎక్కవు. కాని ఆయా వ్యక్తులను సజీవంగా రూపుకట్టేలా చేస్తాయి. విషయ సేకరణే కాక ఆయా వ్యక్తుల సమగ్ర కృషిని ఒక క్రమంలో, సంయమనంతో కథనం చెయ్యడం శ్రీ హనుమంతు సాధించిన విజయం. ఈ వ్యక్తుల కృషిని గూర్చి చదువుతూ వుంటే ఒక గొప్ప స్ఫూర్తి, ఉత్సాహం, మంచి చెయ్యాలి, వ్యక్తిగా నేను పరిణతి పొందాలి అనే భావం యువతలో కలుగు తుందనడానికి సందేహం లేదు! అదే నేడు కావల్సింది కూడా!

గ్రంథకర్త శ్రీ కోసూరి హనుమంతు నాకు బాల్యం నుంచీ పరిచి తుడే. వాయల్పాడులో పేద కార్మిక కుటుంబంలో జన్మించి, చిన్న వయసులోనే తల్లిని కోల్పోవడంతో మదనపల్లి లో పెత్తల్లి, మేనమామ, అక్కయ్యల దగ్గర మా పొరుగున ఉండే వాడు. ఇంజనీరింగు చదివించే స్తోమత వారికి లేక పోయినా, శ్రీ హనుమంతు స్వయం కృషితో చదివి ఇంజనీరు అయ్యాడు. ఇంటరు చదివే నాటికే సామ్యవాది! సంఘ సేవలో ముందంజ వేసే వాడు. సంఘ సేవంటే అభిలాషే కాదు, అభి నివేశమే కాదు, అది అతని స్వభావం కూడా, అదే ఈ గ్రంథ రచనకు శ్రీ హనుమంతుని పురికొల్పింది. ఇంజనీరుగా విశిష్టమైన కృషి చేసి, గుర్తింపు పొందడమే కాకుండా, విజయవాడలో ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీర్స్ శాఖ భవన నిర్మాణము, లైబ్రరీ స్థాపించి శ్రీ కె.ఎల్. రావు వంటి పెద్దల అభినందనలు పొందాడు. తిరుపతిలో నివసిస్తూ

పెద్దల సహకారంతో ఇతోధికమైన సేవ చేస్తూ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీర్స్ తిరుపతి శాఖను ఏర్పాటు చేయించి AMIE పరీక్షల నిర్వహణ బాధ్యత కూడా వహిస్తున్నాడు. ఆంధ్రదేశంలో రాజమండ్రి, కాకినాడ, విశాఖ, విజయవాడ, గుంటూరు, నెల్లూరు వంటి పట్టణాల చరిత్ర యింకా వ్రాయబడలేదు - అంటే ఆ పట్టణ ప్రముఖుల వ్యక్తిగత కృషి ఉల్లేఖింప బడలేదు. 'తిరుపతి పట్టణ ప్రముఖులు' అనే ఈ గ్రంథం ఒక వరవడి. ఈ ప్రముఖులు చాలమంది ఆంధ్ర దేశం నలుమూలల నుంచీ వచ్చి తిరుపతిలో ఉండి, పట్టణంలో సంస్థల అభివృద్ధికి జీవితాన్ని అంకితం చేసిన వారే! తిరుపతిలోనే జన్మించిన వారు తక్కువ మంది! శ్రీ హనుమంతు కూడా ఆ విధంగానూ, ఈ పుస్తక రచయితగానూ తిరుపతి పట్టణ ప్రముఖుడే! ఆయనకు నా అభినందనలు; గ్రంథానికి మనః పూర్వక మైన ఆహ్వానము! మలి సంపుటికి విషయ సేకరణ జరుగుతూనే ఉంటుందని విశ్వసిస్తున్నాను. చరిత్ర ఒక ప్రవాహం. అది ఒక చోట ఆగి పోదు గదా!

3 ఆగస్టు 1994, ఆర్. ఎస్. సుదర్శనం
మదనపల్లి.

# మాడభూషి అనంతశయనం అయ్యంగార్

తిరుపతి, గంగుంగ్రడ మండపం వీధి అనబడే సందులో ఒక చిన్న యిల్లు. దాని ముందుగదిలో ఒక చిన్న మేజాబల్ల. దానిముందొక కుర్చీ. వెనుకొక కుర్చీ. గోడకు వేలాడుతూ చిరునవ్వుల చిందించే మహాత్మాగాంధీపటం. దానికింద కర్ర కుర్చీలో, బిళ్లగోచీ పంచెకట్టుపైన ఉత్తరీయం తప్ప వేరే ఆచ్ఛాదనలేని లంబోదర విగ్రహంలా కూర్చుని ఏదో సంస్కృతగ్రంథాన్ని చదువుకుంటూ చిరకాలం దర్శనమిచ్చిన వ్యక్తి, ఎవరో కాదు. భారతదేశపు పార్లమెంటులో లోక్‌సభకు రెండు సార్లు అధ్యక్షులుగా ఉండి, బీహార్ గవర్నరుగా పదవీ విరమణ చేసిన శ్రీ మాడభూషి అనంతశయనం అయ్యంగారు వీరే. గాంధీగారి నిరాడంబరత్వాన్ని పుణికి పుచ్చుకొన్న నిన్నటి తరం మేటి నాయకులు శ్రీఅయ్యంగార్. ఆధ్యాత్మిక జాగృతిపై వారు వ్రాసిన ఉపన్యాసంలో "మనమందరం నేటికీ భగవాన్ శ్రీరామచంద్రుని పూజించేది ఆయన నిరాబండరత కోసమే. మనమెవ్వరమూ ధనాన్ని పూజించలేదు. పూజించముకూడా. మహర్షులు, సాధుపుంగవులు, సజ్జనులూ మన సమాజంలో పూజలను ఆదరణను పొందినారంటే వారి నిరాడంబర జీవితం కొరకే. వారిత్యాగం, దయార్ద్ర హృదయం, ఔదార్యములే మనకు ఆదర్శములు" అని వ్రాసినారు.

శ్రీఅయ్యంగారు 1891 ఫిబ్రవరి నాల్గవ తేదీన తిరుచానూరులో జన్మించారు. తల్లి శ్రీమతి కనకవల్లి (కాకమ్మ). తండ్రి మహాపండితులు ఏకసంతాగ్రాహి అయిన శ్రీవేంకట వరదాచారిగారు. శ్రీఅయ్యంగార్ గారి పదవ ఏటనే తండ్రిగారు పరమపదించారు. వారి పినతండ్రి 'నడాత్తుతాత' (శ్రీగోపాలం) వారిని ఆదుకొని, తిరుపతి గంగుంగ్రడ మండపం వీధిలోని యింటికి నివాసమును మార్చారు. దానితో అనుది

నమూ తిరుచానూరు నుండి తిరుపతిలోని పాఠశాలకు నడిచివచ్చే కష్టం శ్రీఅయ్యంగారుకు తప్పినది.

శ్రీవేంకటేశ్వర హైస్కూలు నుండి మెట్రిక్యులేషన్, పచ్చయ్యప్ప కళాశాలనుండి డిగ్రీ, మద్రాసు లా కాలేజీ నుండి డిగ్రీలు వారికి నల్లేరుపై నడకగా అలవోకగా లభించినవి. మొదట ప్రభుత్వ పాఠశాలలో వారు లెక్కల మాస్టరుగా చేరినారు. తరువాత చిత్తూరులో అనుభవజ్ఞులు సుప్రసిద్ధ న్యాయవాది శ్రీ పి. దొరస్వామి అయ్యంగార్ వద్ద జూనియర్‌గా చేరి అనుభవము గడించారు. మద్రాసు హైకోర్టు వకీలుగా నమోదు చేసుకున్నారు. తిరుపతి మహంతు, హైదరాబాదు నిజామ్ కేసులను నడిపి మంచి అనుభవము సంపాదించినారు. శ్రీమాన్ చక్రవర్తి రాజగోపాలాచారి (రాజాజీ) గారు సైతం, రాజకీయ కేసుల నిర్వహణకై శ్రీఅయ్యంగారు వద్దకు వచ్చేవారు. కోర్టులో కూడా తలపాగానో, గాంధీ టోపీనో వారు ధరించేవారు. తిరునామాలు సరేసరి ఎల్లప్పుడూ వారి లలాటమును అలంకరించే ఉండేవి.

సంస్కృత పండితులు కృష్ణమాచార్యులు, లక్ష్మిగార్ల పెద్దకుమార్తె శ్రీ శింగారమ్మను తమ 22వ ఏట పరిణయమాడినారు. వారికి ఒక అమ్మాయి, ఒక కుమారుడు కలిగినారు. కాని కుమారుడు పాలు తాగే వయసులోనే చనిపోయినాడు. శ్రీమతి శింగారమ్మ కూడా 1917లో ఒక కుమార్తెను మాత్రము మిగిల్చి పరమపదించింది. ఇరవది ఏడేళ్ల చిన్న వయసులోనే భార్యను కోల్పోయి, ఒక ఆడ శిశువును పెంచే బాధ్యతోబాటు, వయసు మళ్లిన తల్లి, నిరంతర వ్యాధిగ్రస్తుడైన అన్నయ్య పరిచర్యలతో సతమత మవుతున్న అయ్యంగారును బంధువులు తిరిగి వివాహము చేసుకొమ్మని ఒత్తిడి చేసినారు. వారికి తలొగ్గి, తన చిన్నమేనమామ, తిరుమలాచారిగారి కుమార్తె శ్రీమతి చూడమ్మను 1919లో అయ్యంగారు పెండ్లాడినారు. తొలి ఇద్దరు ఆడశిశువులు చనిపోగా, ఈ దంపతలకు ఇరువురు కుమారులు, నలుగురు కుమార్తెలు జన్మించారు.

న్యాయవాద వృత్తి నుంచి రాజకీయ జీవితంలోకి సహజంగానే వారు ప్రవేశించారు. 1922లో మునిసిపాలిటీ అధ్యక్షులుగా ఎన్నికైనారు. మహాత్మాగాంధీగారి పిలుపు నందుకొని 1923లోనే అసహాయోద్యమంలో

ప్రవేశించారు. బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సభలో మాట్లాడినం దుకు వారికి 18 నెలల కారాగారశిక్ష పడి వెల్లూరు జైలుకు పంపినారు. ఒకసారి వారు మదరాసు ఎలెక్షనులో నిలిచి, ఒక ముస్లిం క్లయింటు మక్కా వెళ్తూ తనవద్ద దాచి ఉంచిన 500 రూపాయలను ఖర్చుచేసి గెలిచారు. అయిదేళ్ల తరువాత ఆ డబ్బును వడ్డీతో సహా చిత్తూరులోని ఇస్లాం అసోసియేషనుకు చెల్లించివేశారు.

1934లో స్వరాజ్యపార్టీ కాంగ్రెసులో విలీనమయింది. అప్పుడు శ్రీ అయ్యంగారు చిత్తూరునుండి అసెంబ్లీకి ఎన్నికైనారు. 1937లో లెజిస్లేటివ్ అసెంబ్లీలో పదవీస్వీకారం చేశారు. 1940లో వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1941లో తిరుచిరాపల్లి జైలులో బందీగా ఉన్నప్పుడు రాజాజీ, అవినాశలింగం చెట్టియార్, దుర్గాబాయ్, భక్తవత్సలం, నగిరి వరదాచారి, ప్రకాశం పంతులు మున్నగు ప్రముఖులతో కలిసి గడిపినారు. వారికి వాల్మీకి రామాయణం చదివి తమిళంలో వ్యాఖ్యానించి చెప్పేవారు.

దురదృష్టవశాత్తు శ్రీ అయ్యంగారును, శ్రీ భక్తవత్సలమును తిరుచిరాపల్లి జైలు నుండి నాగపూరు దగ్గరనున్న అమరావతి జైలునకు మార్చినారు. అక్కడ రెండు సదీర్ఘ సంవత్సరాలు గడపవలసి వచ్చినది. ఈ సమయంలో వారి గృహ పరిస్థితి క్షీణించింది. పదిమంది అక్కాచెల్లెళ్లు, భార్య శ్రీమతి చూడమ్మ పొలంనుండి ఆరునెలలకైనా చాలనిగ్రాసం వల్ల ఒక్కపూట భోజనం చేసి రాత్రులు మంచినీళ్లతో గడప వలసి వచ్చేది. తరుచు జైళ్లను మారుస్తూ వారి ఉనికిని తెలియనిచ్చేది కాదు ప్రభుత్వం. ఇంతలో వారి తల్లి అనారోగ్య కారణంగా వారిని ఒకనెల పెరోల్ మీద విడుదల చేశారు.

1942 వరకు ఇంటరీమ్ లెజిస్లేటిక్ అసెంబ్లీలో శ్రీ సంతానం గారితో కలిసి చాలా చురుకుగా పనిచేశారు. అనేక బిల్లులను కూలంకషంగా అధ్యయనంచేసి, సవరణలను ప్రవేశపెట్టినారు. ఆయన సర్వవిషయం పరిజ్ఞానమును ఆశ్చర్యపడిన సహసభ్యులు ఆయనను "వాకింగ్ ఎన్‌సైక్లోపీడియా" (నడిచే విజ్ఞాన సర్వసం) అని ముచ్చటగా పిలిచేవారు. 1946 డిసెంబరు 11వ తేదీన శ్రీఅయ్యంగార్ సంవిధానసభ (కాన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీ) సభ్యులుగా ప్రమాణం చేశారు. కొద్ది రోజులలోనే

స్టీరింగ్ కమిటీ (మార్గదర్శక సమితి)కి ఎన్నికైనారు. సంవిధాన ప్రత్యేక విభాగాన్ని క్షుణ్ణంగా పరిశీలించి, చర్చించి, మెరుగు పరచడానికి అనేక సవరణలను తెచ్చారు. ఆ సమయంలోనే తాత్కాలిక శాసనసభకు శ్రీమావ్‌లంకర్ అధ్యక్షుడు కాగా శ్రీ అయ్యంగార్ ఉపాధ్యక్షులుగా ఎన్నికైనారు.

1953 లో శ్రీ మావ్‌లంకర్ మరణానంతరం శ్రీ నెహ్రూ అధ్యక్ష పదవికి శ్రీ అయ్యంగార్‌ను ప్రతిపాదించి ఏకగ్రీవంగా ఎన్నిక కావించారు. ప్రప్రథమ అధ్యక్షులయిన విఠల్‌భాయి పటేల్ అడుగుజాడలలో నడుచుకుంటూ లోక్‌సభా కార్యక్రమాలను నిర్విఘ్నంగా కొనసాగించి వీరు అందరి మన్ననలను పొందినారు. సున్నితమయిన హాస్యంతో సభను అలరించేవారు. మాటల కెన్నడూ తడబడని వారి వాగ్ధోరికి ముగ్ధులయిన హెచ్.వి. కామత్, వారిని 'అనంతవచనల అయ్యంగార్' అనేవారు. నిమిషానికి నూటయనభై పదాలు చక చకా వరదలా వెలువడే వారి వాగ్ధోరణికి చకితులయిన సభ్యులు వారిని 'ఎమ్‌డెన్' (జర్మన్ జలాంతర్గామి)తో పోల్చేవారు.

1953 లో కామన్‌వెల్త్ దేశాల స్పీకర్ల సమావేశానికి మొట్టమొదటి ఆసియా ఖండ దేశ ప్రతినిధిగా వారు కాన్‌బెర్రాకు వెళ్లినారు. రెండవ ఎలిజబెత్ రాణి పట్టాభిషేకానికి ఇంగ్లండు వెళ్లినారు. ఆస్ట్రేలియాలో జరిగిన కామన్‌వెల్త్ పార్లమెంటరీ అసోసియేషన్ మహా సభానాయకులుగా ప్రతినిధి మండలి అధ్యక్ష పదవిని స్వీకరించి సభను నిర్వహించారు. చౌ-ఎన్-లై, అబ్దుల్ నాజర్, కృశ్చేవ్ మొదలయిన ప్రముఖ విదేశ ప్రధానులు లోక్‌సభను సంబోధించినపుడు శ్రీ అయ్యంగారే అధ్యక్షపీఠంలో ఉండిరి. రెండు అవధులు, ఏడు సంవత్సరాలు, అవిచ్ఛిన్నంగా అజాతశత్రువుగా ప్రశంసాపూరితంగా లోక్‌సభాధ్యక్షునిగా విజయవంతంగా పూర్తిచేసిన శ్రీఅయ్యంగార్‌ను జవహర్‌లాల్ నెహ్రూగారు 1962లో బీహార్ రాష్ట్రానికి గవర్నరుగా నియమించి గౌరవించారు.

శుద్ధగాంధేయులయిన వీరి హయాంలో రాజభవన్‌లో మద్యము మాంసమూ నిషేధించబడినవి. రాష్ట్రంలోని ప్రతిజిల్లాను, నగరాన్నే కాక వీలయినన్ని పల్లెలను కూడా సందర్శించి, ప్రజలకష్ట సుఖాలను పరామర్శించి, వారి సమస్యలను పరిష్కారానికి కృషి చేసేవారు. సాంఘిక,

ధార్మిక, రాజకీయ రంగాలలో ఎన్నో మహాసభలు, ప్రదర్శనలు, చర్చలు, సెమినార్లు వందల సంఖ్యలో రాజభవన ప్రాగంణంలో జరిపించారు. శ్రీ భూర్గుల రామకృష్ణరావుగారి ఆహ్వానంపై శ్రీఅయ్యంగార్ నాగార్జునసాగర్ విజయంచేసి, అచట సత్యనారాయణ స్వామివారి ఆలయానికి హిల్ కాలనీలో శంఖుస్థాపన చేశారు. 15 సంవత్సరాల పాటు మహోన్నత పదవులను హుందాగా, సామర్థ్యంతో సర్వజనరంజకంగా నిర్వహించి చింతిత హృదయాల వీడ్కోలుతో 1967 లో వారు తిరుపతికి తిరిగి వచ్చారు.

సాంప్రదాయ సనాతన ఆచారములను పాటించే కుటుంబానికి చెందినప్పటికీ వారి భావాలు ఉదారంగా ఉండేవి. వారి కనిష్ఠపుత్రిక, సెంట్రల్ సర్వీసెస్ పరీక్షలో సహాధ్యాయుడు, పంజాబీతల్లీ, హిందీ తండ్రి కుమారుడైన సతీష్ శేథీని వర్ణాంతర వివాహం చేసుకోడానికి నిండు హృదయంతో ఆశీర్వదించారు. అదే విధంగా బెంగాలీ కోడలును కూడా సహృదయంతో స్వీకరించారు. అలాగని, వారు తమ సాంప్రదాయాన్ని విడువనూ లేదు. దేవతార్చన చేయకుండా భోజనం చేసేవారు కాదు. సంధ్యాసమయంలో వేంకటేశ్వరుని పటం ముందు కూర్చొని సహస్రనామం పఠించేవారు. దేవుడు మేలుచేస్తే ప్రజలందరూ క్షేమంగా ఉంటారనే విశ్వాసం కలవారు.

ఎనభై ఏళ్ల వయస్సులో, గ్రంథపఠనం, దైవచింతనతో కాలం గడపడానికి ఉపక్రమిస్తున్న శ్రీఅయ్యంగార్‌ను తిరుపతిలోని కేంద్రీయ సంస్కృత విద్యాపీఠం కులపతి పదవి మళ్లీ క్రియారంగంలోకి దింపింది. మథుర బృందావన్‌లో జరిగిన సభలో పాల్గొని సంస్కృత భాషలో ఉపన్యసించిన ఘనత వారిది. అప్పుడే వారికి గౌరవ డాక్టరేట్ బిరుదు నిచ్చి సత్కరించినారు. సంస్కృతాంగ్లములలో సమాన ప్రతిభగల రెండు భాషల ప్రాశస్త్యాన్ని మేళవించి కావ్యాలను రచిస్తే ఎంత బాగుండునని హిరేన్ ముఖర్జీ అన్నారు. ప్రకృతి చోద్యం - ప్రజ్ఞకలవారికి అన్నిరంగాల్లోనూ ప్రజ్ఞ ఉంటుంది. కాని వ్యవధి ఉండదు. వ్యవధి కలవారికి ఎందులోనూ ప్రజ్ఞ ఉండదు. భారతీయ విద్యాభవన్ వారి మాసపత్రికలో, 'అయ్యంగార్ జీవితంలో రాజకీయం ఒకభాగం మాత్రమే; అది వారిని పూర్తిగా ఆకర్షించలేక పోయినది; ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక సమస్యలు వారిని ఎక్కువగా ఆకర్షించినవి' అని వారిని వర్ణించినారు.

వారి సామాజిక దృక్పథం ఉదాత్తమయినది, సువిశాలమయినది. అహోబిల దేవాలయ పునరుద్ధరణ బృందానికి అధ్యక్షులుగానూ, కుష్ఠు నివారణ కేంద్రానికి అధిపతులుగానూ పనిచేశారు. విద్యాభివృద్ధికై 300 సెంట్ల భూమిని దానంచేసి, అందు ఒక గ్రంథాలయ నిర్మాణానికి ట్రస్టును ఏర్పరిచారు. దానికి బ్యాంకులో 30,000 రూపాయల వరకు జమ అయినట్లు మహిళా యూనివర్శిటీ వైస్‌ఛాన్సలరుగా నుండిన శ్రీమతి రాజ్యలక్ష్మిగారు చెప్పినారు. కుడిచేత నిచ్చినది ఎడమచేతికి తెలియనీయని దానపరులు శ్రీ అయ్యంగార్, తిరుపతికి చేరువగా అక్కారాంపల్లెలో కుష్ఠురోగుల కాలనీని స్థాపించి వారికి గృహవసతి కల్పించారు. కాలనీలో బావిని తవ్వించి, పాడి పశువుల పెంపకం, తోటపెంపకం, గోధుమ పంటలను ప్రోత్సహించారు. కలెక్టరు (రాజాజీ) గారిచే ప్రతిరోగికి 30 నుండి 60 రూ. వరకూ పెన్షను ఇప్పించినారు. ఆర్కాటు సంపత్తుగారి సాయంతో వారందరికీ పాదరక్షలు ఇప్పించారు. దేవస్థానం ఆస్పత్రి నుండి వారికి వైద్యసహాయం కల్పించారు. స్వయంగా రోజూ వారిని పరామర్శించి కష్టసుఖాలను కనుగొనేవారు. గాంధీ స్మారక భవన ట్రస్టును ఏర్పరచి, తొలి అధ్యక్షులుగా భవన నిర్మాణానికి విశాల స్థలమును ఏర్పాటు చేసినారు.

ఆంధ్రరాష్ట్ర అవతరణకై శ్రీ అయ్యంగారు ఎనలేని కృషి సలిపినారు. తొలి ఆంధ్రమహాసభకు వీరే అధ్యక్షులు. కోస్తాసీమ, రాయలసీమ సమైక్యతకు పాటుపడిన మహనీయులువారు. కీ.శే. శంకరంబాడి సుందరాచార్యులను "మా తెలుగు తల్లికీ మల్లెపూదండ" అనే ప్రఖ్యాత రాష్ట్రగీతాన్ని రాయడానికి పురికొల్పినది శ్రీ అయ్యంగారే. 1975 వ సంవత్సరపు ప్రపంచ తెలుగు మహాసభ వారిని గౌరవించినది.

కుటుంబంలో వారి వంతు కష్టాలు వారికి వచ్చినవి. అల్లుడు రంగనాథం (సరోజభర్త) 1964లో చనిపోవడం వారిని ఎంతో కలచివేసింది. 1976 వరకూ (85 ఏండ్లవరకూ) ఆరోగ్యంగా ఉన్న శ్రీ అయ్యంగార్ మూత్రపిండాల బలహీనతకు గురి అయినారు. స్వల్పంగా హృద్రోగం తోడయింది. రెండునెలలు మదరాసు ప్రభుత్వ ఆసుపత్రిలో చికిత్స పొందినారు. ఒకనెల స్పృహలేకుండా ఉన్నారు. శ్రీ ఎం.జి. రామచంద్రన్, శ్రీ వి.వి. గిరి, శ్రీ భక్తవత్సలం ప్రభృతులు వారిని పరామర్శించారు. ఆ తరువాత వారిని తిరుపతి రుయా ఆస్పత్రిలో

చేర్చారు. చికిత్స పొందే సమయంలో కూడా పత్రికలవారికి దర్శనమిస్తూ, మధ్యలో జాబులకు జవాబులు రాయిస్తూ ఉండేవారు. ఉద్యోగాలకోసం ఎవరైనా వస్తే విసుగుకోకుండా అందరికి ఉత్తరాలు వ్రాసి ఇస్తూ ఉండేవారు.

1978 మార్చి 19వ తేదీ సాయంత్రం నాలుగు గంటలకు వాంతి చేసుకున్నారు. శరీరం చల్లబడింది. ధర్మదాత, ఉదారస్వభావుడు, స్వచ్ఛంద హృదయుడు కుష్ఠురోగుల బాంధవుడు, నిరాడంబరుడు, సమాజ శ్రేయోభిలాషి ఉభయభాషా ప్రవీణుడు, బహుముఖ ప్రజ్ఞాశాలి, ఆంధ్రోద్యమ పితామహుడు, ప్రముఖ రాజకీయ వేత్త, పాలనా ధురీణుడు, మహామనీషి, ఆంధ్రాకాశంపై సుదీర్ఘ సంవత్సరాలు భాసిల్లిన సూర్యుడు అస్తమించాడు.

ఎం.జి. రామచంద్రన్ వారి భౌతిక కాయానికి ముమ్మారు ప్రదక్షిణచేసి శ్రద్ధాంజలి ఘటించారు. దేశపు నలుమూలల నుండి ప్రజలు వేనవేలుగా వచ్చి నివాళులర్పించారు. పత్రికలు వారి పెద్దసైజు ఫోటోలతో వారి జీవిత విశేషాలను వేనోళ్ల పొగడుతూ ప్రచురించినవి. మొరార్జీ దేశాయి వారిని 'గొప్ప అనుభవజ్ఞుడైన రాజకీయవేత్త'గా అభివర్ణించారు. ఇందిరాగాంధీ వారిని గొప్ప నాయకుడనీ, మేధావి అయిన లోక్‌సభాధ్యక్షుడనీ కీర్తించారు. చెన్నారెడ్డి వారిని దక్షిణభారత భీష్మాచార్యులని ప్రశంసించారు.

వారు అనశ్వరమయిన జ్ఞాపకాలను మనకు వదలి వెళ్లారు. ఆడంబరము, కాఠిన్యములేని వారి సరళ స్వభావము, దయ, మానవత్వము పుణికి పుచ్చుకొన్న కరుణామూర్తి. నిస్సందేహంగా వారు భారతదేశపు మహనీయులలో ఒకరు. వారి ఆశయాలను అనుసరించడమే వారి యెడల మనం చూపగల ఆదరం. వారు మనకు చూపిన ఆదర్శం రెండు మాటలలో చెప్పాలంటే "తేనె మాట; తేట మనసు".



# చెలికాని అన్నారావు

దేవస్థానాల పరిపాలనకు అద్వితీయమైన ఒరవడి పెట్టిన శ్రీఅన్నారావుగారు, 1908 సెప్టెంబరు 8వ తేదీన బొబ్బిలిలో జన్మించారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ముఖ్యమంత్రిగా పనిచేసిన బొబ్బిలి రాజావారి మేనల్లుడీయన. పానుగంటి రాజవంశంలోని శ్రీ పానిగంటి పార్థసారథి రాయనింగారి కుమార్తె అనసూయదేవిని 1929లో పరిణయమాడినారు.

మద్రాసులో ప్రెసిడెన్సీ కాలేజీనుండి పట్టభద్రులయిన అన్నారావుగారి సహాధ్యాయులలో చాలామంది ప్రజాజీవితంలో పేరు ప్రతిష్ఠ లార్జించుకొన్న హేమాహేమీలున్నారు. పట్టం పుచ్చుకొన్నాక రెండు మూడేళ్ళు బొంబాయిలోని లక్ష్మి రంగం కాపర్ మైన్సు లోనూ, మద్రాసు లోని కమర్షియల్ కార్పొరేషన్‌లోనూ డైరెక్టరుగాను, 'న్యూస్‌టైమ్స్' అనే ఇంగ్లీషు దినపత్రికకు మేనేజింగ్ ఎడిటర్‌గానూ పనిచేశారు.

1933లో దేవాదాయ బోర్డు స్వాధీనంలోకి కొత్తగావచ్చిన తిరుమల తిరుపతి దేవస్థానపు కమిషనరుకు పర్సనల్ సెక్రటరీగాను పేష్కారుగానూ పదవిని చేపట్టినారు. అప్పటికి వారు అధిష్ఠించిన పదవుల కంటే కొంత చిన్నహోదా అయినా, వారు వేంకటేశ్వర స్వామి యెడల గల భక్తి భావంతో ఈ ఉద్యోగంలో చేరారు. అదే వారి జీవితంలో కీలకమయిన మలుపు అయింది. సుప్రసిద్ధులయిన కమిషనర్ల సాన్నిధ్యంలో 16 సంవత్సరాలు అకుంఠిత దీక్షతో, అలుపెరుగని శ్రమతో పాలనా మెళుకువలను వంటబట్టించుకున్న వారి ప్రతిభను గుర్తించి అన్నారావుగారిని కమిషనర్‌గా, ముఖ్యనిర్వాహకులుగా నియమించింది ప్రభుత్వం 1949లో. వారి నిర్వహణా సామర్థ్యంవల్ల 1933లో T.T.D. వార్షికాదాయం పదిలక్షలుండేది, 1949లో మూడుకోట్లు అయింది. వారు నెలకొల్పిన విధానాలవల్ల 1979 నాటికి ఆదాయం 15 కోట్లకు పెరి

గింది. ఇదిగాక, 10,000 తులాల బంగారం, గోల్డు బాండ్సులో రిజర్వుగా ఉంది.

ప్రస్తుతం గోవిందరాజులు గుడిగా పిలువబడే ఆలయంలో శతబ్దాలుగా మూతబడిఉన్న ముఖ్యదేవత,. రుక్మిణీ సత్యభామా సహిత పార్థసారథి స్వామి విగ్రహాలున్న ఆలయపు తలుపులు తెరిపించి, ఆలయపు బయటిగోడలను పడగొట్టి పూజాదికాలను ప్రారంభింపజేశారు. ఆ విగ్రహాలలో ఏదో లోపమున్నదనీ, ఆ ఆలయాన్ని తెరవడం అరిష్టదాయకమనీ కొందరు వెనక్కు లాగినా, వెనుకాడక, ఆ ఆలయాన్ని అన్నారావుగారు సాహసోపేతంగా తెరిపించారు.

తిరుమలలో కాటేజీ స్కీమును రూపొందించి, యాత్రీకులకు వసతి సౌకర్యం విస్తృతం చేశారు. ఇటువంటి ముందుచూపు, విజ్ఞతకల స్కీము మిగిలిన దేవాలయాలకు మార్గదర్శకమై దేశపు నలుమూలలా వ్యాపించింది.

శ్రీవేంకటేశ్వర సుప్రభాతానికి ప్రాధాన్యతను అనూహ్యంగా పెంచి, క్యాసెట్లను పుస్తకాలను అందజేసి స్వామిని అర్చించేవారికి సులభసాధనాన్ని వీరు చేకూర్చినారు. మరి యే ఇతరదైవానికీ సుప్రభాతం ఇంతప్రసిద్ధం కాలేదు. ప్రసాదాల తయారీలలో గాని, లడ్డును తయారు చేయుటలోగాని ఒక్కపైసా వృధాకాకుండా లెక్కలువేసి కట్టుబాట్లు చేశారు. ఆర్జిత సేవలను విస్తృతం చేసి పూవులనుండి మధువును సేకరించే భృంగం వలె ధనవంతులనుండి స్వామివారికి ధనం సేకరించారు.

భక్తుల సౌకర్యాలను ఏర్పరచుటలో వారు సదా అనురక్తులుగా ఉండేవారు. తిరుమలకు మొదటి రోడ్డును వేయించారు. క్యూ పద్ధతిలో తొక్కిసలాటలేకుండా ఎల్లరకూ దర్శనం అయ్యే ఏర్పాట్లు చేయించారు. ఆర్జిత సేవలెన్ని ఉన్నా సామాన్యుని ధర్మదర్శనానికి అంతరాయం కలుగకుండా సమయం కేటాయించారు.

1964లో వారు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు పదవినుండి విరమించినపుడు శ్రీ సి. రాజగోపాలాచారిగారు, శ్రీ సి.పి. రామస్వామి అయ్యారుగారు అన్నారావుగారి సేవలను ప్రశంసిస్తూ ఉత్తరాలు రాశారు.

వారి దేవాలయ పరిపాలనానుభవాన్ని తిరిగి తిరుమల తిరుపతి దేవస్థానం వారు మేనేజ్‌మెంటు బోర్డు అధ్యక్షులుగా వారిని 1974 నియమించి 1979 వరకు వినియోగించుకున్నారు. తిరుమల బస్సు సర్వీసులను ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా సంస్థకు ఒప్పగించారు.

దేశంలోని అనేక ప్రసిద్ధ దేవాలయాలకు సలహానివ్వడానికి వారిని ఆహ్వానించారు. ఉత్తరప్రదేశ్ దేవాలయాల నిర్వహణకు పథకాలు తయారుచేసి ఇచ్చారు. వేంకటేశ్వరస్వామివారి ఆలయాలను దేశం లోనూ, విదేశాలలోనూ నిర్మించడానికి తోడ్పడ్డారు.

దేవస్థానమునకు గల విశాల స్థలములను, అశేష సంపదను యాత్రి కుల సౌకర్యములను పెంచుటకే గాక అనేక సంస్థలకు స్థాపించడానికి వారు కారకులు. ముఖ్యంగా విద్యావ్యాప్తికోసం 1939లో ఓరియంటల్ రిసర్చి ఇన్స్టిట్యూట్‌నూ, 1945లో పురుషులకు, స్త్రీలకూ విడివిడిగా రెండు కళాశాలలను, 1959లో సంగీత నృత్యకళాశాలనూ, 1962లో పశువైద్య కళాశాలనూ 1964, వ్యవసాయ కళాశాలలను, ఒక పాలిటె క్నిక్‌ను, మూగ చెవిటి పిల్లలకు పాఠశాలను స్థాపించడంలో వారు కీలకపాత్ర వహించారు. వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తిరుపతిలో వెల యుటకు వారూ దోహదం చేశారు. ప్రస్తుతం సూపర్‌స్పెషాలిటీస్ హాస్పటల్‌గా ఎదిగిన రూయా ఆస్పత్రిని, మెడికల్ కాలేజీని స్థాపించు టకు వారు కారకులు. డీమ్డ్ యూనివర్సిటీగా రూపొందిన కేంద్రీయ సంస్కృత విద్యాపీఠాన్ని తిరుపతికి ఆకర్షించినది వీరే. వారి విద్యా రంగ కృషిని గుర్తించి వారిని ఆంధ్ర, శ్రీ వేంకటేశ్వర, మద్రాసు యూనివర్సిటీలలోనూ, కేంద్రీయ సంస్కృత విద్యాపీఠంలోనూ సెనెట్, లేక గవర్నింగ్ బాడీలలో సభ్యునిగా నియమించారు. తిరుపతిలోనే గాక వెలుపల కూడా విద్యావ్యాప్తికి వారి తోడ్పాటు లభించింది. ఢిల్లీలో శ్రీవేంకటేశ్వర కాలేజీ స్థాపించడానికి ముఖ్యకారకులు వారు.

ఇవిగాక అనేక ఇతర సంస్థలను కూడా వారు ప్రోత్సహించారు. కుష్ఠురోగులకు ఆస్పత్రి, పునరావాస గృహాలు, దేవస్థానం కో-ఆపరేటివ్ స్టోర్సు, ఎంప్లాయీస్ కో-ఆపరేటివ్ బ్యాంకు, స్థాపించారు.

చిత్తూరుజిల్లా పాల సహకార సంఘంలో డైరెక్టరుగా, రైల్వే సలహా

సంఘాలలో రాష్ట్ర, దేశ స్థాయిలలో సభ్యులుగా, టూరిజం డెవలప్ మెంటు కౌన్సిలు మెంబరుగా, పుదుచ్చేరి, పూరి, బద్రీనాథ్, వారణాసి, వైష్ణవదేవి, మైసూరుల దేవాదాయ ట్రస్టులలో సలహాదారుడుగా, పనిచేశారు.

మద్రాసులోని గుగార్స్ సంస్థకు చైర్మన్‌గా ఉంటూ వారి వ్యాపార విస్తరణకు ఎంతో దోహదం చేస్తున్నారు. ప్రవాస భారతీయులు స్వదేశానికి వచ్చినప్పుడు వారికి పర్యటన సదుపాయాలు చేయడానికి ట్రావెలర్స్ క్లబ్‌ను స్థాపించి, నాయకత్వం వహిస్తున్నారు. హిందూస్తాన్ ఇన్సెక్టిసైడ్స్‌కు డైరెక్టరుగా పనిచేశారు.

ప్రస్తుతం వారికి 86 సంవత్సరాలు. మనుమల మనుమలను చూశారు. అయినా నాలుగంతస్తులయినా సరే కర్రసాయం లేకుండా మెట్లెక్కగలరు. ప్రతి మీటింగుకూ తప్పక హాజరు అవుతారు. ఈ వయసులో భారతీయ విద్యాభవన్ తిరుపతి శాఖకు చైర్మన్‌గా ఉంటూ దాని ఆధ్వర్యంలో నడుపుతున్న వేంకటేశ్వర విద్యాలయ నిర్వహణలో ప్రధానపాత్ర వహిస్తున్నారు. దేశంలో కొత్తగా ఊపునందుకుంటున్న చిత్తూరు జిల్లా కన్స్యూమర్ ఫోరంకు అనుబంధమైన తిరుపతి కన్స్యూమర్ సొసైటీకి వారే చైర్మన్. తిరుపతి రేణి గుంట మార్గంలో నిర్మాణం పూర్తిచేసుకుంటున్న శ్రీకల్యాణవేంకటేశ్వర స్వామి నిర్మాణ సంఘానికి కూడా చైర్మన్‌వారే.

దేవాలయ పరిపాలనా ధురీణుడు, తిరుపతి పట్టణ అభివృద్ధికి బీజం వేసి, నీరుపోసి, ఎరువువేసి మహావృక్షం కాగా ఆనందం అనుభవిస్తున్న సేవా తత్పరుడు, నిరంతరం కార్య పరాయణుడు శ్రీఅన్నారావుగారు తిరుపతి కోసం ఎంతో శ్రమించారు. ఒక దేవునికోసం, ఆతని నివాసమయిన పట్టణం కోసం, ఇంత సేవ చేసిన వ్యక్తి మరొకరు ఉండడం దుర్లభం.

శ్రీ వేంకటేశ్వర స్వామి, ఈ తన భక్తుని వల్ల ఇంకా ఎంతో సేవనందుకోవాలని మనం కృతజ్ఞులై వేడుకుందాము.



# శ్రీ సి. దాసు, M.L.A.

అర్హత వుంటే అంత్యజుడైనా అందల మెక్కడానికి అడ్డం లేని దేశం స్వతంత్ర భారతం అని తమ జీవితంలో నిరూపించిన వారు శ్రీ సి. దాసు.

చిత్తూరు జిల్లా చలిచీమల పల్లె గ్రామంలో శ్రీ బూశయ్య - సాలమ్మ అనే హరిజన దంపతుల మూడవ పుత్ర సంతానంగా 1922 జూన్ 7వ తేదీన శ్రీ దాసు జన్మించారు. పసి ప్రాయంలోనే తండ్రిని కోల్పోయిన శ్రీ దాసు, అయిదవ తరగతి కృతార్థుడైన తర్వాత, పెద్దల ప్రోత్సాహంతో, బొమ్మసముద్రం గ్రామంలో మాధ్యమిక పాఠశాలలో చేర్పించింది సాలమ్మ. మూడు మైళ్ళు కాలినడకన పాఠశాలకు వెళ్ళి, పట్టుదలతో, ఎనిమిదవ తరగతి పాసయ్యారు దాసు. ఆపై బంగారుపాళ్యం జమీందారు హైస్కూలులో చేరి, చదువుతోపాటు తోటపని, సహ విద్యార్థులతో కలసి మట్టి రోడ్డు వేయటం మొదలైన ప్రజోపయోగకరమైన కార్యక్రమాలలో పాల్గొనేవారు.

గాంధీ బోధనలలోని ప్రధానాంశమైన హరిజనోద్ధరణ, విద్యార్థి దశలోనే, దాసు తనకర్తవ్యంగా భావించారు. ఆనాటి కాంగ్రెస్ కార్యకర్తల గంభీరమైన ఉపన్యాసాలను మననం చేసుకొని, కొద్దికాలంలోనే యువ కార్యకర్తగా రూపొందారు. రాజకీయాలతో పాటు చరఖా పై నూలు వడకుట, రాగిమాల్టు తయారుచేయుట చేపట్టినారు. వీధులను శుభ్రం చేసేవారు.

రాజారామ్ మోహన్‌రాయ్, కందుకూరి వీరేశలింగం పంతులు మున్నగువారి ఆశయాలను ఆకళింపుచేసుకుంటూనే, 1941 మార్చిలో ఎస్. ఎస్. ఎల్. సి. పాసయ్యారు. పై చదువులకు వెళ్ళే ఆసక్తి, శక్తిలేక సెకండరీ గ్రేడ్ టీచర్ ట్రైనింగ్‌లో చేరారు. ట్రైనింగ్ పూర్తి కాగానే 1942 జూన్‌లో చిత్తూరుకు రెండుమైళ్ళ దూరంలో నున్న

చిన్నమగుడిపల్లె ఎయిడెడ్ పాఠశాలలో ఉపాధ్యాయునిగా నెలకు 20 రూ॥ల జీతంతో చేరారు దాసు. అందులో నెలకు అయిదు రూ॥లు తల్లికి పంపేవారు.

1942లో రామానుజ అయ్యంగార్ నాయకత్వంలో చిత్తూరులో దాసు క్విట్ ఇండియా ఉద్యమం ప్రారంభించారు. అకుంఠిత దీక్షా బద్ధుడైన దాసుజిల్లా జడ్జి "న్యూజాక్" బంగళా ప్రహరీ గోడ దూకి ఒకనాటి అర్ధరాత్రి చిఱుత పులుల్లాంటి కాపలా కుక్కల బారి పడకుండా దొరగారి పాయికానాలో "తెల్లజాతి వెధవల్లారా మాదేశం నుండి పోండి" అని వ్రాసి వచ్చేశారు. జిల్లాలో అరాచకాన్ని సృష్టిస్తూ రహస్య కార్యకలాపాలు కొనసాగిస్తున్నాడని రాజద్రోహం నేరాలక్రింద దాసును అరెస్టు చేశారు.

**గాంధీజీ శిష్యునిగా:** రామానుజు అయ్యంగార్ సలహాపై దాసు బందరు కెళ్ళి గాంధీ ఆశ్రమంలో ఖాదీ కార్యకర్తగా ఒక సంవత్సరము తరిఫీదు పొందారు.

దాసు కొద్దికాలం తర్వాత వార్ధా కెళ్ళి గాంధీ ఆశ్రమం చేరారు. అక్కడ బాపూజీ ఆధ్వర్యాన నడుపబడుతున్న రాజకీయ పాఠశాలకు హాజరయ్యేవారు. స్వయంగా బాపూజీ బోధనలే వింటూ బాపూజీ నుండీ యోగ్యతా పత్రాన్ని పొంది సుశిక్షుతుడైన యోగ్యత కల్గిన, సంఘ సంస్కర్తగా తయారయ్యారు దాసు. అతనికి అచ్చటే పండిట్ నెహ్రూ, గోవింద వల్లభపంత్, జయప్రకాశ్ నారాయణ్, మురార్జీ, రాజాజీ, పొట్టి శ్రీరాములు, ప్రభాకర్‌జీ లాంటి ఎందరో ప్రముఖులతో పరిచయ మైంది.

**సంఘ సేవకునిగా:** దాసు వార్ధా నుండి వచ్చి, చిత్తూరులోని జీవకారుణ్య సమాజం ప్రాథమిక పాఠశాలలో ఇరవై అయిదు రూ॥ల వేతనంపై ఉపాధ్యాయునిగా చేరారు. మద్యపాన నిషేధము గురించి, ప్రచారం చేస్తూ, ఆవేశ పూరితంగా ప్రసంగించే వారు. తల్లిని మాత్రం మరువకుండా ప్రతినెలా జీతంలో 8 రూ॥లు పంపేవారు.

అంటరాని తనమన్నది భగవంతుడు సృష్టించినది కాదని, స్వార్థ పరులూ అగ్రజాతి వారని పిలువబడే పెద్దలు సృష్టించి వర్గభేదాలు ఏర్పరచారని, వారిలోనూ, మనలోనూ ప్రవహించేది ఒకే రక్తమనీ

కులంకన్నా గుణం మిన్న అంటూ ఉద్రేకంతో ఉపన్యసించే వారు దాసు. నీరు గుట్టుపల్లి, దేవుల చెరువు, తంబళ్ళపల్లి, మంచూరు మున్నగు చుట్టుప్రక్కల గ్రామాల కెళ్ళి తన వాగ్ధాటితో ప్రజలను పరవశింపజేసే వారు.

**మైసూరు సంస్థానంలో సత్యాగ్రహము:** భారతదేశం బానిస సంకెళ్ళనుండీ విముక్తి పొందే పదిహేను, ఆగస్టు, 1947 సమీపి స్తున్న రోజులవి. మైసూరు రాష్ట్రంలోని ప్రజలు తమ సంస్థానాన్ని స్వరాజ్యంలో విలీనం చెయ్యాలని మహారాజుపై గట్టి ఒత్తిడి తెచ్చారు. మదనపల్లెనుండి, నూతి రాధాక్రిష్ణయ్య నాయకత్వంలో మొదటి జట్టు మైసూరు రాష్ట్రంలో ప్రవేశించి సత్యాగ్రహోద్యమం ప్రారంభించింది. రెండవ జట్టుకు దాసు నాయకత్వం వహించి సదుము, బాగేపల్లి మార్గంగా చింతామణిలో బహిరంగసభలో ప్రసంగిస్తూ వుండగా, అరెస్టు చేశారు. ప్రజాందోళన తీవ్రమై విప్లవ రూపం దాల్చబోతున్నదని గ్రహిం చిన మహారాజా మైసూరు సంస్థానాన్ని, భారత దేశంలో విలీనం చేసేందుకు అంగీకరించారు.

**జిల్లా బోర్డు సభ్యునిగా:** 1948 డిసెంబరులో జరిగిన డిస్ట్రిక్ట్ బోర్డు ఎన్నికలలో పుంగనూరు తాలూకా, రాయల్‌పేట రిజర్వుడు సీటుకు పోటీ చేసి ఎన్నికయ్యారు దాసు. తాలూకాలోనే కాక జిల్లాలో నిజమైన ప్రజాప్రతినిధిగా గణుతికెక్కారు.

**అంతర్వర్ణ వివాహము:** స్త్రీ పునర్వివాహానికి కందుకూరి వీరే శలింగం పంతులు పునాదివేశారు. దాసు కులాంతర బాల్య విధవా వివాహాన్ని చేసుకొని సంఘసంస్కారానికి చక్కని రాచబాట వేశారు. 1950, ఏప్రిల్ తొమ్మిది, మదనపల్లి గాంధీ విద్యార్థి భవనంలో, వాయు ల్పాడు ఆర్య సమాజ సంఘాధ్యక్షులు జెట్టి నారాయణ స్వామి వర్మ పౌరోహిత్యం వహించి, చిత్తూరు జిల్లాబోర్డు సభ్యులు దాసుకు, కె. లక్ష్మమ్మగారి కుమార్తె, కె. సౌందర్యవతికి వివాహం జరిపారు. పొట్టి శ్రీరాములు, శ్రీ అనంతశయనం అయ్యంగార్, శ్రీ ఆర్.బి. రామక్రిష్ణ రాజు; శ్రీ భాష్యం అయ్యంగార్ మరెందరో ప్రముఖులు వధూవరులను ఆశీర్వదిస్తూ సందేశాలు పంపించారు. పత్రికలు కూడా ప్రముఖంగా ఫోటోలతో ఈ వర్ణాంతర, బాల్య వితంతు వివాహాన్ని పొగడుతూ, ప్రచురించాయి. తల్లి సాలమ్మ వివాహానికి హాజరై, వధూవరులను

దీవించింది. తన కోడలు చూపే గౌరవాభిమానాలకు సంతోషించింది.

**పార్లమెంటు సభ్యుడిగా:** 1962 ఫిబ్రవరి సార్వత్రిక ఎన్నికలలో తిరుపతి రిజర్వుడు స్థానం నుండీ, పార్లమెంటుకు పోటీ చేయుటకు అవకాశమివ్వాలని A.I.C.C. కి దాసు దరఖాస్తు పెట్టారు. దామోదరం సంజీవయ్య, నెహ్రూ బలపఱచక పోయినా, అధ్యక్షస్థానంలో నున్న సంజీవరెడ్డి, లాల్ బహదూర్‌శాస్త్రి నిర్ణయంతో తిరుపతి సీటు దాసుకు లభ్యమైంది.

దాసు భార్య ఇద్దరు కుమార్తెలు, ముగ్గురు కుమారులు సంతానానంతరం, రోగగ్రస్థురాలై, రాయవేలూరు ఆస్పత్రిలో చేరాల్సి వచ్చింది. ఇంతలో తిరుపతి రిజర్వుడు సీటుకు నామినేషన్ పత్రం దాఖలు చెయ్యమని తంతి వచ్చింది. భయంకరమైన క్యాన్సర్ వ్యాధితో, మృత్యువుతోకూడా పోరాడుతున్న భార్యపరిస్థితి లాభంలేదని డాక్టర్లు నిర్ధారించిన తర్వాత, మదనపల్లెకు తెచ్చారు. భర్త ఎన్నికలలో గెలువబోతున్నట్లూ, తనభర్తతో ఢిల్లీ వెళ్ళి అచటి వింతలు విశేషాలు చూడబోతున్నట్లూ వూహించుకుంటూ మురసిపోయేది. పొంచివున్న మృత్యువు తనను 30వ తేదీ జనవరి 1962 న కబళిస్తుందని ఆమెకు తెలియదు. దాసు శ్రీ కాళహస్తిలో, శ్రీ బలరామిరెడ్డితో కలసి, ఒక ఎలెక్షన్‌సభలో ఉపన్యసిస్తుండగా, ఈ కఠోరవార్త తెలిసింది. దాసుకు కారు ఇచ్చినా, తిరుపతిలో వదిలేసి, బస్సులో మదనపల్లె చేరుకున్నారు.

పుట్టిన ప్రతి వ్యక్తికీ చావు తప్పదు. కాబట్టి, తప్పించుకో లేని చావును గురించి, విచారించీ ప్రయోజనం లేదన్న గీతా ప్రబోధం జ్ఞప్తికి వచ్చింది. ఖననం సంస్కారాలు చేసి, పదిరోజులలో తిరిగీ ప్రచార సభలకు వెళ్ళారు.

తిరుపతి లోకసభ రిజర్వుడు స్థానానికి 16,048 ఓట్ల ఆధిక్యతతో దాసు 1962 లో పార్లమెంటు సభ్యుడయ్యారు. అనాధలైన అతని పిల్లలకు ఒక వూరట కల్గింది. భవిష్యత్తుకొక మార్గం ఏర్పడింది.

**హరిజనుల సమస్యల పరిశీలన:** 1964 లో ఏడుగురు సభ్యులతో ఒక కమిటీని సాంఘిక సంక్షేమ మంత్రిణి వేసింది. ఆ కమిటీకి మనరాష్ట్రం నుండీ దాసు సభ్యులు. ఈ సభ్యులు భారతదేశంలో అన్నిరాష్ట్రాలు పర్యటించారు. (1) అంటరానితనం యేయే ప్రాంతాలలో

యే విధంగా వుంది. అస్పృశ్యతా నివారణ ఎంతవరకు జరిగింది. (2) ఆర్థిక, విద్యారంగాలలో హరిజనుల పురోభివృద్ధి యెంతవరకు జరిగింది, ఈ విషయాల గురించి, 1964 నుండి 1968 వరకు పర్యటించి, పార్లమెంటుకు సమగ్రమైన రిపోర్టు అందజేశారు.

1967 సార్వత్రిక ఎన్నికలలో తిరిగి దాసు తిరుపతి నుండీ పార్లమెంటుకు ఎన్నికయ్యారు. అతని గెలుపుకు కారణం, అతని మంచితనం, రాజకీయ చతురత, వాగ్ధాటి, ఆత్మవిశ్వాసం, ఆదర్శం అని చెప్పవచ్చు.

**విదేశ పర్యటన:** 1967 సెప్టెంబరులో పార్లమెంటు ఒక కమిటీని వేసి, విదేశాలలో వ్యవసాయము నాగరికత, రాజ్యాంగ పరిస్థితి గురించి పరిశీలించి, రమ్మంది. అందులో దాసు ఒకరు. 22 రోజులు బెల్జియం, ఫ్రాన్సు, జర్మనీ, ఇంగ్లండు, స్విట్జర్లాండు, రోం, ఇటలీ మున్నగు దేశాల పర్యటించి ప్రముఖులను కలసి, ఒక రిపోర్టు సమర్పించారు.

దాసు లోక్‌సభ ఎస్టిమేట్ కమిటీలోనూ, ప్రెస్ కౌన్సిల్‌లోనూ సభ్యులుగా కూడా పనిచేశారు.

1963 నుండీ 1967 వరకూ, తిరుమల తిరుపతి దేవస్థానం, సలహా సంఘ సభ్యునిగా పనిచేశారు. తిరుపతి నుండీ యెన్నికయిన సభ్యునిపై అమితమైన అభిమానంతో పార్లమెంటు సభ్యునిగా పండిట్ నెహ్రూ మొదలు అందరూ ఆయనను 'బాలాజీ' అని పిలిచేవారు.

**రాష్ట్రానికి రాక:** 1970 లో శ్రీ పి.వి. నరసింహరావు మంత్రి మండలిలో మంత్రిగా దాసు ప్రమాణస్వీకారం చేశారు. 1978 లో శాసనసభ ఎన్నికలలో సత్యవేడు నియోజక వర్గం నుండీ ఎన్నికయ్యారు.

1978 లో మర్రి చెన్నారెడ్డి ముఖ్యమంత్రిగా ప్రమాణస్వీకారం చేశారు. దాసును మంత్రివర్గంలో తీసుకున్నారు. అమిత నష్టాలతో నడుస్తున్న టెక్స్‌టైల్ మిల్లులను తన అనుభవాన్ని వినియోగించి లక్షల లాభాలు గడించే సంస్థగా రూపుదిద్దారు దాసు. ఈయన శక్తి సామర్థ్యాలను గుర్తించారు చెన్నారెడ్డి. అటు తర్వాత అంజయ్య మంత్రి వర్గంలోనూ, శ్రీభవనం మంత్రివర్గంలోనూ దాసు మంత్రిగా కొనసాగారు.

**రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్ష పీఠం:** కాంగ్రెసుపార్టీ వ్యవహారాలు

చాల అసంతృప్తిగా వున్నాయి. ఒక అనుభవజ్ఞుడు, సమర్థుడు, రాష్ట్ర పార్టీ అద్యక్షుడుగా వుండాలని శ్రీమతి ఇందిరాగాంధీ, దాసును కోన ప్రభాకరరావ్ స్థానంలో ఎంపిక చేసింది. మంత్రిగా కొనసాగుతూనే, అధ్యక్ష పదవిచేపట్టిన దాసు గాంధీభవన్ పరిస్థితులను పరిశీలించారు. కాంగ్రెసు ఆఫీసును ఒక క్రమపద్ధతిలో నడపాలని ఆశించి అందుకు తగినవిధంగా, కిసాన్ సెల్, మహిళావిభాగము, హరిజన గిరిజన సెల్, పంచాయతీరాజ్ సెల్, నొమాడికల్ సెల్ (స్థిరనివాసము లేని వారి విషయు పరిశీలన) మున్నగునవి ఏర్పరచారు. వీటి నిర్వహణబాధ్యత సమ ర్థవంతులైన వారి కప్పగించారు. డి.సి.సి. లను, పి.సి.సి.ల సభ్యులను నిర్ణయించేందుకు దాసు తన అధ్యక్షతన ఒక కమిటీని నిర్ణయించారు.

కులాంతర వివాహాలు చేసుకున్న జంటలకు ప్రభుత్వ ఇండ్లలోనూ, హౌసింగ్ కార్పొరేషన్ కట్టే యిండ్లు కేటాయింపులో ప్రాధాన్యత యివ్వాలి. శాస్త్రి, శర్మ, శెట్టి, రెడ్డి, చౌదరి, యాదవ, నాయుడు లాంటి కుల గౌరవ పదాలను వాడకూడదని రాజ్యాంగంలో సూచించాలన్నారు దాసు.

దాసు గొప్ప సంఘ సంస్కర్త నిశితమైన ఆలోచనా పరులు పరిపా లనాదక్షులు, సూక్ష్మబుద్ధిగల రాజకీయవేత్త, మనస్సాక్షిని మేల్కొలిపే మహత్తర శక్తిగలవారు. నిరాడంబర జీవనానికి, మహోన్నతమైన ఆలోచ లనకు, దూరదృష్టి కార్యదీక్షగల దిట్ట. తాను నమ్మిన దానిని నిర్భయంగా చెప్పగల వ్యక్తి. రాష్ట్రాభివృద్ధిలో, ప్రజాసేవ చేయాలనే తపన గల్గిన సౌజన్యమూర్తి.

అతి చిన్న కులంలో పుట్టి పెరిగినా స్వయంకృషితో పైకి వచ్చారు. సత్యవేడు నుండీ 1990 ఎన్నికలలో అసెంబ్లీకి ఎన్నికై, ఎం.ఎల్.ఎ.గా కొనసాగుతున్నారు. ఫిషరీస్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ అధ్యక్షులుగా ఎనలేని సేవలు ఈనాడూ చేస్తున్నారు.

ఏడుపదులు వయస్సుదాటిన దాసు ఆరోగ్యం, ఇటీవల దెబ్బతిన్నది. ఉత్తమోత్తముడైన దాసు, ఆయన కుటుంబ సభ్యులు ఆయురారోగ్య, సుఖ, సంపదలతో కలకాలం వుండాలని దైవాన్ని ప్రార్థిద్దాము.

తిరుపతిలో జరిగిన మహాసభలో ఏప్రిల్ 17, 1994న శ్రీ దాసు గారికి "అంబేద్కర్ రత్న" గౌరవ బిరుదునిచ్చి, సత్కరించారు.



# కీ|| శే|| శ్రీ రెడ్డివారి నాదమునిరెడ్డి

శ్రీ రెడ్డివారి నాదమునిరెడ్డి, 14వ తేదీ, నవంబరు నెల, 1914 లో చంద్రగిరి మండలం, నర్సింగాపురం గ్రామంలో, శ్రీ రెడ్డివారి నరసింహారెడ్డి, శ్రీమతి చెంగమ్మలకు, ద్వితీయ సంతానంగా, జన్మించారు. శ్రీ ఆర్. నరసింహారెడ్డి, ఆంధ్ర యూనివర్సిటీ సిండికేట్ మెంబరుగా పనిచేసి వుండినారు.

శ్రీ నాదమునిరెడ్డి ప్రాథమిక విద్య సెంకడరీ విద్య చంద్రగిరి హైస్కూలులో గడిచింది. తర్వాత వీరి కాలేజి విద్య కొనసాగించి, బి.ఎ. వరకూ చదివారు.

వీరు ప్రముఖ సంపన్నకుటుంబం, మదనపల్లె, తంబళ్ళపల్లెలకు చెందిన తరిమెల నాగిరెడ్డి రామచంద్రారెడ్డి కుమార్తె అయిన శ్రీమతి లీలావతమ్మను వివాహమాడారు. మద్రాసు సంయుక్త రాష్ట్ర ఎం.ఎల్.ఎ. శ్రీ రామక్రిష్ణారెడ్డి; రాజంపేట ఎం.పి.గా రెండుసార్లు ఎన్నికైన శ్రీ టి.ఎన్. విశ్వనాథరెడ్డి, వీరికి బావమరదులు.

శ్రీ నాదమునిరెడ్డి 23వ ఏటనే, చురుగ్గా రాజకీయాలలో పాల్గొని, జిల్లా రాజకీయాల్లో ప్రముఖుడయ్యారు. పలు సత్యాగ్రహాలలో పాల్గొన్నారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా, వీరిని అరెస్టుచేసి, తిరుచినాపల్లి జైలులో 6 నెలలు బ్రిటిష్ ప్రభుత్వం నిర్బంధించింది. 1932-33 లో తొలిసారిగా కాంగ్రెస్ మీటింగ్ శ్రీ ఆర్. నాదమునిరెడ్డి ఆధ్వర్యంలో జరిగింది. ఆ సమావేశములో శ్రీ కట్టమంచి రామలింగా రెడ్డి, శ్రీ టి.ఎన్. రామక్రిష్ణారెడ్డి పాల్గొన్నారు.

1937 లో శ్రీ టి.ఎన్. రామక్రిష్ణారెడ్డి మరణానంతరం, మదనపల్లె శాసన సభ్యులుగా, శ్రీ నాదమునిరెడ్డి ఎన్నుకొనబడ్డారు. ఆంధ్రరాష్ట్రం

ఏర్పడిన తర్వాత 1952లో, వీరు తిరిగి ఎం.ఎల్.ఎ.గా ఎన్నికయ్యారు. 1955 నుండీ 1962 వరకు; 1962 నుండీ 1967 వరకు, చంద్రగిరి ఎం.ఎల్.ఎ. గా ఎన్నికై, అనన్య సేవలు చేశారు.

చిత్తూరు జిల్లా కో-ఆపరేటివ్ సొసైటీ ప్రెసిడెంటుగా 1953 నుండి 1965 వరకు, 12 ఏండ్ల సుదీర్ఘకాలం, ఎనలేని సేవలనందిం చారు. వీరు సొసైటీ సర్వతోముఖాభివృద్ధికి చేసిన సేవల జ్ఞాపకార్థం, జిల్లా కో-ఆపరేటివ్ సొసైటీ భవనానికి "నాదమునిరెడ్డి భవనము" అని నామకరణం చేసి, వీరిని గౌరవించారు.

1952 నుండీ 1964 వరకు, తిరుమల తిరుపతి దేవస్థానం బోర్డు మెంబరుగా వీరు తమ సేవల నందించారు. అనంతరం, 1964 నుండీ 1965 వరకు టి.టి.డి. చైర్మెన్‌గా అత్యున్నత పదవిని సమర్థతతో అలంకరించారు.

1962 నుండీ, 1964 వరకు చిత్తూరు జిల్లా పరిషత్ చైర్మన్ గానూ, 1981 నుండీ 1983 వరకూ ఎం.ఎల్.సి. గా బాధ్యతలను నిర్వహించారు.

వీరు జిల్లాలో, ప్రత్యేకంగా, నరసింగాపురం కర్షక సహకార సేవా సంఘంను 1975 వ సంవత్సరం ప్రారంభించారు. చంద్రగిరి స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా బ్రాంచి సంస్థాపించేందుకు కృషి చేసి, సఫలీకృతులయ్యారు.

1978 వ సంవత్సరములో శ్రీ మర్రి చెన్నారెడ్డి రాష్ట్ర ముఖ్యమం త్రిగా వున్నప్పుడు, చిత్తూరు జిల్లాలో 24 అప్పర్ ప్రైమరీ స్కూళ్ళను, హైస్కూళ్ళుగా మార్చి, విద్యార్థుల, ప్రజల మన్ననలకు పాత్రులయ్యారు.

చిత్తూరు, తిరుపతి పట్టణాలలోనే ఆనాడు ప్రత్యేక బాలికల పాఠ శాలలుండేవి. అన్ని తాలూకా కేంద్రాలలో బాలికలకు, హైస్కూళ్ళు మంజూరు చేయించిన ఘనత వీరికే దక్కింది.

గాజుల మండ్యం చక్కెర కర్మాగారం వైస్ చైర్మన్‌గా వ్యవహరిం చారు. దాని సంస్థాపనకు, పురోభివృద్ధికి ఎంతగానో కృషిచేశారు. జిల్లా

హోల్‌సేల్ మార్కెటింగ్ సొసైటీ చైర్మన్, వరదయ్య పాళ్యంలోని అవంతి లెదర్ ఫ్యాక్టరీ ఛేర్మెన్‌గా వ్యవహరించి అందరి మన్ననలకూ పాత్రులయ్యారు.

తిరుపతిలో గాంధీ భవన్ నిర్మాణం చేపట్టాలన్నదే శ్రీ రెడ్డివారి చివరికోరిక. అందుకుగాను, గాంధీభవన్ ట్రస్ట్ అధ్యక్షులుగా వ్యవహరిస్తూ, రామచంద్ర గుంట కెదురుగా నున్న జాగాలో, నిర్మాణపనులు చేపట్టారు. కొంతకాలంగా ఆరోగ్యం సరిలేకున్నా, ప్రతిరోజూ భవన్ నిర్మాణస్థలం సందర్శించేవారు.

ఇంతటి ఘనచరిత్ర కల్గిన ప్రముఖ రాజకీయవేత్త, గాంధేయవాది, వృద్ధ కాంగ్రెసు నాయకులు, శ్రీ రెడ్డి వారి నాదమునిరెడ్డి, సాయంత్రం 6 గంటల వరకూ గాంధీభవన్ నిర్మాణ పనులు పర్యవేక్షించి, 17-9-'93, ఇంటికి తిరిగి వెళ్ళిన కొంతసేపటికే, తీవ్రమైన గుండెపోటుకు గురై, 8.03 గంటలకు తిరుపతి రుయా ఆస్పత్రిలో తమ 78వ ఏట పరమపదించారు.

దావానలంగా ప్రాకిన ఆయన మరణవార్త, స్థానిక పత్రికలన్నీ ప్రముఖంగా, ఫోటోలతో సహా ప్రకటించాయి. నర్సింగాపురంలో వారి స్వగృహంలో వారి మృతదేహాన్ని కడసారి చూచి, అంజలి ఘటించడానికి, జిల్లా నుండీ, ఇతరజిల్లాల నుండీ, ప్రముఖులెందరో ప్రవాహంలా వచ్చి దర్శించారు.

18-9-93 వ తేదీ, సాయం సమయం, ఘనంగా వీరికి దహన సంస్కారాలు జరిగాయి. జిల్లా కలెక్టరు మున్నగు ఉన్నతాధికారులు మొదలు, ఎం.ఎల్.ఎ.లు జిల్లా నాయకులు, చిన్నా పెద్దా అనక, అనేక వేలమంది, స్మృత్యంజలి ఘటించారు.

కీ॥ శే॥ నాదమునిరెడ్డి గారికి, ఇద్దరు కుమారులు. రెండవ కుమారుడు, డా॥ రాజశేఖర్ రెడ్డి, చంద్రగిరి పంచాయత్ సమితి అధ్యక్షులుగానూ, డిస్ట్రిక్ట్ కాంగ్రెసు ప్రెసిడెంటుగానూ సేవనందించి, ప్రస్తుతం తిరుపతి పట్టణాభివృద్ధి సంస్థ చైర్మెన్‌గా రెండవదఫా పదవినలంకరించి యున్నారు.

కీ॥ శే॥ నాదమునిరెడ్డి తను ఎం.ఎల్.సి. పదవిని ఆశించకుండా, శ్రీ

ఆదికేశవులునాయుడు గారికిప్పించిన త్యాగమూర్తి, నిస్వార్థ పరుడు. ఎవరు తన్నాశ్రయించినా, కాదనక తన పలుకుబడి నుపయోగించి, సహాయము అందజేసిన ధన్యజీవి. చిత్తూరు జిల్లాలో స్కూలు భవనాల నెన్నో నిర్మింపజేసిన ఘనుడు. మృదు వచనములతో, దయా కరుణా మూర్తియై, ఆతిథ్య ఆదరణ చూపిన మహనీయుడు. అక్టోబరు నెల 3, 1993 న పత్రికలు ప్రత్యేక సంచికలను విడుదల చేసి, నివాళుల ర్పించాయి. అందులో శ్రీరెడ్డిగారి గుణగణాలను ప్రస్తుతిస్తూ చంద్రగిరి సమితి ఉపాధ్యాయ బృందం ఈ విధంగా ప్రకటించింది. "ఆంధ్రప్రదేశ్ లోని అగ్రశ్రేణి రాజకీయ ధురంధరుల్లో నొకరుగా భాసించి, చిత్తూరు జిల్లా పరిషత్ అధ్యక్షులుగా ప్రజల ఆదరాభిమానాలను చూరగొని, తిరుపతి శాసన సభాసభ్యత్వాన్ని సమర్థవంతంగా నిర్వహించి, శాసన మండలి సభ్యులై అహర్నిశలు ప్రజాశ్రేయస్సుకై కృషిసల్పి, కలియుగ దైవమైన శ్రీ వేంకట గిరీశుని దేవస్థానాధ్యక్ష పదవిని భక్తి ప్రపత్తులతో నిర్వహించి, భువినుండి దివికేగిన పూజ్యు పూజ్యులు శ్రీ రెడ్డివారి నాద మునిరెడ్డిగారు, సహృదయులు, సహనశీలి, సచ్ఛీలురు, సౌజన్యమూర్తి, సౌమ్యస్వభావులు, ఆత్మ జ్ఞాన సంపన్నులు, సుఖదుఃఖాది రాగద్వేషాలకతీతులు, నిగర్వి, నీతిపరులు, నిరాడంబరులు, నిర్మల స్వాంతులు, నిస్వార్థ సేవాతత్పరులు, నిత్య సత్య వచనులు, నిశ్చల కార్య దీక్షా దక్షులు, నీతికోవిదులు, ధర్మ చింతనాతత్పరులు, దీనజన రక్షణమే జీవిత పరమావధిగా నెంచిన విశ్వసనీయులు, విశుద్ధ వర్తనులు, సర్వగుణ భూషణ భూషితులు, ధైర్య స్థయిర్యం గాంభీర్య మృదు మధుర వచనాలతో ప్రజలను చేరదీసిన దయార్ద్ర హృదయులు, విజ్ఞాన వంతులు, ప్రాజ్ఞులు, లోకజ్ఞులు, చిరస్మరణీయులు, అయిన శ్రీ రెడ్డిగారికి ఆత్మ శాంతి చేకూర్చాలని నిండు మనస్సుతో ఆకాంక్షిస్తూ, సప్తగిరి సార్వభౌముని శరణుజొచ్చి అంజలి ఘటించి ప్రార్థిస్తున్నాము."

ఇంతటి రాజకీయ ఘన చరిత్రగల వీరి కుటుంబ సభ్యులు మరిన్ని ప్రజోపయోగ కార్యాలు నిర్వహించ గలరనీ, మరిన్ని రాజకీయ ఉన్నత పదవుల నలంకరించ గలరనీ ఆశిద్దాము.



# ప్రొఫెసర్ ఎం.వి. రామశర్మ

ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, వేలూరు, బళ్లారి సెంట్రల్ జైళ్లలో ఆరేసి మాసాలు జైలుశిక్ష ననుభవించిన ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు శ్రీ ముమ్వా రాజగోపాల్ గారి పుత్రులుగా 6-9-1920 న శ్రీ ముమ్వా వెంకటరామశర్మ గారు జన్మించారు.

బాల్యం నుండీ తెలివి తేటలతో అగ్రశ్రేణిలో విద్య నభ్యసిస్తున్న శ్రీ శర్మగారు హిందూ కాలేజీ, మచిలీపట్నం, పి.ఆర్. కాలేజి, కాకినాడలలో డిగ్రీ చదువులను పూర్తిచేసుకొని పై చదువులకు వేల్సు (ఇంగ్లండు) విశ్వవిద్యాలయంలో 1946-49 నడుమ ఇంగ్లీషు సాహిత్యంపై గవేషణ సాగించి డాక్టరేటు పట్టం పుచ్చుకున్నారు.

తిరిగి వచ్చాక ఢిల్లీ యూనివర్శిటీ కాలేజీలో 1950-55 నడుమ అధ్యాపకులుగా ఉండి తిరుపతి శ్రీవేంకటేశ్వర యూనివర్శిటీలో ఇంగ్లీషు విభాగంలో ప్రధానాచార్యులుగా చేరినారు. పదకొండు మందికి డాక్టరేటు డిగ్రీకినీ, ఆర్గురికి యం.ఫిల్. డిగ్రీకిని దర్శకులుగా వ్యవహరించారు. షేక్స్‌పియర్, మిల్టన్, జాకోబియన్ డ్రామా, 20వ శతాబ్దపు నాటకాలపై వారు ప్రవీణులుగా పేరొందినారు. ఆచార్య పదవినుండి ముందుకు సాగుతూ, యూనివర్శిటీ ఆర్ట్సు విభాగానికి డీన్‌గా, ఆర్ట్సు & సైన్సు కాలేజీల ప్రిన్సిపాలుగా, సిండికేట్ మెంబరుగా, ఎదిగి 1980-84 నడుమ యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్‌గా శిఖరస్థాయి చేరుకున్నారు.

డాక్టరేటు చదువుకై మూడేండ్లు ఇంగ్లండులో గడపినది గాక, 1958 లో నూరురోజులు అమెరికన్ యూనివర్సిటీలలో విద్యాప్రణాళికలను అధ్యయనం చేసి వచ్చారు. 1968 ఆగస్టులో సిడ్నీలో జరిగిన కామ

న్‌వెల్త్ విశ్వవిద్యాలయాల కాంగ్రెసుకు శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రతినిధిగా వెళ్లినారు.

1981 మార్చి నెలలో హాంకాంగ్‌లోనూ, 1983 ఆగస్టులో బర్మింగ్‌హామ్‌లోనూ జరిగిన కామన్‌వెల్త్ వైస్ ఛాన్సలర్స్ సభలలో పాల్గొన్నారు.

అనేక యూనివర్శిటీలు శ్రీశర్మగారి ప్రతిభను గుర్తించి సన్మానించినవి. ఆంధ్రాయూనివర్శిటీ గౌరవ డాక్టరేట్ బిరుదమును 1982 అక్టోబరులో ఇచ్చి సత్కరించినది. కార్డిఫ్ యూనివర్శిటీ కాలేజి 'fellow'గా గుర్తింపు నిచ్చింది. తిరుపతి మహిళా యూనివర్శిటీ, శ్రీ కృష్ణదేవరాయ యూనివర్శిటీ, గుల్బర్గా యూనివర్శిటీ, నార్త్ ఈస్టరన్ హిల్ యూనివర్సిటీ, (షిల్లాంగ్) లు వారిని విజిటింగ్ ప్రొఫెసరుగా నియమించి సత్కరించాయి. ఉత్తమ అధ్యాపకునిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారిని సత్కరించినది.

కేంబ్రిడ్జి అంతర్జాతీయ బయోగ్రఫీ సెంటర్ ప్రచురించిన ప్రపంచ ప్రఖ్యాతుల జీవిత సంగ్రహాలలో శ్రీశర్మగారి జీవిత విశేషాలు కూడా చోటు చేసుకోవడం దేశానికే గర్వకారణం. చికాగో నుండి 1980-81 లో వెలువడిన 'who is who' లో కూడా వీరిని చేర్చారు. మనదేశంలో వెలువడిన 'who is who' లలో వరుసగా అనేక సంవత్సరాలు వీరి పేరు చేరి ఉండడం సహజమే.

శ్రీ శర్మగారు రచించిన 12 గ్రంథాలను విశ్వవ్యాప్తిగల మాక్మిలన్ వంటి పబ్లిషర్లు ప్రచురించారు. కొన్ని పునర్ముద్రణ కూడా అయినవి అవి ప్రధానంగా మిల్టన్, షేక్స్పియర్, హేవర్డ్ వంటి వారి సాహిత్య పరిచయాలు, విమర్శలు. ఇవి గాక వారు రచించిన వ్యాసాలు అనేక సాహిత్య పత్రికలలో, సభాజ్ఞాపిక ప్రచురణలలోనూ ప్రచురింపబడినాయి.

వీరి స్వతంత్ర రచనలు ఎన్నో ఉన్నవి. (1) Towards marriage (2) The carnival, (3) Sakuntala, (4) The Mahatma (7 one - act plays, (5) Collected plays (11) A # UO. (1) The stream, (2) The farewell party, (3) Look Homeward, (4) The bliss of life (5) Partners new, (6) Height of noon అనే నవలలు రచించారు. వీటిలో కొన్ని మరు ముద్రణకూడా జరిగినవి. వీరి గ్రంథాలలో భా

తీయ సంస్కృతి యెడల వీరికి గల అభిమానం తొంగి చూస్తూ ఉంటుంది. వీరు విఖ్యాత గేయకారుడైన క్షేత్రయ్య వంశీకులు కావడం ఇందుకు ఒక ముఖ్యకారణం కావచ్చును.

వీరికి ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. వీరి సతీమణి కాలం చేసిన తరువాత వేరే ఉద్యోగ వ్యాసంగం పెట్టుకోక ఇంటి దగ్గరనే ఉంటున్నారు. వారి పూర్వీకులయిన క్షేత్రయ్య గారిని గురించి, మిల్టన్, భారతీయ పురాణ రచనలను చర్చిస్తూ ఒక గ్రంథాన్ని రచిస్తున్నారు.

విద్య ఒక్కటే ఏకైక లక్ష్యంగా గల వీరు క్షుద్ర రాజకీయాలకూ కులకక్షలకు దూరంగా ఉంటూ విద్యాలయాలలో మంచి వాతావరణాన్ని నెలకొల్పడానికి చాలా కృషిచేశారు. నేటికీ యుక్తాహార విహారాలతో ఆరోగ్యాన్ని కాపాడుకుంటూ సాహిత్యసభలకు శోభ చేకూరుస్తూ ఉన్నారు. ప్రపంచఖ్యాతి గడించిన ఈ సాహిత్య మహామేరువు తిరుపతిలోనే స్థిరనివాసి కావడం తిరుపతి సుకృతం.

* * *

> "తాను చేయబోయే పనిని గురించి ముందుగానే గొప్పలు చెప్పుకునే వ్యక్తి, ఆ పనిని ముందుగానే సాధించిన వ్యక్తి కంటె అల్పుడు."
>
> -సంస్కృత సూక్తి
>
> "తన పట్ల తనకు విశ్వాసం ఉన్న వాడెవడు బానిసకాడు."
>
> -సైరియస్ మ్యాగ్జియస్



# డా॥ అగరాల ఈశ్వరరెడ్డి

జూలై ఒకటవ తేదీ, 1934 వ సంవత్సరంలో తూకివాకం గ్రామం, రేణిగుంట మండలం, చిత్తూరు జిల్లాలో, జన్మించిన డా॥ అగరాల ఈశ్వరరెడ్డిగారు మద్రాసు విశ్వవిద్యాలయం నుండీ ఎం.ఎ.(పాలిటిక్స్); ఎం.ఎ.(చరిత్ర); ఎం.ఎ.(ఎకనామిక్స్) పట్టములను పొందారు. న్యాయ శాస్త్రంలో కూడా మద్రాసు విశ్వవిద్యాలయం నుండీ బి.ఎల్. పట్టం, రాంచి యూనివర్శిటీ నుండి డాక్టరేట్ పట్టం (పిహెచ్.డి.) పొందినారు.

చిన్నప్పటి నుండీ రాజకీయాలలో ఆసక్తి కనబరచిన డా॥ ఈశ్వ రరెడ్డి గారు 1967 లో తిరుపతి అర్బన్ కాంస్టిట్యుయెన్సీ నుండీ ఎం.ఎల్.ఎ. (లెజిస్లేటివ్ అసెంబ్లీ మెంబరుగా) దేశంలోనే అత్యధిక మెజారిటీ ఓట్లతో ఎన్నికయ్యారు. తిరిగీ 1978లో, భారత జాతీయ కాంగ్రెస్(ఐ) టికెట్ మీద, అదే తిరుపతి కాంస్టిట్యుయెన్సీలో రెండ వసారి అసెంబ్లీ మెంబరుగా ఎన్నికయ్యారు. లెజిస్లేటరుగా స్వీయ ప్రతిభతో 27-3-1981 లో వీరు క్యాబినెట్‌గా హోదాగల డెప్యూటీ స్పీకర్‌గా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు.

తదుపరి, స్పీకరుగా ఎన్నికై 23-9-1981 నుండీ 16-1-1983 వరకూ సమర్ధవంతంగా ఆ పదవిని నిర్వహించారు.

డా॥ రెడ్డిగారు పలు సంస్థలలో మెంబరుగా ఉన్నారు. వాటిలో

1. ఇండియన్ పొలిటకల్ సైన్సు అసోసియేషన్, తమిళనాడు అకాడమీ ఆఫ్ పొలిటికల్ సైన్స్, మద్రాసు.
2. ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్, న్యూఢిల్లీ.
3. లయన్స్‌క్లబ్, తిరుపతి; డైనర్స్‌క్లబ్ ఆఫ్ ఇండియా, చార్టర్డ్ మెంబరు.

4. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం సిండికేట్‌లో 12 ఏండ్లపాటు సభ్యులు.

5. ఆంధ్రప్రదేశ్ అగ్రికల్చరల్ యూనివర్సిటీ బోర్డ్ ఆఫ్ మేనేజ్‌మెంటులో 5 సంవత్సరాలు సభ్యులు.

6. ఉస్మానియా విశ్వవిద్యాలయం సెనేట్ మెంబరు.

7. ఫ్రెండ్స్ ఆఫ్ సోవియట్ యూనియన్ స్టేట్ యూనిట్, హైదరాబాదు, వైస్ ప్రెసిడెంట్, చిత్తూరు జిల్లా ఫ్రెండ్స్ ఆఫ్ సోవియట్ యూనియన్ అధ్యక్షులు.

8. స్టేట్ ఐ.ఎన్.టి.యు.సి. (ఇండియన్ నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్) మరియు టెక్స్‌టైల్ లేబరర్స్ సంస్థకు ప్రెసిడెంట్.

9. చిత్తూరు జిల్లా కన్‌స్యూమర్ కౌన్సిల్ అధ్యక్షులు.

10. ఇండో వెస్ట్ జర్మనీ ఫ్రెండ్షిప్ సొసైటీ అధ్యక్షులు.

విదేశీ యానము:

1. డాక్టర్ ఈశ్వరరెడ్డిగారు కౌలాలంపూరులో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలలో పాల్గొని, సింగపూర్, మలేషియా, దుబాయ్, నేపాల్ దేశాలలో పర్యటించారు.

2. పార్లమెంటు సభ్యుల పాపులేషన్ మరియు డెవలప్‌మెంట్ ఆసియా మహా సభకు బీజింగ్, చైనాలో హాజరయ్యారు.

3. ఫిజీ ద్వీప సముదాయంలోకి సువానగరంలో జరిగిన కామన్‌వెల్త్ పార్లమెంటరీ మహాసభలో పాల్గొన్నారు.

4. ఇంగ్లండులో జరిగిన కామన్‌వెల్త్ పార్లమెంటు మహా సభలకు, హాజరయ్యారు.

డాక్టర్ రెడ్డి రచయితగా కూడా పేరు పొందారు. వారు వ్రాసి ప్రచురించిన రచనలలో కొన్ని:

1. "Lok Sabha Elections 1977 and 1980 in Andhra Pradesh", Madres. TAPS, 1985. Book was released by Sri P.V. Narasimha Rao, then Honb'le Union Minister for Human

Resource Development, and presently the Honb'le Prime Minister of India in New Delhi.

2. "Electoral Reforms in India" (Edited along with Dr. D. Sundar Ram, S.V. University), New Delhi, Uppal Publishing House, 1992. Book was released by Sri K. Vijaya Bhaskara Reddy, the Honb'le Chief Minister of Andhra Pradesh in Hyderabad on January 3, 1993.

3. "State Politics in India: Reflections on Andhra Pradesh (Edited along with Dr. D. Sundar Ram, S.V. University), New Delhi, M.D. Publications Pvt. Ltd. , 1994.

అనేక పత్రికలలో డాక్టర్ రెడ్డిగారు వ్యాసాలు వ్రాశారు. వాటిలో కొన్ని

1. "Rayalaseema still a neglected area". Deccan Chronicle, May 30, 1968.
2. Legacy of Ambedkar - Deccan Chronicle, April 1986.
3. "Priviliges and duties of The Governor" Open Page "The Hindu" - May 12, 1987.
4. "Scope of Presidential Powers". Deccan Chronicle - 9th July, 1987.
5. "Indira - a great democrat" - News Today - Lecture delivered in Madras University on November 19th and 20th, 1986.
6. The Pragmatic Attitude to Teaching, The Hindu, September, 1987.
7. India Choosing a president - The Deccan Chronicle.
8. Second Chambers - Andhra Jyothi.
9. Student unrest - a Universal Phenomenon, Andhra Patrika.

10. "Srimathi Indira Gandhi and the National Integration", Andhra Jyothi - Oct. 31st 1987.

11. "Jawaharlal Nehru and Modern India", The Indian Journal of Political Science, October - December, 1989.

12. "Administering clean and fair elections in India, The Indian Journal of Public Administration, July - September, 1992 (Special Issue). This Issue was released by Dr. Shankar Dayal Sharma, His Excellency, the president of India.

and a host of other articles, conference papers and Radio Talks.

ఈమధ్యనే 28-12-'93 న ఘనంగా షష్టిపూర్తి చేసుకున్న శ్రీ రెడ్డిగారు మరిన్ని ప్రజోపకర సేవలు చేస్తూ, ఖ్యాతి గడించాలని ఆశిద్దాము. నిస్వార్థపరుడు, నిరాడంబర జీవి, విద్యావంతుడు, నిగర్వి, ప్రజాభిమాని, శ్రీ శ్రీనివాస జూనియర్ కళాశాల (రేణిగుంట) సంస్థాపకుడు, మూడు దశాబ్దాల ప్రజా జీవితంలో విజయాల పరంపర కార్య దక్షత మూర్తీభవించిన విశిష్ట వ్యక్తి, దయ, స్నేహం మేళవించిన మహోన్నత వ్యక్తి, బడుగు వర్గాల బాంధవుడు, బహుముఖ ప్రజ్ఞాశాలి, అకుంఠిత దేశభక్తుడు, అని ఆనాడు జరిగిన సభలో వక్తలెందరో అతని వ్యక్తిత్వాన్ని, సేవలను స్తుతించారు. ఈ షష్టిపూర్తి మహోత్సవం సందర్భంగా, డాక్టర్ ఈశ్వరరెడ్డి తన పేరు మీదుగా, శ్రీ వేంకటేశ్వర మరియు శ్రీ పద్మావతి మహిళా విశ్వ విద్యాలయాలలో రెండు బంగారు పతకాలను స్థాపించారు. ప్రస్తుతం డాక్టర్ ఈశ్వరరెడ్డి ఆంధ్రప్రదేశ్ అకాడమీ ఆఫ్ పొలిటికల్ సైన్స్ పబ్లిక్ ఎఫైర్స్ అనే సంస్థకు వ్యవస్థాపక అధ్యక్షులుగా ఉన్నారు. ఈ సంస్థనే ఇటీవలనే మన లోక్ ఆయుక్త జస్టిస్ శ్రీ సీతారామరెడ్డి గారు ప్రారంభించారు.

ప్రసిద్ధి గాంచిన స్త్రీ రోగ నిపుణులు డా॥ రమణమ్మ వీరి సతీమణి.

# శ్రీ పి.ఎస్. గురువారెడ్డి

శ్రీ పంద్రవేటి సుబ్బారెడ్డి గురువారెడ్డిగారు, తిరుపతి పట్టణ వ్యావసాయ కుటుంబంలో 1909 లో జన్మించారు.

ప్రాథమిక, హైస్కూలు విద్యలు తిరుపతిలోనూ, ఇంటర్మీడియెట్ నందలూరులోనూ, బి.ఎ. మదనపల్లె దివ్యజ్ఞాన కళాశాలలోనూ చదివి 1935లో పట్టభద్రులయ్యారు.

రాజకీయాలలో చురుకుగా పాల్గొంటున్న కుటుంబానికి చెందిన శ్రీ గురువారెడ్డిగారికి, స్వాతంత్ర్య సమరంలో పాల్గొనాలనే పిపాస విద్యార్థి దశనుండే ఉండేది. వీరి తండ్రి గారైన శ్రీ సుబ్బారెడ్డిగారు, తిరుపతి మునిసిపాలిటి వైస్ చైర్మన్‌గా సేవచేసి యుండిరి. ఆనాడు పరాయి ప్రభుత్వం, గవర్నరు గారికి, యువకుడైన శ్రీ గురువారెడ్డి నల్లజెండా చూపించి నిరసన తెల్పినందుకు గాను అరెస్టు చేయబడ్డాడు.

బాల్యం నుండే 1942 లో కాంగ్రెస్‌పార్టీలో చేరిన శ్రీ గురువారెడ్డి, తిరుపతి పట్టణ కాంగ్రెస్ ప్రెసిడెంటుగా పనిచేశారు. వినోభాభావే పిలుపునందుకొని జైలుశిక్ష ననుభవించారు.

శ్రీ గురవారెడ్డిగారు పంచాయత్‌కోర్టు ప్రెసిడెంటుగానూ, తిరుపతి మునిసిపల్ ఛేర్మన్‌గా 1953 నుండీ, నిరవధికంగా ఇరువది సంవత్సరాలు, పట్టణాభివృద్ధికి ఎనలేని సేవలు చేశారు.

వీరి హయాములో తిరుపతి త్రాగునీటికి కళ్యాణి డ్యాం, మూడుకోట్ల డెబ్బై అయిదు లక్షల రూ||ల ఖర్చుతో నిర్మింపబడింది. ప్రతిష్టాకరమైన మునిసిపల్ ఆఫీసు బిల్డింగ్, చిన్న చిన్న వీధులకు సైతం సిమెంటు రోడ్లు, ప్రకాశమ్ హైస్కూలు, తదితరములైన అనేక ప్రైమరీ స్కూళ్ళు

స్థాపించి, తిరుపతి పట్టణాభివృద్ధికి గణనీయంగా సేవలు చేశారు.

తిరుపతి టౌన్ బ్యాంక్ ప్రెసిడెంటుగానూ, డైరెక్టరుగానూ ముప్పది సంవత్సరాల దీర్ఘకాలం సేవలనందించారు. వీరి సేవలకు గుర్తింపుగా, స్టేట్ కో-ఆపరేటివ్ యూనియన్ ప్రెసిడెంటుగా, వీరిని ఎన్నుకున్నారు. జాతీయ స్థాయి కెదిగిన వీరి ఖ్యాతి, ఢిల్లీలో నేషనల్ కో-ఆపరేటివ్ బ్యాంక్ యూనియన్, వైస్ ప్రెసిడెంటు పదవి వీరిని వరించేలా చేసింది.

విద్యారంగంలో వీరిని గుర్తించి, సిండికేట్ మెంబరుగా రెండేండ్లు, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, నియమించింది.

రాష్ట్రస్థాయిలో ఎం.ఎల్.సి. గా, వీరు 1972 నుండీ 1978 వరకూ ఎన్నుకొనబడి తమ అనుభవాన్ని విజ్ఞానాన్ని రాష్ట్రస్థాయిలో ప్రజలకు అందజేశారు.

తిరుపతి ప్రజల దాహార్తి తీర్చడానికి కళ్యాణి డ్యాం నిర్మాణమే కాక, నూరుకుపైగా బోరు బావులు త్రవ్వించి, పట్టణ ప్రజలను ఆదుకున్న మహనీయుడు శ్రీగురువారెడ్డిగారు.

వీరు ఛేంబర్ ఆఫ్ మునిసిపాలిటీలకు ఛేర్‌మన్‌గా కూడా హైదరాబాదులో వ్యవహరించారు. అప్పటి క్రొత్త భవన నిర్మాణానికి ముఖ్య కారకులయ్యారు.

మునిసిపల్ ఛైర్‌మన్‌ను, డైరెక్టు ఎన్నికల ద్వారా నియమించే విధానాన్ని ప్రవేశపెట్టింది శ్రీ గురువారెడ్డిగారే.

వినోబాభావే భూదాన పిలుపునందుకొని, శ్రీ రెడ్డిగారు పదిఎకరాల భూమిని, చెన్నాయగుంట ఏరియాలో 1978లో, భూదానము చేసిన మహాదాత.

శ్రీ రెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ సభ్యులుగానూ, జాయింట్ సెక్రటరీగా కూడా సేవలనందించారు.

చిత్తూరుజిల్లాలో పేరు ప్రఖ్యాతులు గడించి, ప్రదేశ్ కాంగ్రెస్ ప్రెసిడెంటుగానూ, రెవిన్యూ మంత్రిగానూ, పనిచేసిన శ్రీ పెద్దిరెడ్డి తిమ్మా

రెడ్డి వీరికి దగ్గరి బంధువు. ఆనాటి ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డికి అతి సన్నిహితులుగా గుర్తింపు బడ్డ వ్యక్తి, శ్రీ గురువారెడ్డి.

ఆదర్శ విద్యాలయ ఇంగ్లీషు మీడియమ్ హైస్కూలును సంస్థాపించి, పదిహేను సంవత్సరములు ప్రెసిడెంటుగా, ఆ విద్యాలయ సర్వతోము ఖాభివృద్ధికి కృషి సల్పిన మహామనీషి.

తాతయ్య గుంట, చిన్నగంగమ్మ దేవాలయాభివృద్ధికెంతగానో పాటు పడ్డారు. 18 సంవత్సరాలు ఈ దేవాలయ ట్రస్ట్ బోర్డు ఛైర్మన్‌గా వుంటూ, దేవాలయపు ఇప్పటి వున్నత స్థితికి కారకులయ్యారు.

ఇన్ని వున్నత పదవులను నలంకరించి, తిరుపతి పట్టణాభివృద్ధికి, విద్యాలయాల అభివృద్ధికీ, రాష్ట్ర సహకార సంఘాల అభివృద్ధికీ అహ ర్నిశం పాటుపడ్డ, శ్రీ గురువారెడ్డిగారు, తమ 85 ఏట, ఈజీ చైర్‌లో కూర్చుని ఎక్కువ కాలం, ప్రశాంతంగా గడుపుతున్నారు.

తిరుపతి పట్టణం సర్వతోముఖంగా అభివృద్ధి చెందడంలో శ్రీ గురు వారెడ్డిగారి పాత్ర అనితర సాధ్యం, చిరస్మరణీయం.

వీరికి ఆయురారోగ్యాలు, దీర్ఘాయుస్సుని, దైవము ప్రసాదించాలని, వారి కుటుంబసభ్యులు ధనసంపదలతో వృద్ధిగాంచాలని కోరుకుందాము.

* * *

*"విజయానికి ఇదే దారి అంటూ ఏదీ లేదు. కాని, మనిషికి స్పష్టమైన గమ్యం అంటూ వుండాలి. దానికి ఏదీ సాటిరాదు."*

*-టి.టి. ముంగర్*



# డా॥ ఎస్. గోవిందరాజులు నాయుడు

బాషాప్రయుక్త రాష్ట్రాలను ఏర్పాటు చెయ్యాలనే ఆంధ్రుల చిరకాల వాంఛ, అమరజీవి పొట్టి శ్రీరాములు గారు చేసిన ప్రాణత్యాగం మూలంగా, 1953, అక్టోబరు 1 న ఆంధ్రరాష్ట్రం ఏర్పడినది. క్రొత్తగా ఈ ఆంధ్రరాష్ట్రంలో ఒక విశ్వవిద్యాలయం ఏర్పాటు చెయ్యాలనే పరిశీలనలో ఆనాటి ప్రభుత్వము క్యాబినేట్ సబ్ కమిటీ నొకదానిని, శ్రీ ఎస్. బి.పి. పట్టాభిరామరావ్, ఆనాటి విద్యామంత్రి అధ్యక్షతన ఏర్పాటు చెయ్యబడింది. ఆ మంత్రి వర్గ ఉపసంఘం ఫిబ్రవరి 3, 1954 న సమావేశమౌతూ శ్రీ యస్. గోవిందరాజులు నాయుడుగారిని ప్రత్యేక ఆహ్వానితులుగా పిలిచారు.

మంత్రివర్గ ఉపసంఘం సిఫారసు మేరకు ఆంధ్రప్రభుత్వము "ద్విసభ్య సంఘము" నొకదానిని నియమించారు. అందులో శ్రీ ఎస్. గోవిందరాజులొక సభ్యులుగా నియమింపబడ్డారు.

ఈ ద్విసభ్య సంఘం తమ నివేదికను ఫిబ్రవరి 24, 1954 న ప్రభుత్వానికి సమర్పించింది. తిరుపతి ముఖ్యకేంద్రంగా, క్రొత్త విశ్వవిద్యాలయం ప్రారంభించాలని, అది బోధన, పరిశోదనల మిళితమైన సంస్థగా వుండాలని సిఫారసు చేశారు. రాయలసీమలోని అన్ని జిల్లాలు ఈ విశ్వవిద్యాలయానికి అనుబంధంగా వుండాలని కూడా సూచించారు.

సెప్టెంబరు 2, 1954 న శ్రీ ఎస్. గోవిందరాజులు వ్యవస్థాపక కులపతిగా శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రారంభమయినది.

తిరుమల తిరుపతి దేవస్థానం యాజమాన్యం నుండీ, భూమి సంపాదించడం మొదలుకొని, ప్రభుత్వ నిధుల సంపాదనతో విశ్వవిద్యాలయ భవనాలు కట్టించడం, క్రొత్త విద్యాబోధకా విషయ నిర్ణయాలతో

పాటు అన్నిరంగాలలో, ప్రారంభ దశనుండీ, శ్రీ ఎస్. గోవిందరాజులు విశ్వవిద్యాలయం ఈనాటి వున్నతస్థితికి చేరుకునే పునాదివేసి అభివృద్ధి చెందిన స్థితి వరకు సుమారు ఒక దశాబ్దకాలం అవిరళ కృషి చేసి, కృత కృత్యులయ్యారు. అందరి మన్ననలనూ పొందారు.

కృష్ణాజిల్లా మచిలీపట్నంలో అక్టోబరు నెల 7వ తేది 1897 లో జన్మించిన శ్రీ గోవిందరాజులు అద్వితీయమైన పఠనా పటిమ కల్గిన వారు. ఎం.ఏ. పట్టము, ఎల్.ఎల్.బి. కాంటర్బరీ (ఇంగ్లాండు), బి.ఎల్. ప్రతిష్ఠాకరమైన Bar-at-Law పట్టములను సంపాదించారు. తమ ప్రాథమిక విద్య, కాలేజీ విద్య మచిలీపట్నం, గుంటూరులో గడిచిన పిదప తమ ఉన్నత విద్యార్జన తర్వాత మద్రాసులో న్యాయశాస్త్ర కళాశాల విభాగంలో చేరారు. మద్రాసు న్యాయశాస్త్ర కళాశాలలో, వివిధ పదవులు, వైస్ ప్రిన్సిపాల్, ప్రిన్సిపాల్ లాంటి అనేక పదవులను నిర్వహించి రెండు దశాబ్దాలపాటు సేవలు చేసి, Director of Public Instruction గా, మద్రాసు సంయుక్తరాష్ట్రంలో, ప్రమోట్ చెయ్యబడ్డారు. 1954 వరకూ ఆ అత్యున్నత పదవిలో ఉన్నారు.

మద్రాసు విశ్వవిద్యాలయ సెనెట్ మెంబరుగానూ, సిండికేట్ మెంబరుగానూ, అనేక పర్యాయాలు తాత్కాలిక వైస్ ఛాన్సలర్ గానూ, శ్రీ గోవిందరాజులు పనిచేశారు.

Indian wheat loan Education Programme క్రింద, ద్వితీయ అధ్యయన బృంద విద్యాధికులకు నేతగా శ్రీ గోవిందరాజులుగారు అమెరికాలో 1957లో పర్యటించారు.

కామన్ వెల్త్ వైస్ ఛాన్సలర్ల సమాఖ్యకు 1958 లో కెనడాలో, మన విశ్వవిద్యాలయ ప్రతినిధిగా హాజరయ్యారు.

న్యూఢిల్లీ లోని యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ వారి అనేక అడ్వైసరీ స్టాండింగ్ కమిటీలలో మెంబరుగా పనిచేశారు. భారతదేశ, శ్రీలంక అంతర్ విశ్వవిద్యాలయ బోర్డులో కూడా సభ్యులుగా పనిచేశారు.

శ్రీ గోవిందరాజులుగారు అఖిల భారత, విశ్వవిద్యాలయ వ్యాయామ క్రీడల పోటీలను మొట్టమొదటి సారిగా 1961, డిసెంబరు 29-31

ల మధ్య నిర్వహించారు.

భారత, శ్రీలంక అంతర్ విశ్వవిద్యాలయ మండలి 37 వ వార్షిక సభను, తిరుపతి పట్టణంలో ఫిబ్రవరి, 1962 లో జయప్రదంగా జరిపారు.

అంతర్ విశ్వవిద్యాలయ మండలి అధ్యక్షులుగా వుంటూ, 1962-63 లో, 38 వ వార్షిక సమావేశాన్ని బొంబాయిలో అధ్యక్షస్థానం వహించి జరిపారు.

శ్రీ గోవిందరాజులుగారు, అలంకరించిన, ఇతర ఉన్నత పదవులలో ముఖ్యమైనవి (1) Southern Language Book Trust ఛేర్మెన్. (2) ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులు.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ సిండికేట్, మే నెల 30 వ తేదీ 1964 న జరిపిన సమావేశంలో శ్రీ గోవిందరాజులుగారు విశ్వ విద్యాలయానికి చేసిన ఘనసేవలను స్తుతిస్తూ ఈ విధంగా తీర్మానం చేశారు.

"శ్రీ గోవిందరాజులుగారు చేసిన గొప్ప ఒక దశాబ్ది సేవలకారణం గానే, శ్రీ వేంకటేశ్వర యూనివర్శిటీ 1954 లో ప్రారంభించినది మొదలు, దాని పెరుగుదల, అభివృద్ధికి కారకులై, ప్రస్తుత అత్యున్నత స్థాయికి విశ్వవిద్యాలయ సైన్సు, Humanities, Technological విద్య ప్రమాణాల కోర్సులలో సాధించగలిగారు".

ఇంతటి ఘనకీర్తి కల్గిన విద్యావేత్త, శ్రీ గోవిందరాజులు ఆగస్టు 7, 1968 న శివసాన్నిధ్యం చేరారు. వారు భౌతికంగా మన మధ్య లేకున్నా వారు స్థాపించిన అభివృద్ధి చెందించిన శ్రీ వేంకటేశ్వర యూనివర్శిటీ చిరస్థాయిగా అతని నామస్మరణలో వుండగలదని చెప్ప వచ్చు.



# ప్రొ॥ జి.యన్. రెడ్డిగారు

ప్రొ॥ జి. నారాయణస్వామి రెడ్డి, శ్రీ వేంకటేశ్వర విశ్వవద్యాలయ వైస్-ఛాన్సలర్లలో, ప్రఖ్యాతి చెందిన వ్యక్తి. చిత్తూరు జిల్లా, మహాస ముద్రం గ్రామంలో, 1928 వ సం॥ము జూలై ఒకటవ తేదీ వీరు జన్మించారు. వీరు 1949 లో ఎం.ఏ. తెలుగుబాష, సాహిత్యం పరీక్షలో, ప్రథమశ్రేణిలోనూ, ప్రథముడుగా బంగారుపతకం మద్రాసు యూనివ ర్సిటీ M. Litt. పట్టం పొందారు. వీరి రీసెర్చి అంశము. "తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు బాషా ప్రభావము" అన్నది. తిరిగి 1962 లో "A study of Telugu Semantics" అన్న అంశంపై రీసెర్చిచేసి, డాక్టరేట్ పట్టం సంపాదించారు.

1956, 1957, 1958 లో, "భాషా విజ్ఞానంపై పూనాలో జరిగిన వేసవికాల పాఠశాలలో పాల్గొన్నారు. 1957-58 లో పూనాలోని డక్కన్ కాలేజీలో రాక్‌ఫెల్లర్ రిసెర్చిఫెలోగా, భాషా శాస్త్రాల మీద పనిచేశారు.

1949-50 లో తెలుగులో ట్యూటర్‌గా తమ ఉద్యోగజీవనం ప్రెసి డెన్సికాలేజి, మద్రాసులో ప్రారంభించి, శ్రీరెడ్డిగారు, 1950-57 మధ్య, అసిస్టెంటు ప్రొఫెసర్‌గా అదే కాలేజీలోనూ, 58-59 మధ్య అనంత పురం ప్రభుత్వ ఆర్ట్స్ కళాశాలలో తెలుగు లెక్చరర్‌గాను; 1959-62 మధ్యకాలంలో, శ్రీ వేంకటేశ్వర యూనివర్శిటీ తిరుపతిలో తెలుగులెక్చ రరుగానూ పనిచేశారు.

1962-64 మధ్యకాలంలో, విస్కాన్సన్ యూనివర్శిటీ, మాడిసన్ అమెరికాలో, విసిటింగ్ లెక్చరర్‌గా తన సేవలనందించారు.

1964-65 లో, శ్రీ వేంకటేశ్వర యూనివర్శిటీ, తిరుపతిలో రీడరు గానూ, 1984 వరకూ ప్రొఫెసరుగానూ, తెలుగు విభాగపు అధిపతిగానూ పనిచేశారు.

ఈ మధ్యకాలం, 1966లో శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ అధ్యాపక సంఘములో ప్రెసిడెంట్‌గానూ, 1966-68 మధ్య, National Integration Samithi, జాతీయ ఏకీకరణ సమితి, చేర్మన్‌గా సేవలు చేశారు. 1978-79 లో యూనివర్సిటీ ఆర్ట్స్, సైన్సు కళాశాల వైస్ ప్రిన్సిపాల్‌గానూ, 81-83 లో ప్రిన్సిపాల్‌గా పదవినలంకరించారు.

1965 నుండీ ఎస్.వి. విశ్వవిద్యాలయ మహోపన్యాసకుడు Orator గానూ, 1966-75 మధ్య Faculty of Oriental learning: ప్రాచ్య జ్ఞాన శాస్త్రవిభాగము డీన్‌గానూ, 1976-79 ల మధ్య అనంతపురం సర్వస్వతంత్ర పోస్ట్ గ్రాడ్యుయేట్ సెంటరు ఎక్సిక్యూటివ్ కౌన్సిల్ మెంబరుగానూ; 1977-78 మధ్యకాలంలో, శ్రీ వేంకటేశ్వర యూనివర్శిటీ ప్రచురణ విభాగానికి గౌరవ డైరెక్టరుగానూ; 1981-84 వరకు ఎస్.వి. యూనివర్శిటీ సిండికేట్ మెంబరుగానూ; 1984-87 వరకు ఎస్.వి. యూనివర్శిటీ వైస్-ఛాన్స్‌లర్‌గానూ, సుదీర్ఘమైన విద్యారంగసేవలు చేశారు.

మద్రాసు విశ్వవిద్యాలయం M.A. పరీక్షలో మొదటి తరగతిలోనూ, ప్రప్రథమర్యాంకును సంపాదించిన రెడ్డిగారు, రాక్‌ఫెల్లర్ రిసెర్చి ఫెలోగా, పూనా డక్కన్ కాలేజీలోనూ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ జనరల్ కౌన్సిల్ మెంబరుగానూ, ఆంధ్ర యూనివర్శిటీ లాంగ్వేజికమిటీ మెంబరుగానూ, U.G.C. ఆధునిక భారతీయ భాషలలో ప్యానెల్ మెంబరుగానూ, అంతర్జాతీయ తెలుగు సంస్థ విద్యాసలహా బోర్డు మెంబరుగానూ, ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ కాన్ఫరెన్స్ వైస్ ప్రెసిడెంటుగానూ, బొంబాయి యూనివర్శిటీ శ్రీ ఈశ్వర చంద్ర విద్యాసాగర్ ఎండోమెంట్ లెక్చరరుగానూ, ఆంధ్రప్రభుత్వ అత్యుత్తమ అధ్యాపక అవార్డు గ్రహీతగాను; భారత స్థల నామకరణ సంస్థ Place name society of India అధ్యక్షులుగానూ; ద్రవిడ భాషా శాస్త్ర సంఘ అధ్యక్షులుగానూ; U.G.C. జాతీయ తెలుగు ఉపన్యాసకుడుగానూ, ఎనలేని సేవలు చేసి; గణుతికెక్కిన మహా మేధావి.

వీరు 1962-64 లో, అమెరికాలోని విస్కాన్సిన్ యూనివర్శిటీ మాడిసన్‌లో తెలుగు విజిటింగ్ లెక్చరరుగాను, పర్యటించారు.

1974 లో బల్గేరియాలో భారత ప్రభుత్వ cultural exchange ప్రోగ్రాం క్రింద, ఏప్రిల్ నెలలో పర్యటన చేశారు. 1981 లో ప్రపంచ తెలుగు మహాసభలలో, కౌలాలంపూరులో పాల్గొన్నారు.

శ్రీరెడ్డిగారు ఒక డజను గ్రంథాలను రచించారు. వాటిలో ముఖ్య మైనవి.

తెలుగు - తెలుగు డిక్షనరీ 1971 - A.P. సాహిత్య అకాడమీ వారిచే ప్రచురణ.

శల్య, సౌప్తిక, స్త్రీ పర్వాలు మహాభారతములోనివి. 1976 A.P. సాహిత్య అకాడమీ ప్రచురణ. C.P. Brownగారి ఆంధ్ర గీర్వాణ ఛందము, 1977 S.V. University తిరుపతి ప్రచురణ.

1977 బ్రౌన్ లేఖలు, S.V. University ప్రచురణ.

1978 ఇంగ్లీషు తెలుగు నిఘంటువు, హైదరాబాదు తెలుగు అకాడమీ ఆధ్వర్యంలో U.G.C. ప్రాజెక్టుగా ప్రచురణ. 1978 శ్రీ పెద తిరుమలాచార్య భగవద్గీత, S.V. University తిరుపతి వారి ప్రచురణ మున్నగునవి.

శ్రీ రెడ్డిగారనేక (30 దాకా) వ్యాసాలు వ్రాసి ప్రచురించారు.

వీరి ఆధ్వర్యంలో 12 మంది రీసెర్చి డాక్టరేటు పట్టమును, 9 మంది రీసెర్చి ద్వారా M.Phil. విద్యార్థులు, తమ విద్యను గడించి, డిగ్రీలు పొందారు.

వీరు తెలుగు విభాగపు సొసైటీ ఆఫ్ ఇండియా, జీవిత సభ్యులుగానూ, ద్రవిడియన్ లింగ్విస్టిక్ అసోసియేషన్ జీవితసభ్యులుగానూ ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ కాన్ఫరెన్స్ జీవిత సభ్యులుగానూ ఉన్నారు.

31 ఏండ్ల అధ్యాపక వృత్తిలో అనుభవమున్న శ్రీరెడ్డిగారు, అత్యున్నత పదవి వైస్-ఛాన్స్‌లర్ S.V. University గా 5-5-84 నుండి 1987 వరకూ ఘనమైన సేవలు చేశారు. తెలుగు భాషా సాహిత్య,

సాంస్కృతిక వికాశాలకు అనవరతం శ్రమించి ఆదర్శమార్గాలను నిర్దే శించిన ఉత్తమ అధ్యాపకులు ఆచార్య జి.యన్. రెడ్డి. క్రమశిక్షణకు కర్తవ్యపాలనకు ప్రాధాన్యమిచ్చి విద్యార్థులను ఉపాధ్యాయులకు ఆత్మీ యతను పంచిన ఉన్నత వ్యక్తిత్వం ఆయనది. తెలుగు అధ్యయన రంగంలో ఉత్తమ పరిశోధకులు ఆయన.

విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష పదవినలంకరించిన ప్రప్రథమ తెలుగు ఆచా ర్యులు ఆయన. ఆ సమయంలో విశ్వవిద్యాలయముల స్వయం ప్రతిప్రత్తిని ఆత్మాభిమాన పురస్సరంగా నిలవడానికి ప్రయత్నించిన మేధో వ్యక్తిత్వం ఆయనిది.

పరిపాలకులుగా ఆయన వినూత్నమైన విలువల్ని పాదుకొల్పారు. సామనరస్యం, సమతాభావ పరికల్పన, మానవీయ సంబంధాల పరిర క్షణ, నిరాడంబరత, ప్రజాస్వామ్య సూత్ర నిబద్ధత, కార్యవ్యగ్రత, చట్టబద్ధ పరివర్తనా ప్రావీణ్యం ఆయన పరిపాలనలోని ప్రత్యేకతలు.

ఆయనకు గురుశిష్య భావనమీద నమ్మకం లేదు; ఆయనది అధ్యాపక విద్యార్థి ఆదర్శబంధ భావన. ఆయనది వర్తమాన సమాజ అవసరాలకు అనుగుణమైన నూతన పరిశోధనా మార్గాల నిత్యగవే షణ. ఆయనకు కేంద్రీకృతమైన అధికారం పట్ల మమకారం లేదు. వికేంద్రీకరణ దృష్టి వారిది, విద్యాలయాల్లో నలువురూ కలసి మెలసి సమిష్టి కృషికోసం శ్రమించాలనే సామాజిక మానవుడి తత్త్వం. ఆయన దృష్టిలో వ్యక్తులు చరిత్ర సృష్టించరు. వాళ్ళు చరిత్రకు తోడ్పడతారు. ఆయన నిత్య విద్యార్థి, గుణాత్మకమైన బోధనకు కావలసిన విజ్ఞానాన్ని నిరంతరం సంతరించుకునే జిజ్ఞాసి, విషయ వైవిధ్యశైలిలో సరళంగా, స్పష్టంగా, నిరాడంబరంగా, నిరలంకారంగా అత్యంత క్లిష్టమైన విషయా లను వివరించే పాత్రప్రవచనం ఆయనది. ఆయనది గురుబోధ కాదు. అందువలననే తనదగ్గర చదువుతున్న ఏ విద్యార్థినీ ఆయన శిష్యుడని చెప్పకోరు. ఆయనకు శిష్యులు లేరు. అధ్యాయులున్నారు. ఆత్మీయు లున్నారు. అధ్యాయులలో ఉత్తమ సంస్కార వ్యాప్తికి అధ్యాపకుల ఉత్తమ ప్రవర్తన దోహదం చేస్తుందని నమ్మి, ఆ ఆదర్శ ప్రవర్తనను అనుష్ఠించి చూపారు. కాబట్టి విద్యార్థులు ఆయనకు ఆత్మీయులు.

సంస్థాగతమైన పదవీ బాధ్యతల నిర్వహణలో ఆయన ధ్యేయులు. ఆత్మ విశ్వాసమూ, ఆత్మగౌరవమూ, కార్యాచరణా, సమిష్టి దృక్పథమూ, సమదృష్టి, సహానుభూతి, సత్సంబంధాలూ, మాననీయ విలువల పరిపోషణా, ప్రజాస్వామ్య సూత్ర నిబద్ధతా, కార్యవ్యగ్రతా, అధికార దర్పరాహిత్యము, నిరాడంబరతా, సంస్థ సర్వతోముఖాభివృద్ధి, సౌజన్యం, సౌశీల్యం, సౌహార్దం ఆచార్య జి. యన్. రెడ్డిగారి అపూర్వ వ్యక్తిత్వానికి అంతస్సూత్రాలు.

ఎడతెరపిలేని పరిశోధనా ప్రణాళికల్లో, గ్రంథరచనా చింతనలో నిమగ్నులై తమ జీవిత సుఫలాలను ఆంధ్రలోకానికి అందించారు.

* * *

"వివేకవంతుడు స్వానుభవం వల్ల ప్రయోజనం పొందుతాడు. తెలివికల వాడు ఇతరుల అనుభవం వల్ల నేర్చుకుంటాడు."

-డాక్టర్ జోసెఫ్ కాలిన్స్

"ఇతరుల పాపాలెప్పుడూ మన కళ్ళ ముందు కనబడుతుంటాయి. కాని, మన పాపాలు మన వెనకే వుంటాయి."

-సెనెకా



# ప్రొ॥ కె. వెంకటరెడ్డి

వ్యవసాయ కుటుంబీకులైన శ్రీ కుదాటి సుబ్బా రెడ్డి , శ్రీ మతి చెంగమ్మల పుత్రుడు శ్రీ కె. వెంకట రెడ్డి , 15 -4 -1931 లో జన్మించారు. శ్రీ సుబ్బారెడ్డి, చిత్తూరు జిల్లా, చంద్రగిరి తాలూకా, గానుగ పెంట గ్రామానికి, గ్రామ పంచాయితీ ప్రెసిడెంటుగా, 5 సార్లు నిరాఘాటంగా, ఎన్నుకోబడి, సేవలు చేసిన ఘనులు. వీరికి తెలుగు సాహిత్యంలోనూ గణనీయమైన ప్రావీణ్యత వుండేది.

శ్రీ వెంకట రెడ్డి గారు ధనోజ వారి పల్లెలో జన్మించి, మండల కేంద్ర మైన పాకాలలో తమ ప్రాథమిక, సెకండరీ విద్య నభ్యసించారు. విద్యార్థి గానే, శ్రీ వెంకట రెడ్డి, స్వాతంత్ర్య సమర పోరాటంలో పాల్గొన్నారు. పాకాల పట్టణ స్టూడెంట్ కాంగ్రెస్ అధ్యక్షులుగా, 1945 - 47 మధ్య, బ్రిటీష్ పరిపాలన మీద కాంగ్రెసు పిలుపు మేరకు సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని, రెండు సార్లు జైలు శిక్ష ననుభవించారు.

ఇంటర్ చదువు, తిరుపతి శ్రీ వెంకటేశ్వర కాలేజీలో చదివారు. అర్థ శాస్త్రం (ఎకనామిక్స్) లో బి.ఏ. ఆనర్స్, మద్రాసు యూనివర్సిటీలో చదివి పాసయ్యారు. తదుపరి M.A. ఎకనామిక్స్ మద్రాసు యూనివర్శిటీ నుండీ, Ph.D. ఎకనామిక్స్ శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ నుండీ సంపాదించారు.

విద్యార్థి దశలోనే శ్రీ వెంకట రెడ్డిగారు తమ ఉజ్వల భవిష్యత్తును సూచిస్తూ అనేకమైన బహుమతులు గెల్చుకున్నారు.

1985 - 86 లో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ, ఉత్తమ అధ్యాపక బహుమతి గెల్చుకున్నారు.

36 ఏండ్ల సుదీర్ఘ అధ్యాపక వృత్తిలో అనుభవమున్న శ్రీ రెడ్డి గారు, అర్థ శాస్త్రంలో లెక్చరర్ గానూ, ఆ విభాగపు అధిపతి గానూ, ప్రొఫెసర్ ఆఫ్ రూరల్ డెవలప్ మెంటు గానూ, దాని అధిపతి గానూ, శ్రీ వెంకటేశ్వర కాలేజీలో, తిరుపతి లోనూ, ఆంధ్ర యూనివర్శిటీ వాల్తేరు లోనూ, శ్రీ కృష్ణదేవరాయ యూనివర్శిటీ అనంతపురం లోనూ, సుదీర్ఘ కాలం పని చేశారు.

1982 -85 ల మధ్య కాలంలో శ్రీ కృష్ణదేవరాయ యూనివర్శిటీ రిజిస్ట్రార్‌గా పని చేశారు. వీరి ప్రావీణ్యతకు గుర్తింపుగా, 12-5-'88 నుండి 11-5-1991 వరకూ, శ్రీ కృష్ణదేవరాయ యూనివర్సిటీ వైస్ చాన్సలర్ గా అత్యున్నత పదవి నలంకరించి, ఆ యూనివర్సిటీ అభివృద్ధికి ఎనలేని సేవలనందించారు.

అనేక క్రొత్త కోర్సులను ప్రవేశ పెట్టడమే కాక, మరిన్ని ప్రారంభించడానికి చురుకుగా ప్రయత్నాలు చేశారు. విద్యా పరమైన క్రొత్త ప్రణాళికలను రూప కల్పన చేశారు. పేదలైన షెడ్యూల్డు, ట్రైబ్స్ విద్యార్థుల సౌకర్యార్థము, బుక్ బ్యాంక్ సెల్ నొక దానిని స్థాపించి, సాయ పడ్డారు. కొన్ని సబ్జక్టు లలో అండర్ గ్రాడ్యుయేట్, Post - graduate చదువులకు, ప్రైవేట్ స్టడీ మొదలు పెట్టి విస్తృత విద్యా వ్యాప్తికి తోడ్పడ్డారు. యూనివర్శిటీ ఏరియాలో, పయోజన విద్య, అక్షరాస్యత వ్యాప్తికి, సకల ప్రయత్నాలు చేశారు. సోషల్ ఫారెస్ట్రీ ప్రోగ్రామును ప్రవేశ పెట్టారు. వీరు నిర్వహించిన కార్యక్రమాల నన్నిటినీ U.G.C వారు మెచ్చుకున్నారు. శాంతి పూర్వక వాతావరణం నెలకొని వున్న యూనివర్సిటీ గా గణుతి కెక్కింది శ్రీ కృష్ణ దేవరాయ యూనివర్సిటీ.

అనేక కమిటీలలో శ్రీ వెంకట రెడ్డి గారు మెంబరుగా తమ అశేష అనుభవాన్ని విద్యా రంగానికి అర్పించిన ధన్యజీవి.

ఇది వరకూ శ్రీ రెడ్డి గారి అధ్వర్యంలో, తొమ్మిది మంది Ph.D లు, పది మంది M. Phil విద్యార్థులు తర్ఫీదు పొంది, కృత కృత్యుల య్యారు. ప్రస్తుతం ముగ్గురు Ph.D లకు వీరు అధ్వర్యం వహిస్తున్నారు.

శ్రీ రెడ్డి గారనేక పుస్తక, పత్రికా వ్యాస రచనలు, రేడియో వ్యాఖ్యానాలు చేశారు.

స్టీల్ ప్రొడక్ట్స్ లిమిటెడ్ తుంగభద్ర డ్యామ్ లోనూ, సదరన్ స్ట్రక్చరల్స్ లిమిటెడ్, పట్టాభిరామ్, మద్రాసులోనూ ప్రఖ్యాతి గాంచి, దేశ పురోగతికి పారిశ్రామిక రంగంలో తోడ్పడుతూనే వున్నాయి. వేలాది కార్మికులు వారు పెట్టిన ఉద్యోగ భిక్షతో, తరతరాలుగా జీవనోపాధి కలిగి సుఖ జీవనం చేస్తున్నారు.

వారి ఆత్మకు శాంతి కలగాలని, వారి కుటుంబ సభ్యులందరూ, ఆయురా రోగ్యాలు కలిగి వుండాలని దైవాన్ని ప్రార్థిద్దాము.

* * *

మన గొప్పతనము మనము చెప్పు మాటలచేగాని, మనము ధరించు చిహ్నములచే గాని, మనము చేయు నినాదములుచేగాని నిర్ణయింప బడదు. మనయొక్క కార్యకుశలత్వము, నిరంతరకృషి, త్యాగము, సత్య సంధత్వము, నిర్మల చరిత్రములచేతనే నిర్ణయింప బడగలదు.

* * *

మానవ సంఘము నుండి దైవత్వమును తీసివైచినచో పశువుల గుంపు మిగులును.

* * *

సంపాదించవలెను. చేయవలెను. పొందవలెను. అనుభవించవలెను -అను ఇచ్ఛలు నశించినప్పుడే నిజమైన మనశ్శాంతి కలుగును.

Centre for Rural Reconstruction and Voluntary Action, అన్న రిజిష్టర్డ్ సొసైటీకి అధ్యక్షులుగా, గ్రామీణ యువకులకు, స్వంతంగా ఉద్యోగం చేసుకొని, జీవనోపాధి కలుగ చేసుకునే, నైపుణ్యం కలుగ జేస్తున్నారు.

రాయలసీమ స్టడీ సెంటరు, తిరుపతి రిజిష్టర్డ్ సొసైటీకి డైరెక్టరుగా విద్యా వంతులైన నిరుద్యోగులైన యువకులకు సలహా సంప్రతింపులు యిస్తూ, తోడ్పడుతున్నారు.

మేధావి, సంఘ సేవా తత్పరుడు, మృదుభాషి, నిగర్వి, మంచి మిత్రుడు శ్రీ వెంకట రెడ్డి గారు, మరిన్ని సేవలు అందిస్తారని ఆశిద్దాము.

* * *

"మన అలవాట్లే మన సత్ప్రవర్తనకు ప్రతిబింబాలు. అందువల్లనే మనలను ఎవరైనా ప్రేమించేది. గౌరవించేది."

-సిడ్నీ స్మిత్

"నీవు గౌరవించే వ్యక్తిని చూపించు. నీవు ఎలాంటి వ్యక్తివో తెలుసుకుంటాను. మనుషులపై నీ అభిప్రాయం ఏమిటో అప్పుడు నాకు తెలుస్తుంది."

-కార్లయిల్



# ప్రొఫెసర్ (డా॥) పి. జయరామరెడ్డి

పుట్టి, పెరిగి, చదువు కున్న పట్టణంలోనే ఆ పట్టణంలోని కాలేజీలకు అత్యున్నతాధికారిగా, అవకాశం రావడం చాల అరుదుగా జరుగుతూ వుంటుంది. అలాంటి సదవకాశం వచ్చిన, తిరుపతి పౌరుడే, డా॥ పి. జయరామ రెడ్డిగారు, ప్రస్తుత శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్.

వీరు 1935 వ సంవత్సరము, జనవరి 24 వ తేదీన, తిరుపతి పట్టణంలో జన్మించారు. 1954 లో మద్రాసు విశ్వవిద్యాలయం నుండీ B.Sc. పట్టం మొదటి శ్రేణి లో పుచ్చుకొని, శ్రీ వెంకటేశ్వర యూనివ ర్సిటీ లో M.A. పట్టం ఫస్టు క్లాసులో 1958 లో గడించారు. తిరిగీ, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం లోనే మొట్ట మొదటి డాక్టరేట్ పట్టం, 1962 లో సంపాదించారు. అదే కాక, 1963 - 65 లో డిపార్ట్ మెంట్ ఆఫ్ మెటీరియల్ సైన్సు, మరియు, ఇంజనీరింగ్, కార్నెల్ యూనివర్సిటీ అమెరికాలో, పోస్ట్ డాక్టరల్ ఫెలోగా ఎన్నికయ్యారు.

చదువులలో వున్నతమైన ప్రమాణాల నందు కుంటూ, ప్రకాశిస్తున్న, శ్రీ రెడ్డి గారు, ఎన్నో గౌరవ పట్టాలను సంపాదించారు.

వీరి ఉపాధ్యాయ వృత్తి 32 సంవత్సరముల దీర్ఘ కాలిక మైనది. 1973 నుండీ 1991 మధ్య కాలంలో, ప్రొఫెసర్‌గా, శ్రీ రెడ్డి గారు, సాలిడ్ స్టేట్ ఫిజిక్స్, తిన్ ఫిల్మ్ ఫిజిక్స్, మరియు సోలార్ ఎనర్జి ఫిజిక్స్, M.Sc. డిగ్రీ కి స్పెషల్ బోధ నాంశాలుగా ప్రారంభించి, అభివృద్ధికి తీవ్రమైన కృషి సల్పారు.

వైస్ ఛాన్సలర్‌గా పనిచేస్తూకూడా శ్రీ రెడ్డిగారు, తనకు ప్రియ తమమైన, ఫిజిక్స్ అంశాలలో రిసెర్చి సల్పుతూనే వున్నారు. సాలిడ్

స్టేట్ ఫిజిక్స్ - Semi Conductor thin films applicable in energy conversion and photon detectors, అన్న అంశంలో అనుభవము గడించారు. ప్రస్తుతం Thin film solar cells based on chal cogenide and chalcopyrites అన్న అంశముల మీద రిసెర్చి చేస్తున్నారు. 250 కి పైగా, సైన్సు శాస్త్రముల మీద దేశ విదేశ పత్రికలలో వ్యాసాలు, ప్రచురించిన ఘన కీర్తి కలవారు. వీరి అధ్వర్యంలో 24 మంది విద్యార్థులిది వరకూ డాక్టరేట్ పట్టం పొందారు. 14 రిసెర్చి ప్రాజెక్టులను విజయ వంతంగా పూర్తి చేశారు.

సెమి కండక్టర్స్ లోనూ 1984 లో సాన్ డియాగో, స్టాక్ హోమ్ లోనూ, 1985 లో మద్రాసు లోనూ; 1986 లో బాల్టీమోర్; 1987 లో ఢిల్లీ లోనూ; 1989 లో రిజెన్స్ బెర్గ్‌లోనూ, 1989 లో కోల్న్ లోనూ సదస్సులలో పాల్గొన్నారు.

దేశ విదేశ విశ్వ విద్యాలయాలలో ఆహ్వానిత వుపన్యాసాలిచ్చారు.

పరిపాలనా పరమైన అనుభవం తీసుకున్నా, శ్రీ జయరామరెడ్డి గారికి, గణనీయమైన, విశాలమైన అనుభవం వున్నది. 1973 - 80 మధ్య కాలంలో, వారు ఫిజిక్స్ డిపార్ట్‌మెంటు అధినేత గానూ; 15 ఏండ్ల పాటు బోర్డు ఆఫ్ స్టడీస్ కు అధ్యక్షులు గానూ; 1978 - 80 ల మధ్య శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ సిండికేట్ మెంబరు గానూ; 1979 - 81 లో, అనంతపురం, పోస్ట్ గ్రాడ్యుయేట్ సెంటరుకు ఎక్సిక్యూటివ్ కౌన్సిల్ మెంబరు గానూ; 1981 - 82 మధ్య, శ్రీ సత్యసాయి ఇంస్టిట్యూట్ ఆఫ్ హైయర్ లెర్నింగ్ లో, డైరెక్టరు గానూ; 1986 - 88 మధ్య కాలంలో, స్కూల్ ఆఫ్ మాథమాటికల్ & ఫిజికల్ సైన్సెస్‌లో డీన్ గానూ; 1989 - 91 లో ఫ్యాకల్టీ ఆఫ్ సైన్సులో డీన్ గానూ; డిసెంబరు 89 నుండీ అక్టోబరు 91 మధ్య, శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ ఆర్ట్స్ & సైన్సు యూనివర్సిటీ కాలేజి ప్రిన్సిపాల్ గానూ, అక్టోబరు 1991 నుండీ శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షులుగానూ, అనేకానేక పదవుల నలంకరించారు.

విదేశ పర్యాటనలు: శ్రీ జయరామ్ రెడ్డి గారు, అమెరికా, ఇంగ్లండ్, కెనడా, జెకోస్లోవేకియా, చైనా వంటి అనేక దేశాలలో ఎక్స్‌ంజి ప్రోగ్రా

ములలో పర్యటించారు.

ఇతర సభ్యత్వాలు: ఫిజిక్స్ శాస్త్ర బోర్డ్ ఆఫ్ స్టడీస్‌లో మెంబరు, బెంగుళూరు; మద్రాసు, కాకతీయ, శ్రీకృష్ణదేవరాయ; మైసూరు, ఆంధ్ర, నాగార్జున యూనివర్సిటీలలో మెంబరుగా అవిరళ కృషి, సేవలు చేస్తున్నారు.

శ్రీ రెడ్డి గారు స్థాపించిన ఫిజిక్స్, Thin films laboratory, దేశం లోనే అత్యున్నత మైనదిగా, Solar Energy research లోనూ, Thin film solar cells అభివృద్ధి లోనూ, గుర్తింప బడింది.

శ్రీ రెడ్డిగారు, జాతీయస్థాయిలో భారత ప్రభుత్వంచే, Solar cells అభివృద్ధి కై ఏర్పాటు చెయ్యబడిన, దీర్ఘకాలిక, స్వల్పకాలిక ప్రణాళికా సంఘంలోనూ మెంబరుగా వున్నారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ స్టేట్ కౌన్సిల్ of Higher Education, గవర్నింగ్ కౌన్సిలో మెంబరుగా తమ సేవలనందిస్తున్నారు.

ఆంధ్ర ప్రదేశ్ Open University హైదరాబాదులో బోర్డ్ ఆఫ్ మేనేజ్ మెంటులో సభ్యులు. అలానే తెలుగు అకాడమీ గవర్నింగ్ బాడీ లోనూ, శ్రీ కృష్ణ దేవరాయ విశ్వ విద్యాలయ ప్లానింగ్ బోర్డులోనూ సభ్యులుగా వున్నారు.

అంతర్ విశ్వ విద్యాలయ కంసోర్టియమ్ ఆఫ్ అస్ట్రో ఫిజిక్స్, పూనా లో యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ తరపున మెంబరు గానూ, తెలుగు యూనివర్సిటీ ప్లానింగ్ బోర్డు మెంబరు గానూ, U.G.C. స్టీరింగ్ కమిటీ ఆన్ హైటెక్నాలజీ Super Conductivity లో మెంబరుగా పని చేస్తు న్నారు.

1991 నుండీ శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ గా తీసుకున్న గణనీయ మైన చర్యలు:-

మొట్ట మొదటి సారిగా పోస్ట్ గ్రాడ్యు యేట్ కోర్సులైన M.A., M.Sc., M.Com. డిగ్రీలకు, M.Phil, Ph.D. డిగ్రీలకు ప్రవేశ పరీక్షలు నిర్వహించడం.

Arts, సైన్సు, ఇంజనీరింగ్ విద్యా విషయ కార్యక్రమాలను పునః పరిశీలన చేయుటకు, ప్రొ॥ R.V.R. చంద్రశేఖర రావ్, Dr. R. చిందంబరం; ప్రొ॥ L. S. శ్రీ కాంత్ అధ్యక్షులుగా కమిటీలను ఏర్పాటు చేసి, గత పన్నెండేండ్లుగా పునః పరిశీలనలేని వెలితిని తీర్చారు.

పరిపాలనా పరమైన యితర విధానాలలో, కావలసిన మార్పులు చేసి, యూనివర్సిటీ నిబంధనలను మార్చి, పరిపాలనా నైపుణ్యాం పెంచేందుకని. శ్రీ కె. రామిరెడ్డి, I.A.S (Retd) అధ్యక్షతన, ఏక సభ్య కమిటీని నియమించి, ఆ రిపోర్టును ఆచరణలో పెట్టేందుకు చర్యలను ప్రక్రమించారు.

జనవరి 1993 నుండీ శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటిలో ఎన్నో క్రొత్త కోర్సులు ప్రవేశ పెట్టడం జరిగింది.

సమ్మెలూ, ప్రదర్శనలూ జరుగుతూ వుండిన శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ ఏరియాలో, శ్రీ జయరామరెడ్డి వైస్ ఛాన్సలర్‌గా పదవీ స్వీకరణ తర్వాత, శాంతి నెలకొన్నది. విద్యార్థులలో క్రమశిక్షణ, ఉపాధ్యాయ బృందంలో విద్యావ్యాప్తిపై ఆసక్తత నెలకొన్నాయి.

సౌమ్యుడు, మృదుభాషి, అందరికీ అందుబాటులో నున్న నిగర్వి, సేవాతత్పరుడు, సదా తమ కార్యక్రమంలో నిమగ్నుడు, అసమాన ప్రతిభావంతుడు అయిన శ్రీ జయరామరెడ్డిగారికి, ఆయురారోగ్యాల నిచ్చి, మరిన్ని అవకాశాలతో ఉజ్వల భవిష్యత్తు కలగాలని, దైవాన్ని ప్రార్థిస్తున్నాము.

* * *

"వయసు అనుభవం నుంచి కొత్త విషయాలను గ్రహించనిదే ఏ వ్యక్తి అయినా తన జీవితంలో పరిపూర్ణుడు కాలేడు."

-ఇరెన్స్



# ప్రొ॥ ఫిలోమెనా రాయప్పరెడ్డి

శ్రీ పద్మావతి మహిళా విశ్వ విద్యాలయ వైస్ ఛాన్స్‌లర్ గా పని చేస్తున్న ప్రొఫెసర్ (కుమారి) ఫిలోమెనా రాయప్ప రెడ్డి గారు 27-04-1930 న కడప జిల్లా ఒక ప్రఖ్యాత కుటుంబంలో జన్మించారు. బాల్య దశ నుండీ, సూక్ష్మ బుద్ధి గల విద్యార్థినిగా చదువులు సాగించి, తమ B.Sc. పట్టమును, M.Sc. పోస్టు గ్రాడ్యుయేట్ పట్టమును మద్రాసు విశ్వ విద్యాలయము నుండీ పుచ్చుకున్నారు. న్యూట్రిషనల్ సైన్స్ (పౌష్టికాహార విజ్ఞాన శాస్త్రం) లో వీరు అమెరికాలోని కార్నెల్ యూనివర్సిటీ నుండి తమ డాక్టరేట్ పట్టం పుచ్చుకున్నారు.

విద్యా విషయిక యోగ్యతలలో వీ రింకా హవాయ్ (అమెరికా) East - West సెంటర్ నుండి ప్రొఫెషనల్ సర్టిఫికేట్ (వృత్తి సంబంధిత యోగ్యతా పత్రము); Social Work లో నేషనల్ ఇంస్టిట్యూట్ ఆఫ్ రూరల్ డెవలప్ మెంట్, హైదరాబాదు నుండీ, మరొక యోగ్యతా పత్రమూ సంపాదించి, పౌష్టికాహార, ఆహార శాస్త్ర, విద్యా, వార్తా సౌకర్యాలలో అపారమైన నిపుణత సంపాదించారు.

1956 నుండీ 1961 వఱకూ, మద్రాసులో స్త్రీల క్రిశ్చియన్ కళాశా లలో, రిసెర్చి అసోసియేట్‌గా, గౌరవ ఉపాధ్యాయులుగా పని చేశారు.

1961 నుండీ 1965 వఱకూ, అమెరికాలో కార్నెల్ విశ్వ విద్యాల యంలో, రిసెర్చి అసోసి యేట్‌గా, కాలేజ్ ఆఫ్ హ్యూమన్ ఎకోలజీలో తమ సేవలనందించారు.

1965 నుండీ 1976 వఱకూ, శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ కాలేజీలో, హోమ్ సైన్సు విభాగపు రీడరుగా పని చేశారు.

1976 నుండీ 1990 వఱకూ, అదే విభాగములో ప్రొఫెసర్ గా వున్నారు.

1984 నుండీ 1986 మధ్య కాలంలో, శ్రీ పద్మావతి మహిళా విశ్వ విద్యాలయం ఎక్సిక్యూటివ్ కౌన్సిల్ మెంబరు గా తమ అనుభవాన్ని పంచారు.

1985 - 1986 ల మధ్య, శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయ స్కూల్ ఆఫ్ బయోలాజికల్ & అర్త్ సైన్స్ స్ విభాగంలో డీన్‌గా పని చేశారు.

1991 ఆగస్టు నుండీ, ఈ నాటి వఱకూ, శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్‌గా పదవిని సమర్థ వంతంగా నిర్వహిస్తు న్నారు.

వీరి కనేక విద్యా విషయిక గౌరవ పురస్కారాలు లభించాయి.

విద్యార్థి దశలోనే, పోస్టు గ్రాడ్యుయేట్ విద్య నడపుటకు స్వదేశ, విదేశాలలో సహితం, స్కాలర్ షిప్ లభించింది.

1983 లో వీరి వివిధ శాఖలో ప్రావీణ్యతకు గుర్తింపుగా, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం వారి, విశిష్ట అధ్యాపకురాలు బహుమతి లభించింది.

1993 లో వీరు విద్యా రంగంలో చేస్తున్న అనన్య సేవలకు గుర్తిం పుగా భారత ప్రభుత్వం " మహిళా శిరో మణి" బిరుద ప్రదానం చేశారు.

(కుమారి) రాయప్పరెడ్డి గారు, అనేక సంస్థలలో నిపుణ వైశిష్ట్య సభ్యులు:-

వాటిలో కొన్ని:

(1) యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్, హోమ్ సైన్సు నేషనల్ పానల్.

(2) U.G.C. నేషనల్ ఎడ్యుకేషన్ టెస్టింగ్.

(3) బోర్డ్ ఆఫ్ కంటిన్యూయింగ్ ఎడ్యుకేషన్.

(4) ఇందిరా గాంధీ ఓపెన్ యూనివర్సిటీ, యెడిటోరియల్ బోర్డు

నేషనల్ కమిటీ ఫర్ డెవలప్‌మెంట్ ఆఫ్ విమెన్ లోనూ, శ్రీ పద్మావతి మహిళా యూనివర్సిటీ సిండికేట్‌లో, మెంబరు గా కూడా వీరు పని చేసి యున్నారు.

భారత దేశంలో దాదాపు 27 యూనివర్సిటీల లోనూ, యితర విద్యా సంస్థల లోనూ వీరు, బోర్డు ఆఫ్ స్టడీస్ చైర్‌మన్ గానూ, సెలెక్షన్ కమిటీల లోనూ, పేపర్ సెట్టర్ ఎగ్జామినర్ గానూ, పోస్ట్ గ్రాడ్యుఏట్, Ph.D లెవల్ ఎక్సామినర్‌గా, అనేక పదవులలో తమ అనుభవాన్ని పంచుతున్నారు. ఇందిరా గాంధీ ఓపన్ యూనివర్సిటీ, Food & Nutritionలో resource materialకు, చీఫ్ ఎడిటర్ గానూ, నిపుణులుగానూ సేవల నందిస్తున్నారు.

సత్యసాయి మహిళల కాలేజి, అనంతపురం లోనూ మాంటిస్సోరి మహిళా కళాశాల, విజయవాడలోనూ, ఆహార, పౌష్టికాహార విభాగాలను స్థాపించ డానికి తోడ్పడ్డారు.

భారతియార్; ఆగ్రా, కాశ్మీర్, ఉస్మానియా, జి.బి.పంత్, నాగపూర్ వంటి విశ్వ విద్యాలయాలలో పోస్ట్ గ్రాడ్యుయేట్ లెవల్ విద్యార్థులకు ఎక్సామినర్ గా వున్నారు.

పంద్రెండు, స్వదేశ, విదేశ వృత్తి సంబంధమైన సంస్థలలో, పౌష్టికాహారము, ఆహార శాస్త్రము, మహిళా విద్య, జన సంఖ్య, హోమ్ సైన్సు రంగాలలో వీరు మెంబరు. పదునేడు గ్రంథాలు, తెలుగు అకాడమీ పుస్తకాలు కలిపి, వీరు రచించారు.

పరిశోధనాత్మక ప్రముఖ రచనలలో, ముప్పై దాకా వీరు ప్రచురించారు.

వీరు 36 ప్రాంతీయ, జాతీయ, అంతర్జాతీయ గోష్టులు, సభలు ఏర్పాటు చెయ్యడం కానీ, వాటిలో చురుకుగా పాల్గొనడం గానీ చేశారు.

రాయలసీమ సేవా సమితి, తిరుపతి, ఆరోగ్య వరల్డ్ డెవలప్‌మెంట్ సొసైటీ, మదనపల్లి, రూరల్ డెవలప్‌మెంట్ ట్రస్ట్, అనంతపురం, Action-Aid, Bangalore, ఆర్థిక సమతా మండలం, శ్రీ కాకుళం, భాగవతుల చారిటబుల్ ట్రస్ట్, యలమంచిలి, వంటి స్వచ్ఛంద సంస్థలకు, సలహా సహకారాల నందించారు. కామన్ వెల్త్ విజిటర్‌షిప్ ప్రోగ్రాం క్రింద, బ్రిటిష్ కౌన్సిల్ వారిచే పంపబడి, వీరు 1987 మే, జూన్ నెలలలో, ఇంగ్లండు దేశంలోవిస్తృత పర్యటన చేశారు. శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయ హోమ్ సైన్సు విభాగానికి, సుర్రే మరియు ఎడిన్‌బరో యూనివర్సిటీకిని మధ్య, ఉన్నత విద్యా రంగంలో, సన్నిహిత సంబంధం ఏర్పాటులో వీరు తోడ్పడ్డారు.

UNESCO మరియు UNICEF ఐక్యరాజ్య సమితి సంస్థలైన వాటి అధ్వర్యంలో, మహిళలకు, శిశువుల పురోభివృద్ధిని చర్చించే, సదస్సులను వీరు ఏర్పాటు చేశారు.

ఆక్స్‌పామ్ (కెనడా), భారత ప్రభుత్వ ఫ్యామిలి ప్లానింగ్ అసోసియేషన్; యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్, భారత ప్రభుత్వ ఆరోగ్య కుటుంబ నియంత్రణ మంత్రిత్వ శాఖ; UNICEF, భారత ప్రభుత్వ శాస్త్ర, పర్యావరణ, సాంకేతిక విద్యా శాఖ మున్నగు సంస్థల మద్దతుతో, ప్రొ॥ (కుమారి) ఫిలోమెనా రెడ్డి గారు, అనేక పరిశోధనలు జరిపి, వివిధ ములైన అంశముల మీద - చిన్న పిల్లల, స్త్రీల ఆరోగ్య, ఇతర సమస్యల మీద - వున్నతమైన నివేదికలను తయారు చేయడంలో సఫలీకృతులయ్యారు.

వీరు అనేక పాఠ్యాంశ, పాఠ్యాంశేతర క్రియా శీలక ప్రక్రియలలో, సభ్యులుగా, శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయం లోనూ, శ్రీ పద్మావతి మహిళా విశ్వ విద్యాలయం లోనూ, అనుబంధ విద్యా సంస్థలలోనూ సభ్యులుగా చురుకుగా పాల్గొన్నారు.

1987 - 1989 లలో నేషనల్ కమిటీ for development of Women అన్న సంస్థలో నాటి భారత ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీ అధ్యక్షతన, సభ్యులుగా వీరు పనిచేసే గౌరవం పొందారు. National Perspective plan for the Development of Women- 1988, అన్న

అంశం పై భారత ప్రభుత్వ డిపార్ట్ మెంట్ ఆఫ్ ఉమెన్ & Child development , Human resources development మంత్రిత్వ శాఖ అధ్వర్యంలో తయారు చేశారు.

బహుముఖ ప్రజ్ఞా శాలి, సౌమ్యులు, మృదు భాషిణి అయిన వీరు, తొలుత న్యూట్రిషన్ లో గ్రాడ్యుయేట్ అయినా ఆరోగ్యము, జన విద్య, అసంప్రదాయ విద్యా విధానం, వార్తా వ్యాప్తి, స్త్రీ విద్య, అన్న అంశముల మీద తమ అపారానుభవాన్ని వినియోగించి, ఎనలేని సేవలు చేశారు.

అంకిత భావంతోనూ, చిత్త శుద్ధితోనూ వీరు విద్యా రంగంలో తమ సేవలనందిస్తూ, సంఘానికి తోడ్పతున్నారనడంలో అతిశ యోక్తి లేదు.

వీరికి భగవంతుడు సంపూర్ణ ఆయురారోగ్యాలు ప్రసాదించి వీరు మరిన్ని ఏండ్లు ఉన్నత పదవుల ద్వారా ఇతోధిక విద్యారంగ సేవలు చేసేలా ఆశీర్వదించాలని ప్రార్థిద్దాము.

* * *

"చెక్కతో చేసిన చెంచా ఆహారపదార్థంలోని మాధుర్యాన్ని గ్రహించనట్లే, వివేకం లేకపోతే విద్యావంతుడైనా జీవిత ప్రయోజనాన్ని అర్థం చేసుకోలేడు."

-సంస్కృత సూక్తి



# శ్రీ శంకరంబాడి సుందరాచారి

"మా తెలుగు తల్లికి మల్లెపూదండ" అన్న తెలుగు జాతీయ గీతంతో తెలుగు ప్రజాహృదయాలను చూరగొన్న ప్రసన్నకవి శ్రీమాన్ శంకరం బాడి సుందరాచారి.

"పదముల పసందు, మధుర భావముల పొందు పందెము వేసికొని కూడబలికిన రీతిగా" భారత, రామాయణాది గాథలను, తేట గీతిలో సరళ సుందరంగా, రసవత్తరంగా అల్లిన మధురకవి సుందరాచారిగారు.

వీరు 10-8-1914 న తిరుపతిలో జన్మించారు. తండ్రి రాజగోపా లయ్య, తల్లి కమలమ్మ. వారిది సంప్రదాయ బద్ధమైన కుటుంబం, తాత శంకరంబాడి కృష్ణమాచార్యులుగారు, తిరుపతిలోని మిషన్ హైస్కూ లులో సీనియర్ తెలుగు పండితులుగా వుండేవారు. డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ వీరి శిష్యులు.

సుందరాచారి గారు తిరుపతి దేవస్థానం హైస్కూలులో చదివి, మదనపల్లెలోని (బెసెంట్) థియోసాఫికల్ కాలేజీలో ఇంటర్మీడియేట్ పూర్తిచేశారు. ఆర్థిక పరమైన ఇబ్బందులవల్ల, కళాశాల చదువు అంతటి తోనే ముగిసింది. ఉద్యోగంకోసం తిరుగుతూ, మద్రాసులోని ఆంధ్రపత్రిక కార్యాలయంలో ఏడాదిపాటు సహాయ సంపాదకులుగా పనిచేశారు. తర్వాత, బెంగుళూరులోని హిజ్‌మాస్టర్స్ వాయ్స్ కంపెనీలో చేరారు. పదకొండు నాటకాలు వ్రాశారు. కంపెనీ వారు ప్రముఖ సినీ నటులు చిత్తూరు నాగయ్యగారి ద్వారా, వీటిని రికార్డు చేయించారు.

శంకరంబాడి సందరాచారిగారి పెళ్ళి జరిగిన తీరు విచిత్రంగా ఉంది. ఒకమారు కాంచీపురం వీధిలో వెళ్తున్నారు. దాహం వేసింది. మంచినీ ళ్ళకోసం ఒక ఇంటి అరుగుమీద కూర్చున్నారు. ఆ ఇంట్లో ఎదిగిన

అమ్మాయివుంది. కూతురు పెళ్ళివిషయంలో తల్లిదండ్రులు తర్జన భర్జ నలు పడుతున్నారు. అంతా విన్న సుందరాచారిగారు, ఇంటి తలుపులు తట్టారు. మీ అమ్మాయిని నేను పెళ్ళిచేసుకుంటానని సంసిద్ధతను వెలిబుచ్చారు. 1939 లో ఆ ఇంటి అల్లుడయ్యారు. చిత్తూరు జిల్లా బోర్డు హైస్కూలులో సెకండరీ గ్రేడ్ ఉపాధ్యాయులుగా చేరారు. విద్యా ర్థుల మన్ననలందుకున్నారు. కాని సినిమా పిలుపుపై ఉద్యోగానికి సెలవుపెట్టి మద్రాసు చేరారు.

దీనబంధు చిత్రానికి పాటలు వ్రాస్తూ, తెలుగు జాతివైభవ ప్రాభవాలు చిత్రించే "మా తెలుగు తల్లికీ మల్లెపూదండ" గీతం వ్రాసి దర్శకునికి ఇచ్చారు. అది ఆయనకు నచ్చలేదు. ఆ చిత్రంలో ఆ పాట పాడవలసిన సినీనటి టంగుటూరి సూర్యకుమారి 'కవిగారూ, ఈ సినిమాలవాళ్ళకి ఏ మంచి పాటా పనికిరాదులెండి. నాకివ్వండి, నేను గ్రామఫోనులోపాడి, పాటకూ, నాకూ ప్రచారం తెచ్చుకుంటాను' అన్నారు. ఆమె అన్నట్లే గ్రామఫోనులో ఆ పాట పాడారు. కవిగారికి పారితోషికంగా రూ. 116/- ఇప్పించారు. రేడియోలో స్వీయ కవితా గానంతో పాటు 'జపమాల' గేయ సంపుటి, బుర్రకథలు వ్రాయసాగారు. భార్య మానసిక రుగ్మతకు గురికావటంతో, మరలా బడిపంతులుగా చేరారు. 1951 లో స్కూళ్ళ జూనియర్ డెప్యూటీ ఇన్స్పెక్టరుగా, కడప, చిత్తూరు జిల్లాల్లో 1954 వరకు పనిచేశారు.

పై అధికారుల అడుగులకు మడుగులొత్తటం ఎరుగని శ్రీ ఆచారి గారు, ఆ పదవికి రాజీనామా ఇచ్చి, స్వేచ్ఛగా కవితా జీవన యాత్ర ప్రారంభించారు.

బాల్యం నుండి కవితాశక్తిని సంతరించుకున్న వీరు, ఖండకావ్యాలను, గేయాలను, వ్రాయసాగారు. విద్యార్థులలో కావ్య పఠనాభిలాష పెంపొం దింప చేయాలన్న దీక్షతో, బుద్ధగీత వ్రాశారు. మధురగానం, అనర్గళ వక్తృత్వం తన సొత్తుగా వీరు పాఠశాలల్లో కావ్యగానం చేస్తూ పర్య టింపసాగారు. విద్యార్థులు ఆనందంగా వారి ఖండకావ్యాలను కొన్నారు. ఏడువందల పాఠశాలలు పర్యటించి కవితాగానం, వినిపించారు, మూడే ళ్ళలో పదిహేనువేల 'బుద్ధగీత' ప్రతులు అమ్ముడుపోయాయి. ఆ రీతిగానే, ఏకలవ్య, అపవాదు, శ్రీనివాస శతకం రచించారు. ఆరువందల

తేటగీతులతో సుందరరామాయణం వ్రాశారు. సుందర భారతం వ్రాశారు. కొన్ని పుస్తకాలను విద్యార్థులే అచ్చువేయించారు. ప్రముఖులెందరో ఆర్థికసహాయం అందించారు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయోపాధ్యక్షుల ఆధ్వర్యంలో జరిగిన సన్మానసభలో విశ్వనాథ, రాయప్రోలు, గడియారం వంటి మహాకవుల సమక్షంలో 'ప్రసన్నకవి' బిరుదుతో సత్కరింపబడినారు.

1956లో శ్రీ కల్లూరు సుబ్బారావుగారి అధ్యక్షతన హిందూపురంలో సన్మానం గొప్పగా జరిగింది. చిత్తూరులో ఠాగూర్ సెంటినరి సెలిబ్రేషన్ కమిటీవారు 'గీతాంజలి' అనువాదాన్ని ప్రచురించి, సువార్ణాంగుళీయకం ప్రదానంచేశారు. 1968 లో తిరుపతిలో సత్కారం జరిగింది. 1970 లో చిత్తూరు రామ విలాస సభవారు జిల్లాకవిగా సుందరాచారిగారిని, నటుడుగా చిత్తూరు నాగయ్యగారిని, సంగీత విద్వాంసులుగా చిత్తూరు సుబ్రమణ్యం పిళ్ళైగారిని అత్యంత వైభవోపేతంగా సత్కరించారు.

ఆచారిగారు నటనలో కూడా పేరుగడించారు. బళ్ళారి రాఘవ, స్థానం నరసింహారావ్‌గార్ల నటనను విమర్శిస్తూ పెక్కు వ్యాసాలు వ్రాశారు.

1970 లో ఢిల్లీ ఆంధ్ర సంఘం ఆయనకు పెద్దయెత్తున సన్మానం జరిపింది. రాష్ట్రపతి బాబూ రాజేంద్ర ప్రసాద్ "మీకే విధమైన సన్మానం కావాలి?" అని ప్రశ్నించగా, రూ. 116/- లు ఒకశాలువా యిచ్చిన చాలునన్నారు.

జవహర్ లాల్ నెహ్రూ ప్రధానమంత్రిగ ఉన్నప్పుడు సుందరాచారి గారు ఢిల్లీలో వారిని కలుసుకున్నారు. మూడు నిమిషాలు ఇచ్చిన వ్యవధి దాటింది. మరి కొంత కాలం ఇంటర్‌వ్యూ పొడిగించమని నెహ్రూగారే కోరారు. బాలల సంక్షేమంపై, ఆంగ్లంలో రచించిన గీతాన్ని పాడి వినిపించారు ఆచారిగారు. నెహ్రూ ఆచార్యుల భావనా ప్రతిభకు ముగ్ధులై గాఢాలింగనం చేసుకొని వంద రూపాయల చెక్కుని స్వయంగా సంతకంచేసి ఇచ్చారు. తమ జీవితంలో ఇదొక మరపురాని సంఘటనగా చెప్పుకొనే వారు, ఆచారిగారు.

1961 లో రవీంద్రకవి 'గీతాంజలి' ని సుందరాచారి గారు తెనుగించారు. ఈ కృతిని ప్రశంసిస్తూ, "సుందరాచారిగారి భాషాంతరీకరణం -

భాషాంతరీకరణంలా లేదు. మూలమందలి శబ్దములనే గ్రహించి చేసిన తెనుగు సేతకాదు. ప్రధానముగా భావమును తీసుకొని సులభాంధ్ర భాషలో మూలము యొక్క సౌకుమార్యము పోకుండా తెలుగు నుడికారము చెడకుండా చేయబడిన భాషాంతరీకరణముగా కనబడుచున్నది అన్నారు, రసజ్ఞులు.

శంకరంబాడి వారు ప్రబంధ సాహిత్య ప్రభావితులైన, సామాజిక స్పృహను విస్మరించని మానవతావాది. అందుకు వుదాహరణ: మంచు కురుస్తున్నా, వేకువనే, ఆకుకూరల గంపను నెత్తిన పెట్టుకొని వీధిన పోతున్న కూరాకు పడచును చిత్రించిన తీరు ఇది.

"కడుపు మంటలు నినులేప గలిగె, కాని కటికు సూర్యుని కిరణాల చురుకునైన సరకుచేయక హాయిగా గుటకలిడుచు పడకపై బొర్లు సుకుమారి పడచులింక తెరచియుండురు కనులు నీసరకు గొనగ!"

1975 లో ప్రభుత్వం జరిపిన ప్రపంచ తెలుగు మహాసభలలో శ్రీమతి టంగుటూరి సూర్యకుమారి గారు 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' గేయం గానం చేయగా కవి శ్రీ సుందరాచారిగారిని రాష్ట్రప్రభుత్వం సత్కరించింది. 1976లో కడపలో పంచాయత్‌రాజ్ రజతోత్సవాల సందర్భంగా ముగ్గురు రాష్ట్రమంత్రులు, జిల్లా కలెక్టరు, జిల్లా రచయితల సంఘం, శంకరంబాడి వారిని ఘనంగా సత్కరించారు

"అర్థము గడియించి అధికార మునవొంగి
అతివలిచ్చు సుఖములను భవించి
ఆశదీర త్రాగి ఆడినా పాడినా,
చిక్కలేదు సుఖము శ్రీనివాస".

అంటూ స్వేచ్ఛగా జీవితం గడిపి 1977, ఏప్రిల్ 8వ తేదీన వీరు తిరుపతిలో కన్నుమూశారు.



# కీ॥ శే॥ వేటూరి ప్రభాకర శాస్త్రి

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, 1888 ఫిబ్రవరి 7 వ తారీఖున కృష్ణాజిల్లా, దివి తాలూకా, పెద్ద కళ్ళేపల్లి గ్రామమున జన్మించారు. బాల్యముననే సాహిత్య దురంధరులైన అద్దేపల్లి సోమనాథశాస్త్రి, చెళ్ళ పిళ్ళ వేంకటశాస్త్రిగారల సాంగత్యంలో, వీరికి సాహిత్య పిపాస పెంపొం దింది. 12 ఏండ్ల చిరుప్రాయంలోనే, సంస్కృత భాషలో, పద్యరచనచేసి, బాలమేధావిగా నిరూపించుకున్నారు.

తమ 18వ ఏట మద్రాసులో, వెస్లీమిషన్ పాఠశాలలో తెలుగు పండిత పదవిచేపట్టడం ద్వారా తమ భవిష్యత్ సాహిత్య ప్రయాణానికి రాచబాట వేసుకున్నారు.

పరిశోధనా ఆలోచనలుగల శ్రీ శాస్త్రి ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో తమ తృష్ణకు వలసిన గ్రంథములను గ్రోలినారు. అక్కడ పండితుడుగా పదవిస్వీకరించి, 1909 నుండీ 1939 వరకూ ఏకధాటిగా, మూడు దశాబ్దాలకాలం, అనేక అమూల్య లిఖిత గ్రంథాలను భద్రపరచారు. దక్షిణభారత దేశాటనం చేసి, అనేక ప్రాచీన తాళ పత్ర గ్రంథములను సేకరించి, సంశోధించి, 20 సంపుటముల వివరణ గ్రంథపట్టికలను (Descriptive Catalogue) స్వయంగా, శ్రీ మానవల్లి రామక్రిష్ణ కవిలాంటి గొప్ప వారి సహకారాలతో - సమకూర్చారు.

తర్వాత శ్రీశాస్త్రిగారు, 1940 నుండీ 1944 వరకు తిరుపతిలోని శ్రీవేంకటేశ్వర ప్రాచ్య కళాశాలలో తెలుగు పండితులుగాను, 1944 నుండి 1950 వరకు శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయంలో ఆంధ్ర శాఖాధ్యక్షులుగాను వ్యవహరించారు.

శ్రీ శాస్త్రిగారు సాహిత్య పరిశ్రమ ఫలితాలుగా, వారిచే ప్రచురింప బడిన గ్రంథాలను పరిగణించినా, పద్యములు, విమర్శలు తొలిపలుకులు,

పీఠికలు, చారిత్రక రచనలు, సాహిత్య పరిశోధనలు, వ్యాకరణము; వ్యాసాలు, ఆంధోలణలు, తర్జుమాలు, నాటకములు, చిన్నకథలు, పురాతన గ్రంథ తాళపత్ర పరిశోధన, మున్నగు విభిన్న అంశములు కూడి యున్నవని చెప్పవచ్చును.

ఆంధ్ర సాహిత్యానికి శ్రీ ప్రభాకరశాస్త్రి ముమ్మూర్తులా ప్రభాకరుడే. మరుగున పడిన ఎన్నో చారిత్రక విశేషాలపై తమ ప్రజ్ఞాకిరణాలు ప్రసరింపజేసి, తెలుగు సాహితీ క్షేత్రాన్ని, సుసంపన్నం చేశారు. శ్రీ శాస్త్రిగారు కవి, పండితుడు, విమర్శకుడు, పరిశోధకుడు - మీదు మిక్కిలి ఒక యోగి పుంగవుడు, గాంధేయవాదిగా తిరుపతి కొండ పైన హరిజన దేవాలయ ప్రవేశం తామే ముందుండి నిర్వహించారు. ఇతరుల బాధను తనబాధగా అనుభూతి చెందిన త్యాగమూర్తి, కరుణామయుడు శ్రీ శాస్త్రిగారు. తీవ్రానుతాపం తోడి ఈశ్వర ప్రార్థన సర్వాపన్నివారకరమని రూఢి చేసిన దివ్య పురుషుడు.

సాహితీ పరిశ్రమకు సహజ పరిణామంగా, వ్యక్తి అంతర్గత, అవినాశకర వ్యక్తిత్వము వికసిస్తుందని నిరూపించారు. ఈ సత్యము వారిజీవితంలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. యోగాధ్యయనం తామే అనుసరించుట వల్ల, దక్షిణ భారతదేశంలో వారికెందరో అనుయాయులు తయారయ్యారు.

శ్రీ శాస్త్రిగారికి యోగమన్నది ఒక కన్నయితే, గాంధీగారి సిద్ధాంతాలు మరో కన్ను.

కళాతపస్వి, కర్మయోగి అయిన శ్రీ శాస్త్రిగారు, 29 ఆగస్టు 1950న దివింగతులయ్యారు.

ప్రఖ్యాత ఆంగ్ల కవి టి.ఎస్. ఇలియట్ జన్మించిన సంవత్సరమే, శ్రీ శాస్త్రిగారు జన్మించడం విశేషము.

శ్రీ అన్నమాచార్య తామ్ర పత్రాలతో సహా ఆంధ్రదేశ నలుమూలల నుండేకాక, మద్రాసు తంజావూరు గ్రంథాలయాలలోని తాళపత్రాలను, వ్రాత ప్రతులను సైతము వెలికితీసి, ప్రచురించిన ఘనత శ్రీ శాస్త్రిగారిది.

ఉత్తమ సాహిత్య ప్రమాణాలకు సంరక్షకుడు, కళాతపస్వి, కర్మయోగి, గాంధేయవాది, ఉపాధ్యాయుడు, చారిత్రకుడు, దేశభక్తుడు, నాటకకర్త,

ప్రాచీనగ్రంథ ఆవిష్కర్త, పండితుడు, కవి, మీదు మిక్కిలి సర్వసంగ పరిత్యాగి అయిన శ్రీశాస్త్రిగారి వర్ధంతి 29-8-'93 న, తిరుపతి ఎల్డర్స్ ఫోరమ్ ఆధ్వర్యంలో శ్రీ కె. రామిరెడ్డి, I.A.S. (Retd.) అధ్యక్షతన జరిగింది. పలువురు వక్తలు ఆ ధన్యజీవి, మహోజ్వల మనీషికి జోహార్లనర్పించారు.

ఆయన రాజకీయాలు వ్రాసినా, మత విషయాలు వ్రాసినా నిర్మల హృదయం, విశ్వమానవ సోదర భావం, అచంచలమైన ఆత్మ విశ్వాసము, అకుంఠితమైన దైవభక్తి, నిరంతరంగా ప్రస్ఫుటమవుతూనే ఉండేవి. రాజకీయాలలో కల్మశం ఉండే తీరుతుందనే భావాన్ని ఆయన ఖండించారు. వ్యాపారం అంటే మోసం కాదని ఉద్ఘోషించినారు. ప్రజోద్యమం అంటే వర్గ ఘర్షణ కాదని ప్రకటించినారు. ప్రేమలేని ప్రజాజీవితం, సౌశీల్యం లేని వ్యక్తిత్వం, గర్హనీయములని ఆచరణ రూపేణా నిరూపించిన మనీషి అతడు.

1924 లో గాంధీజీ మద్రాసు వచ్చినప్పుడు ఆయనను ప్రభాకరులు సందర్శించి,

"వినయ కుటీరంబునన నిల్పితివి గదా
గర్వ పర్వతము పై గ్రాలు వారి
పార తొలగించి కన్నెరపించితివి గదా
యైశ్వర్య భోగాంధులైన వారి
తినిపించితివి గదా తన యింట తియగూర
బొరి గింటె పులగూర యరయు వారి
స్వాతంత్ర్య వీధిలో జన జేసితి విగదా
పారతంత్ర్యపు గొంది జడలు వారి
అరసితివిగా జగం బెల్ల నాత్మ గృహము
మాడ్కి నీ వంటి యుత్తమ మర్త్యుడేడి?
జయము నీ కెందు నీ కార్యచయము నందు
సత్యప్రాకంధి ! మోహన చంద్ర గాంధి!"

అన్న చాటు పద్యం చెప్పి చరితార్థులైనారు.

వారి కుమారుడు డా॥ వేటూరి ఆనందమూర్తి, వారి సాహితీ రచనలను మరింత వ్యాప్తిలోనికి తెస్తున్నారు.



# Er. కె. రామిరెడ్డి
I.A.S.(Retd.), F.I.E.

I.A.S. ఆఫీసరుగా రిటైరు అయిన శ్రీ కుర్రా రామిరెడ్డి గారు, చిత్తూరు జిల్లా పుంగనూరు మండలం, మట్టి మాకులపల్లె గ్రామంలో, వ్యవసాయ కుటుంబంలో 30-6-1932 న జన్మించారు. హైస్కూలు, కళాశాల విద్యార్థి దశలోనే ప్రథమశ్రేణి విద్యార్థిగా గుర్తింప బడి, ఛందోబద్ధ పద్య రచనలు సాగిస్తూ మంచి ప్రతిభాశాలిగా పేరు సంపాదించుకున్నారు. అనంతపురం ఇంజనీరింగ్ కాలేజీలో చదివి, సివిల్ విభాగంలో బి.ఇ. పట్టం 1957 లో పుచ్చుకున్నారు. హైడ్రాలిక్స్ ప్రత్యేక పాఠ్యాంశంగా, ఎం.ఇ. పట్టం ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండీ యూనివర్శిటీ ఫస్టుర్యాంకులో ప్రథమశ్రేణి డిస్టిన్క్షన్‌తో పొందారు.

అనంతపురం ఇంజనీరింగు కళాశాలలో లెక్చరర్‌గా ఉద్యోగ జీవనం ప్రారంభించిన శ్రీ రామిరెడ్డి, ఆ తర్వాత వనపర్తి, తిరుపతి ప్రభుత్వ పాలిటెక్నిక్‌లకు ప్రిన్స్‌పాల్‌గా వ్యవహరించారు. ఈ దశలోనే ఆయన మంచి పరిపాలనా దక్షునిగా, సాహిత్య పోషకునిగా కీర్తి గడించారు.

రెండు దశాబ్దాలు సాంకేతిక విద్యాసేవలు చేసిన తర్వాత, శ్రీ రెడ్డిగారు ఎ.పి.ఎ.ఎస్. (ఆంధ్ర ప్రదేశ్ అడ్మినిస్ట్రేటివ్ సర్వీసు) కు 1977 లో ఎంపిక అయ్యారు. 1980 సంవత్సరంలో, రాష్ట్ర సాంకేతి విద్యాశాఖ డైరెక్టరుగా ఐరోపా దేశాలలో పర్యటించి వచ్చారు. అచ్చట సాంకేతిక విద్యా శిక్షణ, ఉపాధి కల్పన అవకాశాల గురించి విస్తృతంగా అధ్యయనం చేశారు. వీరి గణనీయమైన సేవలకు గుర్తింపుగా, 1982 లో వీరు ఐ.ఏ.ఎస్. (ఇండియన్ అడ్మినిస్ట్రేటివ్ సర్వీసు)కు ఎంపిక అయ్యారు. మన రాష్ట్రంలో సాంకేతిక విద్యాశాఖనుంచే ఐ.ఏ.ఎస్.కు ఎంపికైన వారు ఇంతవరకు శ్రీ రామిరెడ్డిగారు ఒక్కరే.

వీరు ఎన్నో ఉన్నత పరిపాలనా పదవుల నలంకరించారు. ఆంధ్ర

ప్రదేశ్ ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్‌కు ఎక్సిక్యూటివ్ డైరెక్టరుగానూ; ఇండస్ట్రీస్ అండ్ కామర్స్ డిపార్ట్‌మెంట్ అడిషనల్ సెక్రటరీగానూ; శ్రీ విజయ భాస్కరరెడ్డిగారు మొదటిసారి, మన రాష్ట్ర ముఖ్యమంత్రిగా పనిచేసిన కాలంలో వారికి డిప్యూటీ సెక్రటరీగానూ; రెండుసార్లు డైరెక్టర్ ఆఫ్ టెక్నికల్ ఎడ్యుకేషన్ (సాంకేతిక విద్యాశాఖ) పదవిలోనూ; సోషల్ వెల్‌ఫేర్ డిపార్ట్‌మెంటు (సాంఘిక సంక్షేమ శాఖ) కమిషనర్ మరియు డైరెక్టరుగానూ; ఆంధ్రప్రదేశ్ ఇరిగేషన్ డెవలప్ మెంట్ కార్పొరేషన్ వైస్ చేర్మన్ మరియు మేనేజింగ్ డైరెక్టరుగానూ వివిధ అత్యున్నత పదవులను సమర్థవంతంగా నిర్వహించారు.

డైరెక్టర్ ఆఫ్ టెక్నికల్ ఎడ్యుకేషన్ గా దేశంలోనే ప్రప్రథమంగా ఎస్.సి. మరియు ఎస్.టి. విద్యార్థులకు ప్రత్యేకంగా రెసిడెన్షియల్ పాలిటెక్నిక్‌లు మనరాష్ట్రంలో నెలకొల్పారు. అలాగే దేశానికంతటికీ ప్రప్రథమంగా స్వతంత్ర ప్రతిపత్తి గలిగిన స్టేట్ బోర్డు ఆఫ్ టెక్నికల్ ఎడ్యుకేషన్‌ను నెలకొల్పారు.

1990 లో పదవీ విరమణ చేసిన తర్వాత వీరి సామర్థ్యాన్ని గుర్తించి, ఆంధ్రప్రదేశ్ ఇరిగేషన్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ ఛేర్మన్‌గా వీరిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నియమించింది.

విద్యార్థి దశనుండీ సాహిత్య కార్య కలాపాలలో పాల్గొంటున్న శ్రీ రామి రెడ్డి, భారతి, స్వతంత్ర, వంటి ప్రతిష్టాత్మకమైన పత్రికలలో కథా నికలు, వ్యాసాలు వ్రాసి ప్రచురించారు. ఆ కథలన్నీ ఒక సంపుటిగా కూడా "అబలలూ - అనుమానాలు" పేర విడుదల చేశారు.

సాహిత్య పరంగానే కాకుండా, Applied Mechanics అన్న ఇంజ నీరింగ్ పాఠ్య పుస్తకాన్ని కూడా రచించారు.

ఇన్ని ఉన్నత పదవుల నలంకరించి విశేషాను భవాన్ని రంగరించు కొని వీరి షష్టిపూర్తి సందర్భములో "మారుతున్న సమాజంలో, ఎవరు, ఎందుకు ఎలా వ్యవహరిస్తారు" అన్న సామాజిక విశ్లేషణా గ్రంథాన్ని ప్రచురించి, 30-6-1992 న విడుదల చేశారు. వీరి ధర్మపత్ని శ్రీమతి సీతమ్మగారికి ఈ గ్రంథం అంకితం చేశారు. వీరి అమూల్య అశేష అనుభవాన్ని వినియోగించుకుంటూ, రాశి సిమెంట్ కంపెనీ, స్టైల్స్

ఇండియా లిమిటెడ్ కంపెనీ వీరిని డైరెక్టరుగా నియమించారు.

వీరి అపార సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించుకొనుటకై, హైదరాబాదు జవహర్ లాల్ నెహ్రూ టెక్నోలాజికల్ యూనివర్శిటీలో వీరిని మ్యానేజ్‌మెంట్ కమిటీ మెంబరుగా ప్రభుత్వం వారు నియమించారు.

వీరి పరిపాలనా అనుభవాన్ని ఉపయోగించుకుంటూ శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయము వీరిని Administrative Reforms ఏక సభ్య కమిటీ ఛైర్మెన్‌గా నియమించింది. చక్కని మార్పులు సూచిస్తూ వీరు చేసిన అమూల్యమైన సూచనలను అమలు పరచేందుకు సైతం వీరిని ఏక సభ్యులుగా మరొక్క Implementation కమిటీని నియమించి, విశ్వవిద్యాలయము, పరిపాలనా విభాగాన్ని పటిష్టం చేస్తున్నది.

వీరు శ్రీ వేంకటేశ్వరా విశ్వవిద్యాలయం స్టాండింగ్ బోర్డు ఆఫ్ ఎంక్వయరీస్ మెంబరుగానూ, శ్రీ పద్మావతీ మహిళా విశ్వవిద్యాలయం వైస్ ఛాన్స్‌లర్‌కు అడ్వైజరీ కమిటీ మెంబరుగానూ వ్యవహరిస్తున్నారు. తిరుపతి తిరుమల దేవస్థానం అమెనిటీస్ కమిటీ మెంబరుగా కూడా వీరు వ్యవహించారు.

మంచి వక్త, స్నేహ శీలి, సాంఘిక సేవా తత్పరుడు అయిన శ్రీ రామిరెడ్డి గారు, ఇంగ్లీషు, తెలుగు భాషలలో అనర్గళంగా ఉపన్యసించగలరు. అనేక సాంస్కృతిక సాంకేతిక సభలలో చురుకుగా పాల్గొంటూ సంఘ సేవలు అందిస్తూ, తిరుపతి పట్టణంలో స్థిరపడ్డారు. రోటరీ క్లబ్ మెంబరుగానూ, అధ్యక్షులుగానూ కూడా సేవలనందించారు.

తిరుపతిలో ఎల్డర్స్ ఫోరమ్ అన్న సంఘాన్ని స్థాపించి, అధ్యక్షులుగా వుంటూ, అనేక స్థానిక సమస్యలను సంబంధిత అధికారుల దృష్టికి తెచ్చి, తిరుపతి పట్టణాభివృద్ధికి అహర్నిశము పాటు పడుతున్నారు. Master plan for Tirupati అన్న గ్రంథాన్ని వీరి పర్యవేక్షణలో ప్రచురించారు.

వీరికి కొద్ది నెలల క్రితమే ఇన్‌స్టిట్యూషన్ ఆఫ్ ఇంజనీర్స్ (ఇండియా) సంస్థ అత్యున్నత సభ్యత్వం F.I.E. (ఫెలో ఆఫ్ ఇన్‌స్టిట్యూషన్ ఆఫ్ ఇంజనీర్స్) ప్రసాదించి గౌరవించింది. ఇన్‌స్టిట్యూషన్, తిరుపతిశాఖ

నిర్వహిస్తున్న కార్యక్రమాలలో వీరు చురుకుగా పాల్గొంటున్నారు.

ఆశ్రయించిన అందరికీ తనకు తోచిన సహాయాన్నీ, సలహాలను అందజేస్తూ, తన మంచితనాన్ని, సహృదయతను సంఘానికి పంచు తున్నారు. వీరు మరిన్ని సంఘసేవలు చేస్తూ, ఆయురారోగ్యాలతో సుఖసంతోషాలతో చిరకాలం మనుగడ సాగించాలని కోరుకుందాము.

* * *

"సంతృప్తి అనేది సహజమైన సంపద. భోగవిలాసాలు కృత్రిమమైన దారిద్ర్యం వంటివి."

-సోక్రటీస్

"నీవు ఏమేమి మాట్లాడదలుచుకున్నావో అంతా ఆలోచించుకో! కాని, ఆలోచించినదంతా మాట్లాడకు. ఆలోచనలు మాత్రమే నీవి. అవి బయటకు వెడితే మాత్రం నీవి కావు."

-డిలాని



# Er. కె. రామిరెడ్డి
I.A.S.(Retd.), F.I.E.

I.A.S. ఆఫీసరుగా రిటైరు అయిన శ్రీ కుర్రా రామిరెడ్డి గారు, చిత్తూరు జిల్లా పుంగనూరు మండలం, మట్టి మాకులపల్లె గ్రామంలో, వ్యవసాయ కుటుంబంలో 30-6-1932 న జన్మించారు. హైస్కూలు, కళాశాల విద్యార్థి దశలోనే ప్రథమశ్రేణి విద్యార్థిగా గుర్తింప బడి, ఛందోబద్ధ పద్య రచనలు సాగిస్తూ మంచి ప్రతిభాశాలిగా పేరు సంపాదించుకున్నారు. అనంతపురం ఇంజనీరింగ్ కాలేజీలో చదివి, సివిల్ విభాగంలో బి.ఇ. పట్టం 1957 లో పుచ్చుకున్నారు. హైడ్రాలిక్స్ ప్రత్యేక పాఠ్యాంశంగా, ఎం.ఇ. పట్టం ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండీ యూనివర్శిటీ ఫస్టుర్యాంకులో ప్రథమశ్రేణి డిస్టిన్క్షన్‌తో పొందారు.

అనంతపురం ఇంజనీరింగు కళాశాలలో లెక్చరర్‌గా ఉద్యోగ జీవనం ప్రారంభించిన శ్రీ రామిరెడ్డి, ఆ తర్వాత వనపర్తి, తిరుపతి ప్రభుత్వ పాలిటెక్నిక్‌లకు ప్రిన్సిపాల్‌గా వ్యవహరించారు. ఈ దశలోనే ఆయన మంచి పరిపాలనా దక్షునిగా, సాహిత్య పోషకునిగా కీర్తి గడించారు.

రెండు దశాబ్దాలు సాంకేతిక విద్యాసేవలు చేసిన తర్వాత, శ్రీ రెడ్డిగారు ఎ.పి.ఎ.ఎస్. (ఆంధ్ర ప్రదేశ్ అడ్మినిస్ట్రేటివ్ సర్వీసు) కు 1977 లో ఎంపిక అయ్యారు. 1980 సంవత్సరంలో, రాష్ట్ర సాంకేతి విద్యాశాఖ డైరెక్టరుగా ఐరోపా దేశాలలో పర్యటించి వచ్చారు. అచ్చట సాంకేతిక విద్యా శిక్షణ, ఉపాధి కల్పన అవకాశాల గురించి విస్తృతంగా అధ్యయనం చేశారు. వీరి గణనీయమైన సేవలకు గుర్తింపుగా, 1982 లో వీరు ఐ.ఏ.ఎస్. (ఇండియన్ అడ్మినిస్ట్రేటివ్ సర్వీసు)కు ఎంపిక అయ్యారు. మన రాష్ట్రంలో సాంకేతిక విద్యాశాఖనుంచే ఐ.ఏ.ఎస్.కు ఎంపికైన వారు ఇంతవరకు శ్రీ రామిరెడ్డిగారు ఒక్కరే.

వీరు ఎన్నో ఉన్నత పరిపాలనా పదవుల నలంకరించారు. ఆంధ్ర

మంచి శిల్పం ద్వారా సాహిత్య ఖండాలుగా మూర్చిన ఆయన కథలను ప్రచురించని పత్రిక లేదు.

వివిధ పత్రికల్లో ప్రచురితమై తెలుగు సాహిత్యాన్ని పరిపుష్టం చేసిన రాజారాంగారి కథలను విశాలాంధ్ర బుక్ హౌస్ వంటి ప్రచురణ సంస్థలు, ఉత్సాహంతో పుస్తక రూపంలో ముద్రించి ఆయన మీద ఉన్న గౌరవాన్ని చాటుకున్నాయి. పునర్నవం; వర్షించిన మేఘం; కమ్మ తెమ్మెర, రేపటి ప్రపంచం, వగ పేటికి, పాంథశాల వంటి ఆయన కథా సంపుటాలు తెలుగు నేల నలు చెరుగుల వ్యాపించడమే కాక, సుప్రసిద్ధ సాహిత్య విమర్శకులను, కథకులను, స్పందింప చేశాయి. ఈ సంపుటాల్లోని చాలా కథలు, మల్లెపూలు, మంచి గంధం లాంటి హార్దికమైన మంచి తనాన్ని మన కందరికీ పంచి పెడతాయి.

వీరు కథలే కాక, రెండు నవలలు కూడా వ్రాశారు. అందులో "త్రిశంకుడి స్వర్గం" ప్రసిద్ధమైంది. "చిన్న ప్రపంచం సిరివాడ" అనే నవల రష్యన్ బాషలోకి అనువదింప బడింది. పిల్లల నవలగా దీనికి మంచి పేరు వచ్చింది.

రాజారాం గారు మానవత్వం జాలు వారే మనిషి, మధుర భక్తి, మధుర గీతం, మధుర జీవితం ఆయనకు చాలా యిష్టం. శ్రావ్యమైన సంగీతానికి అనుగుణంగా కొన్ని వందల పాటలు, గేయాలు వ్రాశారు. వీటిలో ఏన్నో గేయాలు ఆకాశవాణి లలిత సంగీత కార్యక్రమం ద్వారా తెలుగు వారికి పరిచయ మయ్యాయి. ఆయన ఈ గేయాలన్నింటినీ, "పాటల తోట" "సుమాంజలి" పేర్లతో గేయ సంపుటాలుగా ప్రచురించారు.

నిర్విరామంగా కథా రచన సాగిస్తున్న రాజారాం సాహిత్య విమర్శ కూడా చేశారు. ఆయన వ్రాసిన వ్యాసాలు చాలా వరకూ, మహతి, సమాలోచన, తెలుగు కథా రచయితలు, మొదలైన వ్యాస సంపుటాల్లో చోటు చేసుకున్నాయి.

శ్రీ రాజారాంగారు తమిళ భాషా సాహిత్యాన్ని అధ్యయనం చేసి ప్రసిద్ధ తమిళ నవలా రచయిత అఖిలన్ గారి చరిత్ర సుందరి, మన స్విని వంటి నవలలను ప్రతిభావంతంగా తెలుగులోకి అనువాదం చేశారు.

పిల్లల టాగూరు, వీర సింహుని విజయ యాత్ర వంటి ఆయన అనువాద రచనలను దక్షిణ భారత పుస్తక సమాఖ్య ప్రచురించింది. తెలుగులో నికి తెచ్చిన జయకాంతన్ కథలను నేషనల్ బుక్ ట్రస్ట్ ప్రచురించింది. "నారు - నీరు" అనే పుస్తకాన్ని కేంద్ర సాహిత్య అకాడమీ ప్రచురించింది.

ఒక వైపు రచనా వ్యాసాంగం ముమ్మరంగా సాగిస్తూ, ఇంకో వైపు ప్రసిద్ధ సాహిత్య సంస్థల కోరిక మేరకు వీరు "తొలి నాటి తెలుగు కథలు" "ఒక దశాబ్ది తెలుగు కథలు" అనే పరిశోధక గ్రంధాలకు సంపాదకత్వం వహించి కృత కృత్యులయ్యారు.

ప్రసిద్ధ కథా రచయితగా, మధ్య తరగతి జీవన వైవిధ్యాలను ఒక ప్రత్యేకమైన కథన శిల్పం ద్వారా చిత్రిస్తున్న రాజారాంగారు గేయ రచయితగా, నవలాకారునిగా వ్యాస కర్తగా, సంపాదకునిగా తెలుగు సాహిత్యానికి చేసిన సేవ అపారం. ఈ సేవలను గుర్తించి, అటు ప్రభుత్వము, ఇటు సాహిత్య సంస్థలు, పత్రికా రంగాలు ఆయనను సముచితంగా సత్కరించి, తమ గౌరవాన్ని పెంచు కున్నాయి.

ఆయన అధ్యాపక వృత్తిలోని ప్రావీణ్యతను గుర్తించి 1985 లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ఉత్తమ ఉపాధ్యాయునిగా గౌరవించారు. 1967 లోనే ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఉత్తమ కథకునిగా సత్కరించింది. 1990 లో కొండే పూడి శ్రీనివాసరావ్ అవార్డు, 1991 లో గోపీ చంద్ అవార్డు వీరికి లభించాయి. 1983 లో ఉత్తమ అనువాదకునిగా, తంజావూరు విశ్వ విద్యాలయం ఆయన కిచ్చిన అవార్డు, తమిళాంధ్ర బాషా సాహిత్యాలలో వారి కున్న అభినివేశాన్ని తెలుపుతుంది. ఈ సంవత్సరం, కేంద్ర సాహిత్య అకాడమీ కథలకు, అవార్డును ప్రకటించడం వీరి సాహిత్య కృషికి జరిగిన అత్యున్నత పురస్కారము.

వీరు జీవితంలో అనేక గౌరవ స్థానాలను అలంకరించారు. 1973 - '77 మధ్య కాలంలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యులుగా, 1973 –'82 మధ్య కాలంలో ఆధునిక సాహిత్య సలహా సంఘం సభ్యులుగా, 1987 - '89 మధ్య కాలంలో ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం సభ్యులుగా సాహిత్యానికెంతో సేవలు చేశారు.

ఇంతటి గొప్పవాడై, పేరు ప్రతిష్టలు సంపాదించినా, రాజారాం

వినయ శీలి. సాహిత్యం పట్ల తాను చేసిన కృషికి నిండైన ప్రతి ఫలం లభించిందని... సమాజానికి ఇంకా ఎంతో ఋణపడి వున్నానని... అంటూ ఆయన ఒక చోట తన వినయాన్ని చాటుకున్నారు. ఈనాడు వస్తున్న పత్రికలన్నీ తనకు నడకలు నేర్పాయని, సాహిత్య ప్రపంచంలోకి నడిపించాయని పత్రికల పట్ల కృతజ్ఞత వ్యక్తం చేశారు.

రాజారాం గారు మొదట్లో అందరి లాగానే కథలు రాయాలని వ్రాసినా తన రచన పట్ల తనకు విశ్వాసం కలిగిన తర్వాత, తానెం దుకు వ్రాస్తున్నాను, ఏమి వ్రాస్తున్నాను, అన్న మెళకువతో వ్రాస్తు న్నారు. సామాజిక బాధ్యతతో, సాహిత్యాన్ని సృష్టి స్తున్న మధురాంతకం రాజారాం గారిని, వారి సాహిత్య సేవను గుర్తించి, గౌరవ డాక్టరేట్ పట్టము నిచ్చిన, శ్రీ కృష్ణ దేవరాయ విశ్వ విద్యాలయ యాజమాన్యాన్ని అభినందించాలి.

అనేక మందికి మంచి కథల రుచి చూపించి ఉత్తమ కథా సాహిత్యం అనే అభిరుచిని అలవాటు చేసిన పెద్ద తరం కథకుల జాబితాలోని వారు శ్రీ రాజారాం. పచ్చని లే లేత ఆకు లాంటి తెలుగు వాక్యం చదివితే ప్రాణం లేచొచ్చినట్టని పించే వాతావరణం, మన చెరువు గాలి, మన మనసులోని మర్మం, బెంగ పడ్డ దినసరి జీవితం, పిలిచినట్టల్లా పలికే మంచి మనిషి లాంటి కథా సారాంశం రాజారాం గారికి ఇట్టే తెలిసిన సంగతి.

మధురాంతకం వారి అనేకానేక కథల సారాంశం "కరుణ". రాజారాం గారు కథలే కాక, పాటలూ వ్రాశారు. వీరి పాటలు శ్రీ రంగం గోపాల రత్నం మధు రాతి మధురంగా ఆకాశవాణి లో ఆనాడు పాడారు.

ఒక పత్రికకు వారిచ్చిన ఇంటర్వ్యూలో వెలిబుచ్చిన కొన్ని ముఖ్య అభిప్రాయాలు:-

"చదివేటప్పుడు, ఎప్పుడో ఒకప్పుడు కళ్ళు చెమరిస్తే అది మంచి కథ అని నా ఉద్దేశం".

"కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు, గౌరవ డాక్టరేట్ లభించిన

సందర్భంగా నేనేమి పెద్దగా ఉప్పొంగి పోలేదు. చేసిన సాహిత్య సేవకు కొన్ని చోట్లనుంచి గుర్తింపు రావడం రచయితలకి కాస్త సంతృప్తి కరం గానే వుంటుంది. కాని ఇంత కంటే కథలు రాసుకోవడం లోనూ, చదువు కోవడం లోనూ ఉండే ఆనందమే ఎక్కువని పిస్తుంది. మళ్ళీ తపస్సు కొనసాగించాలి".

డబ్బు గల తల్లుల మంచి గంధం పెట్టెలో మేలి ముత్యాలు దాచు కుంటారు. అలానే మనం మనసులో మంచి కథలు దాచుకుందాం. శ్రీ రాజారాంగారు మరిన్ని గొప్ప కథలు వ్రాయాలనీ కోరుకుందాం.

* * *

"ఆలస్యంగా నిద్రలేచే వాడెవ్వడూ గొప్ప వాడైనట్టుకాని ప్రాము ఖ్యాన్ని సంపాదించినట్టుకాని నేను విలలేదు."

-స్విఫ్ట్

"విజ్ఞానం అంటే తనకు అంతా తెలుసునన్న అహంకారం. వివేకం అంటే తనకు ఏమీ తెలియదన్న వినమ్రత.

-కూపర్



# డా॥ మేడసాని మోహన్

వందమంది పృచ్ఛకులు ప్రశ్నలు వేస్తూ , పద్య పూరణలు చెయ్యమని అడుగుతూ, పురాణ సందర్భాలను వివరించమని అడుగుతూ, గంటలు కొడుతూ ఎన్నిసార్లు కొట్టామోనని లెక్క పెట్ట మంటు ఏకధాటిగా అడుగుతూ ఉంటే వివిధములైన ప్రశ్నలకు ఒకే ఒక వ్యక్తి జవాబు చెప్పాలంటే, ఎంతో జ్ఞాపక శక్తి, ఏకాగ్రత, పాండిత్యము, భాష, పురాణ పరిజ్ఞానము కలిగి వుంటే గాని సాధ్యపడదు.

అష్టావధాన మంటేనే అదొక గొప్ప యజ్ఞము. శతావధాన మంటే మహా యజ్ఞము. మన భాషలో శతా వధానులు వేళ్ళపై లెక్కించ గలిగినందరే వున్నారు. అట్టి గొప్ప విజ్ఞులు, పండితులు, మేధావులలో అరుదైన ఒక్కరే డా॥ మేడసాని మోహన్. వీరు చిత్తూరు జిల్లాలో చంద్రగిరి మండలం నడింపల్లిలో జన్మించిన వారు కావడం గర్వకారణము.

బాల్యమున వారి ఆరోగ్యం అసంతృప్తిగా ఉండేది. శ్రీ శివానంద మౌనస్వామి వారి అనుగ్రహం వలన వారి ఆరోగ్యం కుదుటపడింది. అప్పటి నుండి 1986 లో వారి వివాహంలో శ్రీ స్వామి వారు ఆశీర్వదించే వరకూ వీరికి స్వామి వారి ప్రోత్సాహం, అండదండలు లభించినవి.

19-4-1955 న జన్మించిన, శ్రీ మోహన్ 1978 లో, M.A. Literatureలో, మొదటి శ్రేణిలో వెంకటేశ్వరా విశ్వ విద్యాలయం నుండి పట్టం పొందారు. తదుపరి 1985 లో మద్రాసు విశ్వ విద్యాలయం నుండీ తమ డాక్టరేట్ పట్టం "A descriptive Analysis of Annamacharya's language - అన్నమాచార్య, భాషా వర్ణ నాత్మక విశ్లేషణ" అన్న అంశం మీద పరిశోధన చేసి పుచ్చు కున్నారు. వారి పరిశోధనా గ్రంథం 1435 చేతి వ్రాత పుటలలో నున్నది, అని తెలిసినప్పుడు, వారు ఎంత

విస్తృతంగా పరిశోధించి , విపులీకరించినారో అవగాహ వవుతున్నది.

ప్రస్తుతం డా॥ మేడసాని మోహన్ గారు , తిరుమల-తిరుపతి దేవస్థానముల వారి, అన్నమాచార్య ప్రాజెక్టు విభాగపు డైరెక్టరుగా పదవి నలంకరించి యున్నారు.

పువ్వు పుట్టగానే పరిమళిస్తుందన్నట్లు, వీరు తొమ్మిదవ ఏటనే ఆశువుగా పద్యాలు చెప్పేవారు. పదవ క్లాసులో ఉండగానే మొదటి అవధానం జరిపారు. ఇంటర్‌మీడియేట్‌కు వచ్చినప్పటినుండి బహిరంగ సభలలో అవధానం చేయడం ఆరంభమైంది.

వీరు ఇది వఱకూ 212 అష్టావధానాలు, 15 ద్విగుణిత అవ ధానములు; తెలుగు సాహిత్య చరిత్ర లోనే ప్రపథమంగా షడ్గుణిత అష్టావధానము; దశ గుణిత అష్టావ ధానము; షోడశ గుణిత అష్టావ ధానము, ప్రత్యుత్పత్తి పరిపూర్ణ అష్టావ ధానము చేసి అందరి మెప్పులను పొందారు.

భారత దేశంలోనే కాక, ఇంగ్లండు, అమెరికా, కెనడా లాంటి విదే శాలలో కూడా వీరు అష్టావధాన ప్రక్రియను ప్రదర్శించారు.

అమెరికా ఆంధ్రుల ఆహ్వానాన్ని స్వీకరించి, 1989-92 ల మధ్య కాలంలో, లండన్, జాక్సన్, హూస్టన్, శాన్‌ఫ్రాన్ సిస్కో , సైంట్‌లూయీ, వాషింగ్టన్, ఒట్టావా (కెనడా) , న్యూయార్క్ , హంట్స్‌విల్; అట్లాంటా, చికాగో, కొలంబస్, బోస్టన్, క్లీవ్ లాండ్, టోరాంటో (కెనడా) లలో తమ అష్టావధాన పాండిత్యాన్ని ప్రదర్శించి, మన్ననలందుకున్నారు.

25,000 పద్యాలను, సంస్కృత భాషతో సహా వీరు కంఠతా పట్టిన అపర మేధావి. వీరి జీవిత విశేషాలను, అమెరికా బయో గ్రాఫిక్ ఇంస్టిట్యూట్‌లో ప్రకటించి, గౌరవించారు.

ప్రత్యేకించి, వీరిదివరకూ 11 చోట్ల సంపూర్ణ శతావధానాలు చేసి, వంద మంది పృచ్ఛకులకు జవాబు చెప్తూ తమ అపారమైన ప్రతిభను ప్రదర్శించి కృత కృత్యులయ్యారు.

అనేక గ్రంథాలను రచించిన గ్రంథ కర్త డా॥ మోహన్, వీటిలో

ముఖ్యమైనవి.

"అన్నమాచార్య భావు కత" - వీరి పరిశోధనా వ్యాసము - ,
పతి, తిరుమల వారిచే ప్రకటితము.

శ్రీ పెద తిరుమలా చార్యుల వారి శృంగార దండకము:- తిరు
తిరుమల దేవస్థానము అన్నమాచార్య ప్రాజెక్టు వారిచే ప్రకటితము.

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారి శత జయంత్యుత్సవ స్మా
సంచిక :- తిరుపతి తిరుమల దేవస్థానము వారిచే ప్రచురితము.

"గీతా పాదము" అన్న పద్య రచన తిరుపతి హిమ బాల పబ్లికేష
వారిచే ప్రచురితము.

"అవధాన మిస్సిసిపి" హిమ బాల పబ్లికేషన్స్.

"శతావధాన సంచిక, గుంటూరు", శ్రీ నాథ పీఠము, గుంటూ
వారిచే ప్రచురితము.

"విజయ వాడ, శతావధాన సంచిక" శ్రీ బ్రహ్మయ్య అండ్ కం
విజయవాడ వారిచే ప్రచురితము.

ఆంధ్ర ప్రభ, ఆంధ్ర జ్యోతి, ఈనాడు వంటి దిన పత్రికలలో
రచనలు, సంస్కృత, తెలుగు భాషల మీద, ప్రచురించ బడినవి.

వీరి సాటిలేని, సాహితీ ప్రతిభను గుర్తించి, ప్రఖ్యాతి గాంచిన విద
వంతులు, సంస్థలు, క్రింది బిరుదుల నిచ్చి సత్కరించారు.

"బాలావధాని"; "అవధాన రత్న"; "అవధాన సప్తాస పతి"; "అ
ధాన చక్రవర్తి"; "శతావధాన కీర్తి కౌముది"; "అవధాన కళాధర
"సరస్వతీ సత్పుత్ర"; "అవధాన జగదేక సామ్రాట్"; "విశ్వావధాని
"అవధాన కృషి పండిట్"; "సహజావధాని"; "అవధాన కేసరి"; "అ
ధాన సరస్వతి"; "శతావధాన సరస్వతి" ; "అవధాన కళా తపస్వి"
"వాగ్దేవి వర పుత్ర"; "ఆచార్య"; "కవితా గంగోత్రి"; "ధారణ కళానిధి'
"సరసావధాన సరస్వతి".

ఇన్ని సాహిత్య బిరుదులను పొందిన వ్యక్తి, తెలుగు నాడులోనూ, భారత దేశ యితర భాషలలోనూ, లేడంటే అతిశయోక్తి కాదు.

వీరికి లభించిన బహుమానములలో కొన్ని:-

మద్రాసు, యార్ల గడ్డ రాజ్యలక్ష్మి వెంకన్న బహుమతి, 1986.

అకాడమీ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్ వారిచే భారత రాష్ట్రపతి ద్వారా, ప్రత్యేక బహుమతి.

జూనియర్ ఛేంబర్ ఆఫ్ కామర్స్ వారిచే, రాష్ట్రపతి ద్వారా, ప్రత్యేక బహుమతి.

ఉత్తర అమెరికా తెలుగు సమాఖ్య వారిచే , అత్యుత్తమ ప్రదర్శన పురస్కారము, 1989.

మద్రాసు తెలుగు అకాడమీ బహుమతి, 1992.

కవి సింహ కాశీపతి బహుమానము, 1992.

ప్రత్యేకమైన గౌరవ ప్రదానాలలో కొన్ని:-

తిరుపతి , తిరుమల దేవస్థానము, ఫైన్ ఆర్ట్స్ అకాడమీ, సంయుక్తంగా, బహూకరించిన "స్వర్ణ కంకణం", 1985.

తిరుమల తిరుపతి దేవస్థానము వారిచే "శ్రీ వెంకటేశ్వర బంగారు పతకము" - 1983.

రసభారతి, విజయవాడ వారిచే "స్వర్ణ హారము" 1985.

1985 లో పలమనేరు లోనూ, అదే ఏడు విజయవాడ లోనూ, 1980 లో మాచర్ల లోనూ "స్వర్ణాభిషేకము".

"స్వర్ణ కంకణము" కాకినాడ 1986.

"గంధపు చెక్క ఖడ్గము, అకాడమీ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్, 1987.

రజిత ఖడ్గము, విజయనగరం, 1988.

వీరు 1993 ఫిబ్రవరిలో చేసిన శతావధాన ప్రదర్శనలో నేటి భారత ప్రధాని శ్రీ పి. వి. నరసింహారావ్ పృచ్ఛకులలో ఒకరుగా ఉండి, మత సామరస్యాన్ని గూర్చి ప్రశ్నలడగడము, వారి నుండీ మెప్పు పొందడము, ప్రత్యేకంగా చెప్పుకోదగిన విశేషము.

శ్రీశ్రీశ్రీ శివానంద మౌన స్వామి, కంచి కామ కోటి పీఠాధిపతులు, శ్రీశ్రీశ్రీ జయేంద్ర సరస్వతి; మైసూరు సచ్చిదా నందస్వామి; శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీ మన్నారాయణ చిన్న జీయార్, సీతా నగరం ఆంధ్రప్రదేశ్; శ్రీశ్రీశ్రీ బండ్ల మాంబా దేవి; శ్రీశ్రీశ్రీ విజయేస్వామీ దేవి; శ్రీశ్రీశ్రీ విశ్వయోగి, విశ్వామ్ జీ, డా॥ మోహన్ గారిని మన సారా దీవించిన మత గురువులు.

అనుకోని విధంగా అచ్చిన అవధాన ప్రక్రియకు, అన్నమాచార్య సాహిత్య ప్రచారానికి జీవితాంతం సేవ చేస్తుండడమే తన లక్ష్యమని డా॥ మెహన్ అంటారు.

వీరికి శ్రీ వెంకటేశ్వర స్వామి ఆశీస్సులు సర్వదా వుండి, మరిన్ని సాహిత్య సేవలు చెయ్యాలని, వారికి, వారి కుటుంబానికి ఆయురారోగ్య , సంపదలు సమకూర్చాలని, ప్రార్థిద్దాము.

* * *

"స్నేహితుడిని నీ దుఃఖ సమయంలోను, యోధుడిని యుద్ధంలోను, భార్యను పేదరికంలోను, గొప్ప వ్యక్తిని అతని వినయంలోను పరీక్షించాలి."

-సంస్కృతసూక్తి



# శ్రీ సముద్రాల లక్ష్మణయ్య

రచయితగా, పండితుడుగా, వక్తగా, ఆధ్యాత్మజ్ఞాన సంపన్నుడుగా తిరుపతి పురజనులకే కాక ఆంధ్రావనిలో వేలకొలది ప్రజానీకానికి పరిచితులు శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారు.

వీరు ప్రస్తుతం తిరుమల - తిరుపతి - దేవస్థానం వారు నిర్వహిస్తున్న శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాలలో సాహిత్యాచార్యులుగా పనిచేస్తున్నారు.

శ్రీ కాళహస్తి - శుకబ్రహ్మాశ్రమం నుండి వెలువడే వేదాంతభేరి మాసపత్రికకు గౌరవ సంపాదకులుగా, తిరుపతి నుండి వెలువడే సద్గురువాణి - త్రైమాసిక పత్రిక సంపాదవర్గంలో ఒకరుగా వీరు కొనసాగుతున్నారు. శ్రీ మలయాళ సద్గురు సేవాసమాజానికి 1970 నుండి నేటివరకూ కార్యదర్శిగా వుంటూ సమాజసేవా కార్యక్రమాలలో ప్రాముఖ్యం వహిస్తున్నారు.

శ్రీ కాళహస్తి క్షేత్రానికి పడమటిదిశలో సమీపంలోనే వున్న కాట్రకాయలగుంట గ్రామంలో వీరు జన్మించారు. ఏర్పేడు ఆశ్రమంగా ప్రసిద్ధమైన వ్యాసాశ్రమంలో బాల్యంలో సంస్కృతభాష అభ్యసించారు. తరువాత తిరుపతి ప్రాచ్యకళాశాలలో ఉన్నత విద్యాభ్యాసం చేసి 1958 లో సాహిత్య శిరోమణి పరీక్షలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. తరువాత సంస్కృతం M.A. తరగతిలో కూడా సర్వప్రథములుగా ఉత్తీర్ణత పొందారు. నెల్లూరు జిల్లా పరిషత్తులో కొంతకాలం సంస్కృతాధ్యాపకులుగా పనిచేశారు. 1966 నుండి నేటివరకూ ప్రాచ్యకళాశాలలో సంస్కృత సాహిత్యోపన్యాసకులుగా పనిచేస్తున్నారు.

ఆంధ్రదేశంలో శ్రీ వ్యాసాశ్రమం ఒక సుప్రసిద్ధమైన ఆధ్యాత్మిక

కేంద్రం. శ్రీ సద్గురు మలయాళస్వాముల వారు 1926 లో వ్యాసాశ్రమాన్ని స్థాపించారు. అక్కడ సంస్కృత బోధనకై ఒక గురుకులంలో సంస్కృత విద్యాభ్యాసం చేసే సదవకాశం కల్పించారు. శ్రీ లక్ష్మణయ్యగారు ఈ గురుకులంలోనే విద్యనభ్యసించడం జరిగింది. ఈ గురుకులవాసం వారిపై చెరగని ముద్రవేసింది. విశేషించి తపోనిష్ఠాగరిష్ఠులు, శుష్కవేదాంత తమోభాస్కరులు అయిన మహర్షి - సద్గురు శ్రీ మలయాళస్వాముల వారి అసాధారణ వ్యక్తిత్వం వీరిని ఎంతగానో ప్రభావితులను చేసింది.

సాహిత్యపరంగానూ, ఆధ్యాత్మికంగానూ శ్రీ లక్ష్మణయ్యగారు కావిస్తున్న కృషి గణనీయమైనది. విద్యాభ్యాసకాలంలోనే వీరు రచించిన గేయాలు 'ఆంధ్రసచిత్ర వార పత్రిక' వంటి కొన్ని ప్రముఖ పత్రికలలో ప్రచురించ బడ్డాయి. ప్రాచ్యకళాశాలలో వీరు విద్యాభ్యాసం చేస్తున్న రోజుల్లో సంస్కృత భాషా ప్రచారిణీ సభవారు సంస్కృతంలో రాష్ట్రవ్యాప్తంగా వ్యాసరచన - పోటీ ఏర్పాటుచేశారు. ఆ పోటీలో సర్వ ప్రథములుగా నెగ్గిన లక్ష్మణయ్యగారికి హైదరాబాదులో జరిగిన పండిత సభలో సువర్ణపతకం బహూకరింపబడింది.

నెల్లూరు జిల్లాలో ఉపాధ్యాయులుగా పనిచేస్తున్నప్పుడు వీరు 'అమరవాణి' అన్న ఒక ఖండకావ్యం రచించారు. అందులో సంస్కృత సాహిత్యవైభవాన్ని ప్రశంసించారు. వీరి మొదటి కృతి అయిన ఈ కావ్యం 1960 లో ప్రచురింపబడింది. ఇది పలువురు పండితుల ప్రశంస నందుకొన్నది.

శ్రీ మలయాళస్వాముల వారిని స్తుతిస్తూ రచించబడిన 'శ్రీ మలయాళ సద్గురు శతకం' వీరి రెండవ రచన. ఇందులో శ్రీ స్వాములవారు బహుముఖంగా కొనసాగిస్తున్న లోకసేవ కీర్తింపబడింది. శ్రీ స్వాముల వారు జీవించి వుండగానే 1962 లో ఈ శతకం ముద్రింపబడింది.

నేటి శ్రీ వ్యాసాశ్రమ వ్యాస పీఠాధిపతులు శ్రీ విద్యానందస్వాములవారి ప్రియశిష్యులు లక్ష్మణయ్య గారు శ్రీ మలయాళస్వాముల వారి జీవితచరిత్రను విపులమైన గద్యకృతిగా రచించారు. ఈ గ్రంథం 1976 లో ప్రచురితమయింది. ఆంధ్రదేశంలో అనన్యసామాన్యమైన ప్రచారం

పొందిన గ్రంథమిది. ఇప్పటికి మూడుసార్లు ముద్రింపబడి, ఇంచుమించు పదివేల ప్రతులు ప్రచారమైన ఈ గ్రంథానికి హిందీ, ఇంగ్లీషు, మలయాళ భాషలలో అనువాదాల గూడా వెలువడ్డాయి.

తిరుమల - తిరుపతి దేవస్థానం వారి కోరికపై లక్ష్మణయ్యగారు రచించిన మరొక గ్రంథం "అన్న మాచార్య సంకీర్తనామృతము". రెండు సంపుటాలుగా 1980 లో ప్రచురితమైన ఈ గ్రంథంలో నూటయేబది అన్నమయ్య - ఆధ్యాత్మక సంకీర్తనలకు విపులమైన వ్యాఖ్య వ్రాయబడింది. అన్నమాచార్యుల వాఙ్మయంపై పరిశోధనలు గావించే వారికి ఈ రెండు సంపుటాలు ఎంతో ఉపకరిస్తున్నాయి. శ్రీ గౌరిపెద్ద రామసుబ్బ శర్మగారి వంటి మహా విద్వాంసులు ఈ కృతిని చాలా ప్రశంసించారు.

శ్రీ లక్ష్మణయ్యగారి రచనలలో చెప్పుకోదగిన మరొకగ్రంథం 'యోగ వాసిష్ఠం'. ఇది సంస్కృతంలో ముప్పది రెండువేల శ్లోకాలతో కూడిన మహాగ్రంథం. దీనిని శ్రీ వ్యాసాశ్రమం వారు నాలుగు బృహత్సంపుటాలుగా తెలుగు తాత్పర్యంతో ముద్రించారు. శ్రీలక్ష్మణయ్యగారు ఈ గ్రంథాన్ని సరళ వ్యావహారిక భాషలో అనువదిస్తున్నారు. ఈ అనువాదం 'యదార్థభారతి' మాసపత్రికలో అనేక సంవత్సరాల నుండి క్రమంగా ప్రచురింపబడుతున్నది. మొదటి రెండు ప్రకరణాలు విడిగా గ్రంథరూపంలో కూడా వెలువడ్డాయి.

శ్రీ కాళిదాస మహాకవి రచించిన రఘువంశ మహాకావ్యాన్ని కూడా వీరు వ్యావహారిక శైలిలో అనువదించారు. ఈ అనువాదం పూర్తిగా 'సద్గురువాణి' పత్రికలో వెలువడింది. ఇక గ్రంథరూపంలో వెలువడవలసి వున్నది.

తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఆంధ్ర మహాభాగవతానికి ప్రసిద్ధ పండితులచేత భావానువాదం వ్రాయించి ప్రచురించారు. కరుణశ్రీగారి సంపాదకత్వం క్రింద వెలువడిన ఈగ్రంథములో ద్వితీయ స్కంధానికి శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారే అనువాద రచన చేశారు.

వీరు రచించిన శ్రీ విద్యాప్రకాశానందస్వామి జీవిత చరిత్ర, శ్రీ కారుణ్యానందస్వామి జీవిత చరిత్ర 1992 లో ప్రచురింపబడ్డాయి. వీర క్షేత్రమాహాత్మ్యానికి వీరు వ్రాసిన వ్యాఖ్యానం 1993 లో వెలువడింది.

బాల సాహిత్యానికి చెందిన వీరి రచనలు - 'సావిత్రి', 'మదాలస' అన్న రెండు చిన్నపొత్తాలను టి.టి.డి. వారు ప్రచురించారు.

మహర్షి శ్రీ మలయాళ స్వాములవారి దివ్యసన్నిధిలో విద్యాభ్యాసం చేయడంవల్ల వీరికి సహజంగానే ఆధ్యాత్మిక సంస్కారం అలవడింది. దానికి తోడుగా సభలలో వక్తృత్వకౌశలం కూడా అబ్బింది. ఇది గమనించిన తిరుమల తిరుపతి దేవస్థానం వారు 1981 లో నాటి హిందూ ధర్మరక్షణ సంస్థలోని పురాణ ప్రబోధ పరీక్షా విభాగానికి వీరిని ప్రత్యేక అధికారిగా నియమించారు. తరువాత 1982 లో హిందూధర్మరక్షణ సంస్థకు (నేటి ధర్మప్రచార పరిషత్తు) కార్యదర్శిగా నియమించడం జరిగింది. ఈ రెండు పదవులలోనూ వారు 1988 వరకూ కొనసాగారు. ఈకాలంలో ధర్మ ప్రచార కార్యక్రమాలు చాలా చురుకుగా కొనసాగాయి.

ఆంధ్రదేశంలోని పలుప్రాంతాలలోనే కాక, బొంబాయి, కలకత్తా, భువనేశ్వర్, జంషెడ్పూర్ మొదలైన ఇతర ప్రాంతాలలో కూడా వీరు క్షణ సంస్థ కార్యదర్శి హోదాలో వెళ్లి ధార్మికోపన్యాసాలు కావించారు.

శ్రీ మలయాళస్వాములవారు స్థాపించిన సనాతన వేదాంతజ్ఞాన సభలు ప్రతిసంవత్సరం ఫాల్గుణమాసంలో దక్షిణ భారత దేశంలోని వివిధ ప్రాంతాలలో నిర్వహింపబడుతూ వుంటాయి. ఈ సభలకు వేలకొలది ప్రజలు హాజరవుతూ వుంటారు. గత పదిసంవత్సరాల నుండీ ఈ సభలకు కార్యదర్శిగా వీరే పనిచేస్తున్నారు. వ్యాసాశ్రమం తరపున జరిగే చాతుర్మాస్యాది కార్యక్రమాలు, ఇతర వేదాంతసభలలో కూడా లక్ష్మణయ్యగారు కావించే ప్రసంగాలు బహుళ ప్రజానీకాన్ని ఆకర్షిస్తూ వుంటాయి.

వేదాంతసభలే కాక ప్రసిద్ధసాహిత్య సభలలోకూడా తరచు వీరి ఉపన్యాసాలు జరుగుతుంటాయి. శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి వంటి మహామహులు వీరిని అనేక సాహితీ సభావేదికలపై సన్మానించివున్నారు.

కడప - ఆకాశవాణి కేంద్రం ద్వారా వీరు సంస్కృతపాఠమాలను ప్రసారం చేసి వున్నారు. ఆ పాఠాలు ప్రజలలో సంస్కృత పఠనాసక్తిని రేకెత్తించాయి.

హైదరాబాద్ రామకృష్ణమఠం అధ్యక్షులు శ్రీ రంగనాథానందస్వామీజీ దివ్య జీవన సంఘాధ్యక్షులు శ్రీ చిదానందస్వామీజీ మొదలైన మహామహులు చేసిన ఆంగ్ల ప్రసంగాలను మహాసభలలో ఎప్పటికప్పుడు వీరు తెలుగులో అనువదించి చెప్పిన సందర్భాలు చాలావున్నాయి. వీరి అనువాద కౌశలాన్ని ఉగ్గడిస్తూ ప్రసిద్ధాంగ్ల దినపత్రిక 'ది హిందూ'లో శ్రీ కె. సుబ్రహ్మణ్యంగారు ఒకసారి ఇలా వ్రాశారు.

BETWEEN YOU AND ME

"x x x x There are such people in our midst, but they are not well-known to the public. The other day, a gentleman made a speech in English and it was translated into superb Telugu by Samudrala Lakshmanaiah, Secretary, Hindu Dharma Rakshna Samstha, TTD, Tirupati. I have not listened to such fine translation.

We have very talented people. The trouble with us is that we give honours only to those who have been overburdened with them x x x."

(--The Hindu, March, 23, 1992)

తిరుపతిలో 1992 లో ఏర్పాటైన శ్రీ బాలాజీ సత్సంగంలో ధ్యానవేదికవద్ద శ్రీ లక్ష్మణయ్యగారు చేస్తున్న ఆధ్యాత్మిక ప్రసంగాలు జిజ్ఞాసువులలో ఆధ్యాత్మిక చైతన్యం కల్గిస్తున్నాయి.

14-5-92 వ తేదీనాటి కృష్ణాపత్రిక సముద్రాల లక్ష్మణయ్యగారిని గురించి ఒక ప్రత్యేక వ్యాసం ప్రచురించింది. అందులో - "x x x x రాష్ట్రంలో అనేకప్రాంతాలలో వేదాంతసభలలో అనేకసార్లు ఉపన్యాసాలు ఇచ్చారు. ఆయన ప్రసంగాలు వినడానికి వేలసంఖ్యలో ప్రజలు వస్తుంటారు. అందరికీ అర్థమయిన తీరులో ఆధ్యాత్మిక ప్రసంగాలు చేస్తున్నారు. ప్రజల దృష్టిని ఆయన ఆకర్షిస్తున్నారు. ఎన్నో గ్రంథాలకు పీఠికలు వ్రాశారు."

(--కృష్ణాపత్రిక - 14-5-1992)

ఈ రీతిగా సాహితీ పరంగానూ, ఆధ్యాత్మికంగానూ విశిష్టకృషిగా వించిన లక్ష్మణయ్యగారు తిరుపతిలో ప్రముఖ వ్యక్తులలో ఒకరుగా రాణిస్తున్నారు.

శ్రీ మలయాళస్వాములవారు బోధించిన లోకోత్తరమైన సనాత నధర్మం-- "ఇతరుల ఆత్మోన్నతికి అడ్డుపడకుడు. మీ ఆత్మోన్నతికి అడ్డుకల్గిన తొలగించుకొనుడు. సాధ్యమైనచో ఇతరుల ఆత్మోన్నతికి సాయం చేయుడు" -- అన్న భావాన్ని ప్రచారం చేయడమే తమ జీవితలక్ష్యంగా లక్ష్మణయ్యగారు భావిస్తున్నారు. అందుకొరకే కృషిచే స్తున్నారు.

వారికి, వారి కుటుంబ సభ్యులకూ దైవము ఆయురారోగ్యాలు ప్రసాదించి, మరిన్ని సేవల నందించే భాగ్యం కలుగ జెయ్యాలని ప్రార్థి ద్దాము.

* * *

"తన మీది విశ్వాసం వున్న వ్యక్తి బలవంతుడు. సందేహాలతో సత మతమయ్యే వ్యక్తి బలహీనుడు. బలమైన విశ్వాసాలు గొప్ప పనులు చేయిస్తాయి. తన అభిప్రాయంపై గట్టి నమ్మకం వున్న వ్యక్తి అస్థిరచిత్తుల కంటె అధికుడు. జీవితంపట్ల వుండే స్పష్టమైన, లోతైన అభిప్రాయాలు ప్రపంచాన్నే పరిపాలిస్తాయి."

-జేమ్స్ ఫ్రీమాన్ క్లార్క్

ఈ రీతిగా సాహితీ పరంగానూ, ఆధ్యాత్మికంగానూ విశిష్టకృషిగా వించిన లక్ష్మణయ్యగారు తిరుపతిలో ప్రముఖ వ్యక్తులలో ఒకరుగా రాణిస్తున్నారు.

శ్రీ మలయాళస్వాములవారు బోధించిన లోకోత్తరమైన సనాత నధర్మం-- "ఇతరుల ఆత్మోన్నతికి అడ్డుపడకుడు. మీ ఆత్మోన్నతికి అడ్డుకల్గిన తొలగించుకొనుడు. సాధ్యమైనచో ఇతరుల ఆత్మోన్నతికి సాయం చేయుడు" -- అన్న భావాన్ని ప్రచారం చేయడమే తమ జీవితలక్ష్యంగా లక్ష్మణయ్యగారు భావిస్తున్నారు. అందుకొరకే కృషిచే స్తున్నారు.

వారికి, వారి కుటుంబ సభ్యులకూ దైవము ఆయురారోగ్యాలు ప్రసాదించి, మరిన్ని సేవల నందించే భాగ్యం కలుగ జెయ్యాలని ప్రార్థి ద్దాము.

* * *

"తన మీద విశ్వాసం వున్న వ్యక్తి బలవంతుడు. సందేహాలతో సత మతమయ్యే వ్యక్తి బలహీనుడు. బలమైన విశ్వాసాలు గొప్ప పనులు చేయిస్తాయి. తన అభిప్రాయంపై గట్టి నమ్మకం వున్న వ్యక్తి అస్థిరచిత్తుల కంటె అధికుడు. జీవితంపట్ల వుండే స్పష్టమైన, లోతైన అభిప్రాయాలు ప్రపంచాన్నే పరిపాలిస్తాయి."

-జేమ్స్ ఫ్రీమాన్ క్లార్క్

వీరి అదుపులోనికి మరిన్ని యితర శాఖలను చేర్చి : సేవా దక్షతను నిరూపించుకున్నారు. వీరి పరిధిలో ప్రతిష్ఠాకరమైన T.T.D. ముద్రణాలయము, శ్రీ వెంకటేశ్వర కేంద్ర గ్రంథాలయము; పౌరసం బంధాల శాఖ; రేడియోప్రసారణ శాఖ; ఫోటోగ్రఫీ విభాగము; భాగవతం ; అళ్వార్ దివ్య ప్రబంధ ప్రాజెక్టు వంటివి చేర్చారు.

వీరి అనన్యమైన, అవిశేష కృషి వల్లనే అనేకానేక హిందూ ధర్మ సంబంధిత గ్రంథాలు ప్రచురించబడ్డాయి.

T.T.D ప్రెస్ లో అధునాతన ముద్రణా యంత్రాలను కొనుగోలు చేయించి, బిగించడంలో వీరి పాత్ర ప్రముఖమైనది. ఇందువల్ల T.T.D ప్రచురణల కొనుగోలు, వ్యాప్తి, గణనీయంగా పెరిగినవి.

హిందూ ధర్మ వ్యాప్తికై, మన ఉద్గ్రంథాలైన వేదాలను వాటిలోని తరగని భారత భావన, వేదాంతము, వ్యాప్తికి తేచ్చే రికార్డింగ్ పరిక్రమను చేపట్టారు. అనేక చోట్ల తిరిగి, వేదాలలోని వివిధ శాఖలను భావితరాల వారికుపయుక్తంగా దాదాపు 3000 గంటలకు సరిపడిన రికార్డింగ్ యిది వరకూ చేశారు. ఇంకా ఈ ప్రయత్నం కొనసాగుతూనే వుంది.

తి.తి.దే. వారి ధర్మప్రచార గ్రంథాల విస్మృత వ్యాప్తికి, శ్రీ మూర్తిగారు, పుష్కరాల వంటి సమయాలలోనూ, యితర వుత్సవ సమయాలలోనూ, ప్రదర్శనలు వివిధ పట్టణాలలో ఏర్పాటు చేసి, పుస్తక విక్రయాలను ద్విగుణీకృతం చేశారు.

శ్రీ మూర్తి గారు తి.తి.దే. తరపున, మహా పుణ్యక్షేత్రం తిరుమల కొండ, శ్రీ వెంకటేశ్వర స్వామి పవిత్రత తెలియజేస్తూ ఒక టెలి డాక్యు మెంటరి, తీయించి, దేశం నలుమూలలా అశేష భక్తజనం వీక్షించే విధంగా, దూరదర్శన్ జాతీయ కార్యక్రమాలలో సైతం చూపించే ఏర్పాటు చేశారు.

1984లో జరిగిన తి.తి.దే. వారి స్వర్ణోత్సవాలలోనూ, గోదావరీ పుష్కరాల సమయం, 1979, 1991 లోనూ, కృష్ణా పుష్కరాలు 1980లోనూ ధర్మప్రచారానికి విస్తృత ప్రయత్నాలు చేసి కృత కృత్యు లయ్యారు.

1992 లో జాతీయ పది సదస్సు జయప్రదంగా నిర్వహించి, తన శక్తి సామర్థ్యాలను నిరూపించుకున్నారు. అనేక సార్లు వీరిని తి.తి.దే అధికారులు ధర్మ ప్రచార పరిషత్ కు అధికారిగా నియమించారు కూడా.

శ్రీరావుల వారు రచయితగా, కవిగా పేరుగాంచిన దిట్ట. 25 పుస్తక రచనలనిది వఱకే చేశారు. వీరు రచించిన "శకుంతలం" అన్న పద్య కావ్యము అనేక విశ్వ విద్యాలయాలలో పఠనా గ్రంథంగా ప్రవేశ పెట్టారు. ఎన్నో భగవద్గీత ముద్రణలు, ఆ వుద్గ్రంథం పై వ్యాఖ్యలు వెలువడి వున్నా, శ్రీరావుల వారు రచించిన భగవద్గీత వ్యాఖ్యానము, అతి విశిష్టమైనదిగా గుర్తింపబడి, కొన్ని లక్షల కాపీలు అమ్ముడు పోయింది.

తెలుగు సాహిత్యానికి,"రావుల రామాయణం" అన్న వీరి గ్రంథము మరొక ముఖ్య కానుక. ఆటవెలది పద్యాలలో వీరు రచించిన వాల్మీకి రామాయణం, సరళ శైలిలో అందరికీ అర్థమయ్యే సరసమైన భాషలో రచింప బడినది. వీరి రచనా శైలి క్లిష్టమైనది కాక సామాన్యునికి అర్థమయ్యే రచనగా సుప్రసిద్ధి గాంచినది.

డా॥ రావుల వారు మహాత్మాగాంధీ రచనలను సైతం పెక్కింటిని తెనిగించియున్నారు."పత్రికా రచనకు పరిచయము" అన్న వీరి గ్రంథము క్లిష్టమైన నిగూఢము అయిన విషయాల్ని కూడా సులభంగా అర్థమయ్యే శైలిలో రచించిన సాహసోపేత ప్రయత్నంగా పేరుగాంచింది. ఇది, పత్రికా రచనా విద్యార్థులకు, సాంఘిక సమాచార శాఖ వారికెంతో వుపయుక్తమైన గ్రంథము.

డా॥ రావుల వారు "పౌర పరిపాలన" "Public Administration" లో తమ M.A. పట్టం పుచ్చుకున్నారు. అమెరికా, టెక్సాస్ విశ్వ విద్యాలయంలో, "Rural Resurgence in independent India", "స్వతంత్ర భారత దేశంలో గ్రామీణ పునరుజ్జీవనం" అన్న అంశం పై సిద్ధాంత వ్యాసం వ్రాసి, తమ D.Litt పట్టం పొందారు.

డా॥ సూర్యనారాయణ గారు బహుళోత్పాదక ప్రేరణాత్మక గ్రంథ కర్తే కాక విశిష్టమైన, విజ్ఞానము, సమయస్ఫూర్తి, హాస్యము మిళితమైన, ఉపన్యాసకులు కూడా.

అంకిత భావంతో పనిచేస్తున్న శ్రీ రావుల వారికి శ్రీ వెంకటేశ్వర స్వామి పై అమిత భక్తి.

ఆ స్వామి ఆశీస్సులతో మరిన్ని సాహిత్య, సంఘసేవలు శ్రీ రావుల వారు చెయ్యాలని, వారికీ, వారి కుటుంబ సభ్యులకు ఆయురారోగ్య సంపదలు ప్రసాదించాలని కోరుకుందాము.

* * *

"వృద్ధాప్యంలో అత్యాశ ఉండడం అవివేకం. జీవితపు బాటపై మనం చేసే ప్రయాణం పూర్తి కావచ్చింది. వస్తువులను, కోరికలను ఇక మనమేం చేసుంటాం."

-సిసిరో

"తన వాదనను అధికారంతోను, పెద్ద గొంతుతోను బలపరచుకోవాలనుకునే వ్యక్తి తన బలహీనతను కప్పిపుచ్చుకోవడానికే అలా చేస్తాడు."

-మాంట్ గిన్



# శ్రీ ముక్కాల బలరామిరెడ్డి

6-4-1926 న, వ్యవసాయ కుటుంబంలో శ్రీ ముక్కాల బలరామిరెడ్డిగారు తిరుపతిలో జన్మించారు. ఆకుతోట వీధిలోని ఎలిమెంటరీ స్కూల్లోను, శ్రీ వెంకటేశ్వర హైస్కూల్లోను తమ విద్యాభ్యాసం చేశారు. 1943-'45 లో మదనపల్లి దివ్యజ్ఞాన కళాశాలలో ఇంటర్ చదవి; 1947-49 లో ఎకనామిక్స్, పొలిటిక్స్, హిస్టరీ ప్రధానాంశాలుగా తమ బి.ఎ. పట్టం తిరుపతి శ్రీ వేంకటేశ్వర ఆర్ట్స్ కాలేజీలో చదవి, పుచ్చుకున్నారు.

క్రమ శిక్షణతోనూ, అకుంఠిత దీక్షతోనూ చదువులనభ్యసించిన వీరు, ఏ ఉద్యోగములోనూ చేరలేదు. స్వాతంత్ర్య సమరంలో, విద్యార్థి నాయకుడుగా దేశ సేవ చేశారు. గాంధీజీగారి బోధనలకు లోబడి 1962 నుండీ నేటివరకూ ఖద్దరు బట్టలనే ధరిస్తున్నారు. క్రీడలు, లలితకళలు, సాహిత్య పరమైన కార్యక్రమంలో చురుకుగా పాల్గొన్న వీరు త్యాగరాజ ఫెస్టివల్ కమిటీ ఉపాధ్యక్షులుగా 15 ఏండ్లనుండి సేవలనందిస్తున్నారు. ఇటీవలే, 1992 లో, త్యాగరాజ ట్రస్టు తమ ఏభై ఏండ్ల, స్వర్ణోత్సవాలను తిరుపతి తిరుమల వారి సహకారంతో ఘనంగా జరుపుకొంది. ఇందులో శ్రీ బలరామిరెడ్డిగారి పాత్ర గణనీయంగా వున్నది. 1993 లో ఒక వారంరోజులు అనేక ప్రఖ్యాత కళాకారులను, దేశం నలుమూలల నుండీ ఆహ్వానించి, త్యాగరాజ ట్రస్టువారు ఉత్సవాలు జరిపి తిరుపతి పురప్రజల మన్ననలను, ప్రశంసలను పొందారు.

వీరి నిస్వార్థ సేవలకు గుర్తింపుగా, వీరు అనేక విషయములలో ఆర్జించిన అశేష విజ్ఞానాన్ని వినియోగించుకుంటూ 1955 నుండీ, ఏకధాటిగా 1977 వరకు, రెండు దశాబ్దాల, రెండేండ్లు తిరుపతి వేంకటేశ్వర విశ్వవిద్యాలయ సెనేట్ మెంబరుగా వీరు ఎన్నుకోబడ్డారు.

విశ్వవిద్యాలయ సర్వతోముఖాభివృద్ధికి వీరు ఎంతగానో తోడ్పడ్డారు. వీరి అనన్య సేవలకు గుర్తింపుగా తిరిగి 1983-85 వరకూ సెనెట్ మెంబరుగా శ్రీ బలరామిరెడ్డి గారిని నియమించారు.

వీరు ఫుట్ బాల్, హాకీ ఆటలలో ప్రవీణులు. తిరుపతి ఫుట్ బాల్ అసోసియేషన్ ప్రెసిడెంట్‌గాను, హాకీ అసోసియేషన్ సెక్రటరీగాను పదవులు నిర్వహించి, ఈ ఆటలను విస్తృతపరచడానికి కృషి చేశారు.

రాజకీయంగా, శ్రీ కె. హనుమంతయ్య, శ్రీ సంతానం, శ్రీ అనంతశయనం అయ్యంగార్, శ్రీ బి.యల్. దత్త, శ్రీ బి. గోపాల్ రెడ్డి వంటి ప్రముఖ రాజకీయ దురంధరులను ఆహ్వానించి, "తిరుపతి ఫోరమ్" అన్న సంస్థ ద్వారా ఉపన్యాసాలు ఇప్పించారు. ఆనాటి రాజకీయ చైతన్యానికి అనుగుణంగా ఈ విలువైన ఉపన్యాసాలు ఎంతగానో ప్రజలను ఉత్తేజపరచాయి.

తిరుపతి డ్రామా అసోషియేషన్ సాంస్కృతిక కార్యక్రమంలో ప్రచ్ఛన్నంగా పాల్గొని, తిరుపతి పట్టణ ప్రాముఖ్యాన్ని చాటారు. పెక్కేండ్లు 1960 లో, సిండికేట్ మెంబరుగా శ్రీ రెడ్డిగారు నియమింపబడి, విశ్వవిద్యాలయానికి వారి మరువలేని సేవలను అందించారు.

కొన్ని వేల పుస్తకాలు, మత, రాజకీయ, విద్యా, సైన్సు సబ్జక్టులలో చదివి, తగిన నోట్సులు తయారు చేసుకున్నారు. తమ అపార పాండిత్యానికి సూచనగా ఎన్నో సూక్తులు, ఈ గ్రంథాల నుండీ వల్లిస్తూ, సభ్యులను సంభ్రమాశ్చర్యాల్లో ముంచెత్తుతూ ఉంటారు. శ్రీ రెడ్డిగారు ఆంగ్లంలో అనర్గళంగా ఉపన్యసిస్తారు. వీరి వ్యక్తిగత లైబ్రరీలో కొన్ని వేల గ్రంథాలున్నాయి.

వీరికి శ్రీ కె.వి. క్రిష్ణస్వామి, శ్రీ మునిరెడ్డి, కీ.శే. శ్రీ వరదాచారి (హిందూ కరస్పాండెంట్) చాలా సన్నిహితులు.

శ్రీ బలరామిరెడ్డి మునిసిపల్ ఎలెక్షన్, టౌన్ బ్యాంక్ వంటి, రాజకీయ ఎలెక్షన్‌లలో పాల్గొనకుండా 74తమ పరిధిని వున్నతమైన విజ్ఞాన, సాంస్కృతిక నాటక, క్రీడలకే పరిమితం చెయ్యడం, వీరి సమున్నత సంస్కృతికి తార్కాణము.

బాలాజీ సత్సంగం సంస్థాపక అధ్యక్షులుగా ఆ సభలలో వారం, వారం పాల్గొని తమ, విజ్ఞానాన్ని, ఆధ్యాత్మిక, ధార్మిక చింతనని నలుగురికి పంచడంలో వీరిప్పుడు కృషి సల్పుతున్నారు. ఆజన్మ బ్రహ్మచారి, అజాత శత్రువు అయిన శ్రీ బలరామరెడ్డి ఆశ్రయించిన వారికి తోచిన సహాయం చేస్తూ, నిజమైన నిస్వార్థ పరునిగా, సంఘానికి సేవల నందిస్తున్నారు. వీరికి దైవము ఆయురారోగ్యాలు ప్రసాదించి మరిన్ని ఏండ్లు సంఘసేవ చేయుటకు అవకాశం కల్పించాలని దైవాన్ని ప్రార్థిద్దాము.

* * *

"ఉన్నతమైన వ్యక్తి తనకంటె గొప్పవారితో పోల్చుకుని తనను అంచనా వేసుకుంటాడు. సంకుచిత స్వభావం కల మనిషి తనకంటె తక్కువ వారితో పోల్చుకుంటాడు."

-హెచ్.డబ్ల్యు. బీచర్

"పుస్తకాలు మాత్రమే చదవకు. మనుషులను కూడా చదువు. ముఖ్యంగా నిన్ను నీవు చదువుకో".

-క్లారెన్స్



# శ్రీ మాడభూషి కృష్ణస్వామి

ప్రఖ్యాత న్యాయవాది శ్రీ మాడభూషి వెంకట కృష్ణమాచారి గారి సుపుత్రుడైన శ్రీ కృష్ణస్వామి 3-8-1926 న జన్మించారు. వీరి ప్రాథమిక విద్య, తమ స్వగ్రామమైన తిరుపతిలో గడిచింది. ఇంటర్ మీడియేట్ నెల్లూరులోనూ, బి.ఎ. డిగ్రీ శ్రీ వెంకటేశ్వరా ఆర్ట్స్ కాలేజీ తిరుపతిలోనూ చదివారు. ఇంగ్లీషు భాషలో, హైస్కూలు కాలేజీ చదువుల కాలం నుండీ, వీరు మంచి పటిష్టత, జ్ఞానమూ సంపాదించారు.

సభలలో చర్చలలో పాల్గొని తమ భావ ప్రకటన, స్పష్టంగా సరళంగా చెప్పేవారు. హాకీ చక్కగా ఆడేవారు. స్వతహాగా శ్రావ్యంగా పాడగలిగే శ్రీ కృష్ణస్వామి, చిరుప్రాయం నుండీ సంగీతంలో శాస్త్ర విజ్ఞానము సంపాదించారు. సంగీత కచేరీలలో పాల్గొని, సంగీతం గురించి, పాడిన వారి గూర్చి సద్విమర్శలు చేసేవారు.

బి.ఎల్. పట్టం మద్రాసు విశ్వవిద్యాలయంలో పుచ్చుకొన్నా న్యాయవాదిగా స్థిరపడడంపై మనసుపోక ఉద్యోగాన్వేషణ చేయసాగారు.

రాజ్యసభ సెక్రటరియేట్‌లో Law (న్యాయశాస్త్ర) అసిస్టెంటుగా తన జీవితాన్ని ప్రారంభించి, 4, 5 ఏండ్లు ఆ పనిలో కొనసాగారు. ఆ పనికి స్వస్తి చెప్పి, అసిస్టెంట్ లీగల్ డైరెక్టరుగా, ఇండస్ట్రీస్ డిపార్ట్‌మెంటు కలకత్తాలో వుద్యోగాన్ని సంపాదించారు.

తన కుటుంబ పరిస్థితుల వల్ల ఆ ఉద్యోగం వదిలి, మద్రాసు నగరంలో ఇండియన్ ఎక్స్‌ప్రెస్ ఆంగ్ల దిన పత్రికలో, అసిస్టెంట్ జనరల్ మేనేజరుగా స్థిరపడి సుమారు 12 సంవత్సరములు పనిచేశారు.

తదుపరి డెప్యూటీ జనరల్ మేనేజర్, సర్వీసెస్‌గా, ప్రఖ్యాత పారిశ్రామిక గృహం టి.వి.ఎస్.లో ఏడేండ్లపాటు సేవలనందించారు. కార్మిక

సమస్యలలో అవగాహన పెంపొందించుకున్న శ్రీ కృష్ణస్వామి, కార్మిక సమస్యలను తీర్చాలనే పట్టుదల, ఆదర్శంతోనూ, యాజమాన్యానికి, కార్మికులకు రాజీమార్గం చూపే, ఆఫీసరుగా ఖ్యాతి సముపార్జించారు. పదవీవిరమణ చేసినప్పటికీ, ఈనాడు కూడా, అనేక పారిశ్రామిక, యాజమాన్యాలు వీరిసేవలను కార్మిక సమస్యలను తీర్చడానికి కోరుతూనే ఉన్నారు. వీరు 1954 లో వివాహమాడారు. వీరి సతీమణి శ్రీమతి మణి కృష్ణస్వామి (పెరిందేవి) చిన్నప్పటి నుండే సంగీత ప్రియురాలు.

ఆమె ఈనాడు, మద్రాసు నగరంలో ప్రఖ్యాత గాయకురాలుగా పేరు గడించారు. విదేశాలలో సైతం పర్యటించి, గాన కచేరీలు నిర్వహించారు. ఆమె సంగీతంలో స్వచ్ఛమైన, స్పష్టమైన పదోచ్చారణ తెలుగు, తమిళం, సంస్కృతంలో చేయగలరని ప్రసిద్ధిగాంచారు. అనేక విశ్వవిద్యాలయాలలో ఉపన్యాసముల నిచ్చారు.

1993 లో శ్రీమతి మణి కృష్ణస్వామి గారికి తిరుమల తిరుపతి దేవస్థానం ఆధ్వర్యంలో జరిగిన త్యాగరాజ ట్రస్టు కమిటి తిరుపతి వారు, "సప్తగిరి సంగీత విద్వన్మణి" అన్న బిరుదునిచ్చి, భారతదేశ గాన కోకిల, పద్మభూషణ్ శ్రీమతి ఎం.ఎస్. సుబ్బలక్ష్మి చేతులమీదుగా, సత్కరించారు.

మద్రాసు మ్యూజిక్ అకాడమీ వారు కూడా ఈ ఏడు తమ ప్రతిష్టాకరమైన "సంగీత శిరోమణి" బిరుదు ప్రదానంచేసి, ఈమెను గౌరవించారు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారు ఈమె సంగీత ప్రావీణ్యాన్ని గుర్తించి, డాక్టరేట్ పట్టమునిచ్చి 1994 సం11లో జరిగిన స్నాతకోత్సవంలో, శ్రీమతి మణి కృష్ణస్వామిని గౌరవించారు.

వీరి శ్రీమతి సంగీత కళాప్రభవోజ్జ్వలతలో శ్రీ కృష్ణస్వామిగారి సహకారప్రోత్సాహాలు అభినందనీయములు.

వీరికి దైవము ఆయురారోగ్యాలనిచ్చి, మరిన్ని సంవత్సరాలు, తిరుపతి పట్టణానికే కాక, సంగీత సామ్రాజ్యంలో, ఈ ఆదర్శ దంపతులు నిత్యసేవకులుగా, కీర్తి నిలిచిపోవాలని ఆశిద్దాము.



# శ్రీ సి. యస్. రామయ్య

చంద్రగిరి శ్రీనివాసులు చెట్టి కుమారులు శ్రీ సి.యస్. రామయ్య గారు.

లాయరు పట్టభద్రులైన శ్రీరామయ్యగారు, భారతదేశ స్వాతంత్ర్య సమరంలో గణనీయంగా పాల్గొన్నారు. వీరి సేవలను గుర్తిస్తూ కాంగ్రెసుపార్టీ పార్లమెంటు సభ్యులుగా ఎన్నికలలో పోటీ చెయ్యమని టిక్కెట్టు ఇచ్చారు. కానీ, శ్రీ రామయ్యగారు, టిక్కెట్ నిరాకరిస్తూ, శ్రీ అనంతశయనం అయ్యంగార్‌గారి పేరును నిస్వార్థబుద్ధితో సూచించారు. శ్రీరామయ్యగారి స్వాతంత్ర్య సమరంలో చేసిన త్యాగాలకు గుర్తింపుగా, తామ్రపత్ర అవార్డునిచ్చి భారతప్రభుత్వం సత్కరించింది.

కాంగ్రెస్ కార్యకర్తగా దేశ సేవచేస్తున్న శ్రీ రామయ్య 1906 లో కలకత్తా కాంగ్రెసుకు AICC మెంబరుగా హాజరయ్యారు. వీరు తిరుపతి దేవస్థానం హైస్కూలులో చదువుతున్న రోజులలో శ్రీ సర్వేపల్లి రాధాక్రిష్ణన్, శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి, శ్రీ పానగల్లు రాజా, శ్రీ మునుస్వామి నాయుడు, ఆ స్కూలులోనే చదివారు. దేశ చరిత్రలో ఎంతో ప్రఖ్యాతిగాంచిన ఈ ప్రముఖ వ్యక్తులు వీరి సహాధ్యాయులు.

శ్రీ రామయ్య, మద్రాసులో లయోలా కాలేజిలో B.A. ఎకనామిక్స్‌లో పట్టం పుచ్చుకున్నారు. B.L. పట్టం కూడా మద్రాసు విశ్వవిద్యాలయం నుండీ పుచ్చుకున్నారు. ప్రఖ్యాత న్యాయవాది, శ్రీ అల్లాడి పద్మనాభన్ వద్ద అప్రెంటిస్‌గా 6, 7 సంవత్సరాలు పనిచేశారు.

1915లో మునిసిపల్ కౌన్సిలర్‌గా ఎన్నికైన శ్రీ రామయ్యగారు, 1924-25 లో మునిసిపల్ ఛేర్‌మన్‌గా ఎన్నికయ్యారు. తిరిగి 1938-41 వరకు కూడా శ్రీ రామయ్య మునిసిపల్ ఛేర్‌మన్‌గా ఎన్నికై,

ఎన్నికై, సేవలందించారు.

1918 లో కో-ఆపరేటివ్ బ్యాంక్ సంస్థాపించి, దానికి డైరెక్టరుగా ఎన్నికయ్యారు.

తిరుపతి, తిరుమల దేవస్థానం కమిటీ మెంబరుగా కూడా ఎన్నికైన శ్రీ రామయ్య 1938-40 సంవత్సరంలో, తిరుమల పైకి ఏడు లక్షల రూపాయల ఖర్చుతో ఒకటవ ఘాట్ రోడ్డు నిర్మాణానికి కారకులయ్యారు.

2వ తేదీ జూలై, 1948 లో మునిసిపల్ ఛేర్మన్‌గా ఎన్నికై, ఆ పదవికి మూడుసార్లు తిరిగీ ఎన్నికయ్యారు. 1948 నుండీ 1952 వరకూ, 1952 నుండీ 1956 వరకూ మునిసిపల్ ఛేర్మన్‌గా వున్నారు. ఇదేకాక మునిసిపల్ కౌన్సిలర్‌గా 1948 నుండీ, ఏకధాటిగా, 1985 వరకూ, 37 ఏండ్ల సుదీర్ఘకాలం ఎన్నికై, చరిత్ర సృష్టించారు.

విద్యారంగంలో శ్రీ రామయ్యగారు అందించిన సేవలుకూడా గణనీయమైనవి. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ సెనెట్ మెంబరుగా, గ్రాడ్యుయేట్ల కాంస్టిట్యుయెన్సీ నుండీ, మూడుసార్లు 1955 నుండీ 1972 వరకూ ఎన్నికైన ఘనత వీరికి దక్కుతుంది. శ్రీ గోవిందరాజులునాయుడు వైస్- ఛాన్సలర్‌గా వుండిన కాలంలో, యూనివర్సిటీ సర్వతోముఖాభివృద్ధి చెందినకాలంలో శ్రీరామయ్యగారు, ఆ అభివృద్ధికి ఎంతగానో సహకారం అందించారు.

మనరాష్ట్రంలోనే కాక, శ్రీ రామయ్యగారు మద్రాసు విశ్వవిద్యాలయ సెనెట్ మెంబరుగా లోకల్ బాడీస్ కాంస్టిట్యుయెన్సీ నుండీ 1951లో ఎన్నికయ్యారు.

కో-ఆపరేటివ్ టౌన్‌బ్యాంక్ డైరెక్టరుగా 1956 లో శ్రీ రామయ్య ఎన్నికయ్యారు. అప్పటినుండీ రెండు టర్ములు డైరెక్టరుగా సేవలనందించారు. 1981 లో కో-ఆపరేటివ్ బ్యాంక్ ప్రెసిడెంటుగా ఎన్నికై కారణాంతరాల వల్ల, 1983 లో రాజీనామా చేశారు.

1990 లో తిరిగీ కో-ఆపరేటివ్ బ్యాంక్ పర్సన్ ఇన్‌చార్జిగా, పదవి నిర్వహించారు. 1990 జూన్‌లో, ఎలెక్షన్‌లలో ప్రెసిడెంటుగా

ఎన్నికయ్యారు. ప్రెసిడెంటుగా 5 ఏండ్ల కాలపరిమితిని 3 ఏండ్లక తగ్గించారు. ప్రస్తుతం, 1994 లో ఈ వ్యాసం వ్రాసే సమయానికి ఇంకా ఆ పదవిలో కొనసాగుతూనే వున్నారు.

వీరి సోదరుడు డా॥ సి.యస్. భాస్కరన్ B.C. Roy awar గ్రహీత. మెడికల్ ఎడ్యుకేషన్ డైరెక్టరుగా పనిచేశారు. డా॥ భాస్కరన్ గారు ఆంధ్రప్రదేశ్ హెల్త్ యూనివర్సిటీ వైస్-ఛాన్సలర్‌గా ఉన్నారు సతీమణి, శ్రీమతి శ్యామలా భాస్కరన్ కూడా B.C. Roy అవార్డ గ్రహీత.

శ్రీ రామయ్యగారికి ఇద్దరు సంతానము. ఒక కుమారుడు, ఒక కుమార్తె, కుమారుడు సి. ప్రతాప్, అడ్వకేటు. ఈయన కూడా మునిసిపల్ కౌన్సిలర్‌గా 1987 నుండీ 1992 వరకూ ఎన్నికై పనిచేశారు వెంకటేశ్వర యూనివర్సిటీ సెనేట్ మెంబరు. సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ప్లాస్టిక్స్, గిండీ (మద్రాసు) ఎక్సిక్యూటివ్ కౌన్సిల్ మెంబరుగా కూడా పనిచేస్తున్నారు.

ఇటీవలే శ్రీ సి.యస్. రామయ్యగారు దేశానికి, ప్రత్యేకించి తిరుపతి పట్టణాభివృద్ధికి చేసిన గణనీయమైన సేవలకు గుర్తింపుగా, జేసీస్ వారు 1993 లో Senior Citizen Award తో ఘనంగా సత్కరించారు

వీరు ఆయురారోగ్యాలతో, మరిన్ని సంవత్సరాలు తిరుపతి పట్టణాభివృద్ధికి పాటుపడాలని దైవాన్ని ప్రార్థిద్దాము.

* * *

---

*"తమ ఉత్తమ గుణాన్ని గురించి, సాహసాన్ని గురించి, విజ్ఞానాన్ని గురించి, వినయాన్ని గురించి ఎప్పరూ గర్వించరాదు. మనకు తెలియని మనకంటె గొప్పవారు ముందు చాలా మంది వున్నారు."*

-సంస్కృత సూక్తి

---



# డా॥ బ్రహ్మాండం నరసింహం

బ్రహ్మాండం నరసింహం గారు గుంటూరు జిల్లా కొల్లూరు గ్రామానికి చెందిన వారు. వీరు విశాఖపట్నంలో 1920 సెప్టెంబరు 17న ఋషి పంచమినాడు జన్మించారు. తండ్రి జిల్లా పశు వైద్య శాఖాధికారిగా పదవీ విరమణ చేసిన రామయ్యగారు. తల్లి సుందరమ్మ గారు. విజయనగరం జిల్లాలోని పార్వతీ పురంలో హైస్కూలు చదువును ప్రథమ స్థానంలో పూర్తి చేసి, ఇంటర్మీడియేట్ విశాఖపట్నంలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులయి, కోయంబత్తూరు వ్యవసాయ కళాశాలలో రెండు పతకాలతో బి.యస్‌సి.(అగ్రి) డిగ్రీని 1941 లో పొందినారు. 1949 లో ఉద్యాన శాస్త్ర డిప్లొమాను, 1957 లో ఆంధ్రాయూనివర్సిటీ నుండి యం.ఎస్‌సీ డిగ్రీని, 1967 లో ఢిల్లీలోని కేంద్ర వ్యవసాయ సంస్థ నుండి అన్ని సబ్జక్టులలోను A గ్రేడు తెచ్చుకొన్న విద్యార్థిగా బంగారు పతకంతో డాక్టరేటు డిగ్రీని పొందినారు.

అయిదేండ్లు కర్నూలు జిల్లాలో వ్యవసాయ డిమాన్‌స్ట్రేటరుగా పని చేసి, బాపట్ల కళాశాలలో ఉద్యాన శాస్త్ర బోధకునిగా చేరారు. అప్పటి నుండి పదవీ విరమణ చేసే వరకూ అధ్యాపకునిగా ఉండి ప్రొఫెసరుగా రిటైరు అయినారు. ఆ తరువాత గుజరాత్ వ్యవసాయ విశ్వవిద్యాలయంలో విశిష్ట ఆచార్య పీఠముపై మూడేండ్లు ఉండి తిరిగి వచ్చి తిరుపతిలో స్థిర పడినారు. పదవీకాలంలో వీరు 12 యం.యస్‌సీలకు అయిదుగురు పిహెచ్.డీలకు దర్శకులుగా ఉన్నారు. 40 పరిశోధక వ్యాసాలను రాశారు. బి.యస్‌సి. విద్యార్థులకై ఉద్యాన కృషి పై పుస్తకాన్ని రచించారు. పంజాబ్ యూనివర్సిటీ వారు ప్రచురించిన 'మామిడి' అనే పరిశోధక గ్రంథంలో వారి ఆహ్వానంపై కొత్తరకముల సృష్టిని గూర్చిన అధ్యాయమును రచించినారు.

వివిధ వ్యవసాయ విశ్వవిద్యాలయాలను దర్శించి వాటి పనితీరు పై నివేదికలను తయారు చేసిన వారి అనుభవమును పురస్కరించుకొని, ఆంధ్ర ప్రదేశ్ వ్యవసాయ విశ్వ విద్యాలయ 20 ఏండ్ల ప్రగతిని విర్దేశించడానికి వేసిన సమీక్షా కమిటీకి మెంబరు సెక్రటరీగా పని చేసి సమగ్ర నివేదికను సమర్పించారు. బొంబాయిలోని ఆస్పీ అగ్రికల్చరల్ ఫౌండేషన్ సలహాదారుగా ఉంటున్నారు.

చిన్నప్పటి నుంచీ తెలుగులో విజ్ఞాన విషయాలను వ్రాసే కుతూహలం తో వ్యవసాయ పత్రికలలోనే గాక భారతి వంటి మాసపత్రికలలో కూడా అనేక వ్యాసాలను వ్రాశారు. తెలుగులో జన్యుశాస్త్రం, ఉద్యాన శాస్త్రముల పై రచించిన రెండు గ్రంథాలు, ఆ విషయముల పై వ్రాసిన వాటిలో ఉత్తమమైనవి గా తెలుగు భాషా సమితి వారు ప్రకటించిన బహుమానమును రాష్ట్రపతి బాబు రాజేంద్ర ప్రసాద్ గారి చేతి మీదుగా అందుకున్నారు.

నూతన అక్షరాస్యుల కోసం పెరటి కూరగాయల పెంపకం పై వారు రాసిన కథను నాటి కమ్యూనిటీ డెవలప్ మెంటు శాఖలన్నీ కొనవలసినదిగా కేంద్ర విద్యాశాఖ శిఫార్సు చేసింది.

తెలుగు భాషా సమితి, ఉస్మానియా విశ్వవిద్యాలయం చేపట్టిన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వములో జీవశాస్త్ర, వ్యవసాయ శాస్త్రాలకు సంబంధించి వీరు రచించిన లఘువ్యాసములనేకములు చోటు చేసుకొన్నవి. శ్రీ వెంకటేశ్వర విశ్వావిద్యాలయం వారు ఆచార్య జి.యన్.రెడ్డి గారి అధ్యక్షతన ఏర్పాటు చేసిన విజ్ఞాన పద కోశపు సలహా కమిటీలో సభ్యులు గా ఉండినారు.

తెలుగులో విజ్ఞాన రచయితగా ఆల్ ఇండియా రైటర్స్ కాన్ఫరెన్సు మద్రాసు, బొంబాయి సమావేశాలలో ప్రతినిధిగా పాల్గొన్నారు.

చిన్నప్పుడు పది పదిహేను కథలను మాస వార పత్రికలలో ప్రచురించినా ఆ దిశలో వారు ఎక్కువగా శ్రమించలేదు. కాని ఏ సామాన్య విషయాన్నైనా హేతు దృష్టితో, వైజ్ఞానిక దృక్పథంలో చూసే స్వభావం వల్ల అటువంటి వ్యాసాలను మేగజైన్లలోనూ సావనీర్లలోను అనేకం రాశారు.

వ్యవసాయ కళాశాల విద్యార్థులకు సాంస్కృతిక మార్గ దర్శకులుగా 15 సంవత్సరాలు పని చేశారు. స్వయంగా కొన్ని పాత్రలు ధరించి ఆంధ్ర నాటక కళా పరిషత్తు నాటిక పోటీలకు వెళ్లినారు.

సంగీతం వారి యింటి విద్య. వారి అక్క చెల్లెళ్లు ముగ్గురూ ఆలిండియా రేడియోలో వీణ ఆర్టిస్టులు. సభలలో పాడక పోయినా వీరికి కర్ణాటక సంగీతములో తగినంత ప్రవేశం ఉన్నది. ఆ సంగీత ప్రోత్సాహానికై తిరుపతి " సంగీత రసిక సమాఖ్య" ను వ్యవస్థాపించి, కోశాధికారిగా ఉంటూ నడిపిస్తున్నారు.

సుమారు 40 సంవత్సరాలుగా జ్యోతిష శాస్త్ర పరిచయాన్ని పెంచు కొని నైపుణ్యం ఆర్జించారు. జ్యోతిషం కూడా సైన్సే నని వైజ్ఞానికంగా విశ్లేషించి, ప్రముఖ జ్యోతిష మాస పత్రికలో ఒక వ్యాసాన్ని ప్రచురించారు. తిరుపతిలో ఇటీవల స్థాపించిన జ్యోతిష శాస్త్ర సమితిలో వారు ప్రముఖ సభ్యులు.

భాషా స్వభావాలను తెలుసు కోవాలనే కుతూహలంతో, తమిళ, గుజరాత్ భాషలను వ్యాకరణోక్తంగా నేర్చుకొన్నారు. పి.హెచ్.డి చదివేటప్పుడు నియమానుసారంగా ఫ్రెంచి భాషనే గాక స్వచ్ఛందంగా రష్యను భాషను కూడా నేర్చుకొని ప్రథములుగా ఉత్తీర్ణులయినారు. సంస్కృత, ఆంధ్ర, ఆంగ్లములతో పరిచయం బాగా ఉన్నది.

ప్రవాసాంధ్రుల పిల్లలు లిపిని నేర్చుకొనే వ్యవధి లేక భాషకు దూరమవుతున్నారనే వేదనతో, తెలుగు భాషలోని ఆణిముత్యాల వంటి రచనలను వారికి ఇంగ్లీషు లిపిలోనే అందిస్తే బాగుంటుందని - దానికి దోహదంగా, కొత్త అక్షరాలను గాని, గుర్తులను గాని సృష్టించ కుండా, ఏ టైప్‌రైటరు పైన నైనా ముద్రించ గల రీతిలో ఇంగ్లీషు లిపిని తెలుగులోని ఏ స్వరాన్నైనా పలికే విధానమును రూపొందించారు. ఆ లిపిలో వ్యాకరణంతో సహా ఒక పరిచయ పుస్తకాన్ని ముద్రించారు. విదేశాలకు పంపి ఉద్యమం కొనసాగిస్తున్నారు.

సమాజంలోని రీతులను వైజ్ఞానికంగా విశ్లేషించి సులభ శైలిలో "రీతి-నీతి" అనే 232 పద్యాల పుస్తకాన్ని రచించారు.

మానవ స్వభావాన్ని, నడవడినీ ప్రతి బింబిస్తూ ఇంగ్లీషులో "Excursions into the Blunder land" అనే వ్యంగ్య వ్యాస సంపుటిని ప్రచురించారు.

భగవద్గీతలోని బోధనా శ్లోకాలను ఆటవెలది పద్యాలుగా తెనిగించి, ఆధునిక వైజ్ఞానికుల కొరకు ఉపోద్ఘాతము, టిప్పణిలతో "గీతాదర్పణం" అనే గ్రంథాన్ని రచించారు.

భగవద్గీతలోని భావాలను వైజ్ఞానికంగా విశ్లేషించి, ఆధునికులు తెలుసుకొనుటకు అనువుగా, "Guide to Gita" అనే ఇంగ్లీషు గ్రంథాన్ని ప్రచురణకు సిద్ధం చేశారు.

సనాతన శాస్త్ర విహిత కర్మలను, మూల ఆశయాలను విస్మరించకుండ, ఆధునిక పరిస్థితులలో ఏ విధంగా అనుష్ఠించ వచ్చుననే చర్చను చేసే సంకల్పంతో ధర్మ సదస్సు అనే పేర సమావేశాలను కొంత కాలం జరిపించారు.

స్థానిక రోటరీ క్లబ్బుకు ప్రెసిడెంటుగా ఉండినారు. తిరుపతి ఎల్డర్స్ఫోరం సభ్యులుగా ఉంటున్నారు.

వీరి సతీమణి సుబ్బాలక్ష్మిగారు. కుమారుడు తుంగభద్ర ఇండస్ట్రీస్ వైస్ ప్రెసిడెంటుగా ఉంటున్నారు. ఒక అల్లుడు యూనియన్ బ్యాంకు ఆఫీసరు. రెండవ అల్లుడు మద్రాసులోని మల్లాది గ్రూప్ ఇండస్ట్రీస్‌కుకు వైస్ చైర్మనుగా ఉన్నారు. కుమార్తె లిరువురూ M.Sc. లు. మనుమలు మనుమరాళ్లు ఆరుగురు.

వీరికి దైవము ఆయురారోగ్యాలు ప్రసాదించి, వీరు మరిన్ని సాంఘిక, సాహిత్య సేవలు తిరుపతి పట్టణంలో చెయ్యగలరని ఆశిద్దాము.



# శ్రీ పులికంటి క్రిష్ణారెడ్డి

శ్రీ పులికంటి క్రిష్ణా రెడ్డి , 1931 సం॥ 30 జూలైన, తిరుపతి పట్టణంలో జన్మించారు. దేవస్థానం హిందూ హైస్కూలులో సెకండరీ విద్య నభ్యసించి, 1950 లో కృత కృత్యులయ్యారు.

బాల్యం నుండీ వీరికి నటనంటే, అత్యంత ప్రీతికరమైన అంశముగా వుండేది. ఎన్నో పౌరాణిక, చారిత్రక; సాంఘిక నాటకాలలో వేశం వేసి ప్రసిద్ధి చెందారు. డా॥ కళాప్రపూర్ణ మిక్కిలి నేని రాధాక్రిష్ణ గారు రచించిన ఆంధ్ర ప్రదేశ్ లోని "నట రత్నాలు" అన్న ఆంధ్ర ప్రభ వార పత్రికలో ప్రకటించిన వ్యాసాలలో కూడా, శ్రీ పులికంటి పేరును వుటంకించారు.

నటనలో ప్రావీణ్యం సంపాదించిన శ్రీ రెడ్డిగారు ఎంత కాలమో ఈ రంగంలో వుండ లేదు. సాహిత్య రంగంలో ప్రవేశించి, భావి సంవత్సరాలలో, కవిగా, వక్తగా గణుతి కెక్కారు.

వీరు రచించిన చిన్న కథలు, ప్రత్యేక వ్యాసాలు గ్రంథాలు, నవ లలు లెక్కకు మిక్కుటంగా ప్రచురిత మయ్యాయి. వీనిలో 1953 లో "ఆదర్శం" అన్న నాటిక, 1981 లో "పులి కంటి క్రిష్ణా రెడ్డి కథలు" అన్న గ్రంథం, 1982 లో " గూడుకోసం గువ్వలు", అన్న వీరి చిన్న కథల సంకలనం, 1984 లో "కోటిగాడు స్వతంత్రుడు" చిన్న కథల సంపుటి, 1984 లోనే " అగ్గిపుల్ల" అన్న నవల ముఖ్యమైనవి.

"మొక్కితే దేవుడు" అన్న ఛందో బద్ధ కార్య రచన. ఆంధ్ర జ్యోతి వార పత్రికలో ప్రచురిత మయ్యింది.

50 కి పైగా వీరి సరళ గీతికలు జన ప్రియమైన తెలుగు వార,

దిన పత్రికలలో ప్రచురింప బడ్డాయి.

గ్రామీణ గీతాలు: నండూరు సుబ్బారావ్ రచనలలో సుప్రసిద్ధి చెందిన "ఎంకి" లాగా, శ్రీ పులికంటి వారి రచనలలో "అమ్మి" అన్న గ్రామీణ బాలిక అంతటి ప్రసిద్ధి చెందింది. ఎంకి పాటలు సర్కారు జిల్లా గ్రామీణ కన్యను ప్రతి బింబిస్తే "అమ్మి" రాయలసీమ ప్రాంత కన్యను చిత్రిస్తున్నది.

సీరియల్స్: 1987 - 88 మధ్య, "నాలుగ్గుళ్ళ మండపం", అన్న రాయలసీమ వాసుల జీవన సరళి గూర్చి వ్రాసిన సీరియల్, 56 వారాలు ధారావాహికంగా, ఆంధ్రప్రభ దిన పత్రికలో ప్రచురిత మయ్యింది.

బుర్ర కథలు: నూటికి పైగా బుర్ర కథలు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆదేశాను సారం, వయోజన విద్య, వన మహోత్సవాలు, కుటుంబ నియంత్రణ మున్నగు అంశముల మీద, తానే రచించి, తన బృందంతో చిత్తూరు జిల్లాలో పాడించి, ప్రజల ఆదరణ, మెప్పులకు పాత్రులయ్యారు.

అందువల్లనే శ్రీ రెడ్డి గారిని, ఆకాశవాణి అధికారులు 'B' Grade ఆర్టిస్ట్ గా గుర్తించి, అవకాశ మిస్తున్నారు.

ప్రత్యేకమైన వ్యాసాలు: 42 కు పైగా ప్రత్యేక వ్యాసాలు, సాహిత్య విమర్శలు, వ్యక్తి వికాసము, ఇంటర్వ్యూల వంటి అంశముల మీద రచించి, తెలుగు పత్రికలలో ప్రకటించారు.

పత్రికా రచయిత: శ్రీ క్రిష్ణా రెడ్డి గారు 1971 నుండీ 1978 వఱకూ, "కామధేను" అన్న తిరుపతి పక్ష పత్రికను, సంపాదక, ప్రకాశ కులుగా నడిపారు.

కవి సమ్మేళనలు: 43 కు పైగా దూర దర్శన్, ఆకాశవాణి, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వము వారిచే నిర్వహింప బడిన, కవి సమ్మేళనములలో శ్రీ రెడ్డి గారు పాల్గొన్న ఘన కీర్తి కలవారు.

సాహిత్య పరమైన వుపన్యాసాలకు ఆహ్వానితులై అనేక కాలేజీలలో, స్కూళ్ళలో, ఆంధ్రప్రదేశ మంతటా వుపన్యాసాలను ఇచ్చారు.

ఆకాశవాణి లో 150 కి పైగా వీరి వుపన్యాసాలు, 1976 నుండీ 1992 కు మధ్య ప్రసార మయ్యాయి. వీరి సాహిత్యంపై పరిశోధనలు చేసి చాలా మంది Ph.D లు కూడా పొందారు.

శ్రీ పులికంటి వారు, అనేక తర్జుమాలు, యితర భాషల నుండి కూడా చేశారు. శ్రీ క్రిష్ణారెడ్డి గారి సాహిత్య సేవలను గుర్తించి, వారికి అనేకానేక బిరుదులు, సత్కారాలు లభించాయి.

శ్రీ రామవిలాస సభ, చిత్తూరు వారు 1972 లో " నటశేఖర" బిరుదు నిచ్చారు. అనంతపురంలో రాయలసీమ కళాభారతి, జిల్లా రచయితల సంఘం, లలితా కళా పరిషత్ సంయుక్త వుత్సవాలలో శ్రీ రెడ్డి గారికి " జానపద కవి కోకిల" అన్న బిరుదును 1979 లో ప్రసాదించారు.

కడప జిల్లా రచయితల సంఘం వీరిని, "సుప్రసిద్ధ గేయ కవి" అన్న బిరుదునిచ్చి, 1981 లో సత్కరించింది.

తెలుగు అకాడమీ ఆధ్వర్యంలో, రాయలసీమలో భాషా శైలి పై జరిగిన చర్చ లో ప్రత్యేక ఆహ్వానితులు గా, హైదరాబాదులో డిసెంబరు, 1982 లో పాల్గొన్నారు.

"రాయలసీమ కవి" అన్న బిరుదును వీరి కిచ్చి తూర్పు గోదావరి జిల్లా రాజోలు పట్టణ వాసులు, వీరిని 1990 అక్టోబరు నెలలో సత్కరించారు.

ప్రస్తుతం వీరు అనేక పదవుల నలంకరించి యున్నారు. వాటిలో కొన్ని:-

కడప ఆకాశవాణి, గ్రామీణ సంగీతం ఆడిషన్ కమిటీ సభ్యులు (1988 - 91).

చిత్తూరు జిల్లా రచయితల సంఘం (రిజిస్టర్డ్) ఉపాధ్యక్షులు.

రాయలసీమ వర్కింగ్ జర్నలిస్ట్ సంఘం, (రిజిస్టర్డ్) కార్యదర్శి.

శ్రీ పద్మావతి మహిళా యూనివర్శిటీ పత్రికా రచన విభాగానికి, సలహా దారు, వుపన్యాసకులు.

ఆకాశ వాణి, దూరదర్శన్ వారికి గౌరవ సలహాదారుగా 2-10-'92 నుండీ, భారత ప్రభుత్వ సమాచార, ప్రచార శాఖ, న్యూఢిల్లీ వారు, వీరి సేవలను సాహిత్యంలో గుర్తించి, నెలకు నాలుగు వేల రూపాయల గౌరవ వేతనంతో, నియమించారు.

శ్రీ రెడ్డి గారు మరిన్ని గుర్తింపులు, ఉన్నత పదవులు, గౌరవాలు పొందాలని తిరుపతి పట్టణ పేరు ప్రతిష్టలను ఇనుమడింప చెయ్యాలని ఆకాంక్షిద్దాము.

* * *

"డబ్బు, కాలం ఈ రెండూ జీవితంలో అతి బరువైన సమస్యలు. రెండింటిలో ఏదో ఒకటి అవసరానికి మించి వుండి దాని ఉపయోగం తెలియక పోతే అంతకన్న దురదృష్టం మరొకటి వుండదు."

-జాన్సన్

"ఎప్పుడూ గంభీరంగా ఉండే మనిషి, నిరంతరం ఆనందంగా వుండే మనిషి పరిపూర్ణ మానవులు కాలేరు."

-లీ హంట్



# కీ॥ శే॥ శ్రీ టి. కుప్పుస్వామి అయ్యంగార్

శ్రీ టి. కుప్పుస్వామి అయ్యంగార్, మార్చి 1906 లో, తిరుపతి కి ఐదు కిలోమీటర్ల దూరాన గల పేరూరు గ్రామంలో, ఆయుర్వేద వైద్యుల కుటుంబంలో జన్మించారు. వీరి పూర్వులు, ఆ పల్లె తదితర గ్రామాల బీద జనానికి వుచితంగా ఆయుర్వేదం మందు లిస్తూ గణుతి కెక్కారు. శ్రీ అయ్యంగార్ హైస్కూలు విద్య శ్రీ వెంకటేశ్వర ఉన్నత పాఠశాలలో కొనసాగింది. పాఠశాలలో హాకీలో మంచి క్రీడాకారుడుగా, వీరు పేరు పొందిరి. కాలేజీ విద్య కై వీరు మద్రాసు పచ్చయప్పాస్ కాలేజీలో, ఇంటరు, బి.ఏ. 1924-28 మధ్య కాలంలో చదివి పట్ట భద్రులయ్యారు. హైస్కూలు లోనూ, కాలేజీలోనూ వీరు గణితంలో ప్రథమ విద్యార్థిగా మార్కులు తెచ్చుకున్నారు.

బి.ఏ. పట్టం పుచ్చుకున్న తరువాత శ్రీ అయ్యంగార్, ప్లీడర్ వృత్తి చేపట్టడానికి, న్యాయశాస్త్రాన్ని అభ్యసించారు. విద్యార్థి దశ నుండీ వీరి మకాం, పేరూరు నుండి మార్చి, తిరుపతి జి.కార్ వీధిలోనికి మార్చారు.

ప్రాక్టీసు దిన దినాభివృద్ధి చెందుతూ, 1945 నుండి చక్కటి ప్రాక్టీసు పుంజుకొని ప్రముఖ లాయర్ గా గుర్తింప బడ్డారు. 1950 సం॥ లో వీరు అడ్వకేట్ గా, ఎన్‌రోల్ చేయించు కున్నారు. ప్రముఖంగా, సివిల్ కేసులనే స్వీకరిస్తూ వుండేవారు.

తిరుపతి బార్ అసోషియేషన్‌కు అధ్యక్షులుగానూ, కార్యదర్శిగానూ ఎన్నుకొనబడి సేవలనందించారు.

వీరు బీద జనానికి సేవా భావంతో తమ న్యాయవాద వృత్తిని నిర్వహించారు. ఒకచో పేదవాడెవడైనా తాను ఫీజు చెల్లించ లేనని చెప్పినప్పుడు, అందుకు తగ్గ ఫీజు తానే చెల్లించి కేసు గెల్చేవారు.

క్లయింటు వచ్చిన వెంటనే తన కేసు గెలుస్తుందా లేదా అని చెప్పేవారు. అలా గెలుస్తుందని నమ్మకమున్న కేసులే, అంగీకరించే వారు.

1965 లో 38 కేసులు డిస్ట్రిక్ట్ మునిసిఫ్ కోర్టులో ఫైల్ చెయ్యగా, అందులో 90 శాతం తాను ఫైల్ చేసినవే.

శ్రీ కుప్పుస్వామి అయ్యంగార్, అత్యంత మతాభి మానియై, పేద ప్రజోద్ధరణకు, అవ్యాజ ప్రేమ చూపిన, నిస్వార్థ, దీన జన బంధువుడు.

1965, జూలై 20 వ తేదీ, తమ 59 వ ఏట, పరమపదించారు. వారు లేకున్నా వారి కీర్తి , చిరస్థాయిగా తిరుపతి పట్టణంలో నిలిచి వున్నది.

* * *

"సాధారణంగా గొప్పవాళ్ళు ఆ గొప్పతనాన్ని కేవలం తమ తెలివి తేటలతో కాకుండా నిరంతర పరిశ్రమ వల్ల పొందుతారు."

-బ్రూస్‌బార్టన్

"ప్రశాంతంగా జీవించడమే దీర్ఘాయువుకు రాచబాట."

-సిసిరో



# డా॥ టి. రంగస్వామి, F.I.E.

ప్రముఖ న్యాయ వాది శ్రీ టి. కుప్పస్వామి అయ్యంగార్ సుపుత్రులే ప్రస్తుత శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ రెక్టరు డా॥ టి. రంగస్వామిగారు.

తిరుపతి పట్టణ వాసులైన వీరి ప్రాథమిక, మాధ్యమిక, కాలేజీ విద్యలు తిరుపతి పట్టణంలోనే జరిగాయి. చిన్న నాటి నుండే చదువులలో ప్రజ్ఞావంతుడైన, శ్రీ రంగస్వామి, పరీక్షలలో ప్రథముడుగా మార్కులు తెచ్చుకొనే వారు. క్రికెట్ ఆటగాడుగా కూడా గణుతికెక్కారు.

1960లో, బి.ఇ. మెకానికల్ బ్రాంచిలో మొదటి తరగతి ఆనర్స్‌లో పాసవడమే కాక, అందరికంటే అత్యధిక మార్కులు తెచ్చుకొని, శ్రీ పి.వి. క్రిష్ణయ్య చౌదరి అవార్డును గెల్చుకున్నారు. బెంగుళూరు, ఇండియన్ ఇంస్టిట్యూట్ ఆఫ్ సైన్సు నుండి తమ ఎం.ఇ. మెకానికల్ పట్టం పుచ్చుకున్నారు.

1978 లో మెకానికల్ ఇంజనీరింగ్ విభాగంలో వీరికి డాక్టరేట్ పట్టం శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ వారు ప్రదానం చేశారు.

తమ వుద్యోగ జీవనం శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీ ఇంజనీరింగ్ కాలేజీలో .మెకానికల్ ఇంజనీరింగ్ విభాగంలో లెక్చరర్ గా ప్రారంభించారు. 1966 లో రీడర్‌గా ఆ కాలేజీలో ప్రొమోషన్ వచ్చింది. 1979 మార్చిలో ప్రొఫెసర్ గానూ, తరువాత 1984 - 86 మధ్య మెకానికల్ ఇంజనీరింగ్ విభాగపు అధిపతి గానూ ప్రొమోషన్ సంపాదించారు.

మరొక్కసారి, 1990 - 91 మధ్య కాలం డా॥ రంగస్వామి గారు,

ప్రొమోషన్ పొంది, ఎస్.వి. యూనివర్శిటీ ఇంజనీరింగ్ కాలేజీ ప్రిన్సి పాల్ గా గురుతర బాధ్యతలను విజయ వంతంగా నిర్వహించారు.

వీరి పరిపాలనా దక్షతకు గుర్తింపుగా వీరికి, ఉన్నత పదవి, శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ "రెక్టరుగా" 1991 , డిసెంబరు నుండి లభించింది. ఈ వ్యాసం వ్రాసే నాటికి వీరీ పదవిలో కొనసాగుతున్నారు.

డా॥ రంగస్వామి గారు 1970 - 71 లో, జర్మన్ అకెడమిక్ ఎక్సేంజి ఫెలోషిప్‌తో, పశ్చిమ జర్మనీలో, వెల్డింగ్ టెక్నాలజీలో ప్రత్యేక శిక్షణ పొందారు. 1981 లో మరొక్కసారి మూడు నెలల పర్యటన జర్మనీలో జరిపారు. 1982 - 83 కాలంలో, Visiting Faculty of Engineering, సభ్యుడుగా, టెక్నలాజికల్ యూనివర్శిటీ బాగ్దాద్, ఇరాక్ దేశాలలో పర్యటించారు.

వీరికి 1988 - 89 లో "Best Teacher Award" అత్యుత్తమ అధ్యాపక పురస్కారము ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం వారిచే, యూనివర్సిటీ ఉపాధ్యాయుడుగా లభించింది.

అనేక సాంకేతిక సంస్థలలో వీరు సభ్యులు. వీరు, శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ అకెడెమిక్ కౌన్సిల్ లోనూ, అకెడెమిక్ సెనేట్ మెంబరుగా పని చేశారు. శ్రీ వేంకటేశ్వర విద్యాలయ బోర్డ్ ఆఫ్ స్టడీస్, మెకానికల్ ఇంజనీరింగ్ విభాగ అధ్యక్ష్యులుగా పని చేశారు.

ఇంజనీరింగ్ ఫ్యాకల్టీ , శ్రీ వేంకటేశ్వర యూనివర్శిటీ dean (డీన్) గానూ, అదే యూనివర్శిటీ బోర్డ్ ఆఫ్ మ్యానేజ్ మెంటు సభ్యులుగానూ పని చేస్తున్నారు.

వీరు Institution of Engineers (India) తిరుపతి విభాగం, ఎక్సి క్యూటివ్ కమిటీ మెంబరు.

ఒకటి తర్వాత మరొకటి ఉన్నత పదవుల నలంకరించి , తిరుపతి పట్టణ ప్రముఖ వ్యక్తిగా, కీర్తి గడించిన , శ్రీ రంగస్వామి మరిన్ని ఉన్నత పదవుల నలంకరిచాలని, ఉజ్వల భవిష్యత్తు కలిగి వుండాలని, కోరుకుందాము.



# డా॥ కె. వెంకట శివయ్య
IAS (Retd.)

డా॥ కనుమూరి వెంకట శివయ్య గారు తిరుపతిలో జన్మించి, ఈ పట్టణంలోనే విద్య అభ్యసించారు.

డైరెక్ట్ రిక్రూట్‌గా డెప్యూటి కలెక్టరు వుద్యోగం సంపాదించారు. అనేక వున్నత పదవుల నలంకరించి ఆంధ్రప్రదేశ ప్రభుత్వ కార్యదర్శి హోదా వరకూ ఎదిగి సాధారణ పరిపాలనా విభాగం నుండీ, రిటై రయ్యారు. చిన్నతనం నుండీ వీరికి సంస్కృత భాష అన్నా, మన పురాణాలన్నా ఎక్కువ ప్రీతి, క్షుణంగా వ్యాస భారతము, భాగవతము, వాల్మీకి రామాయణము అధ్యయనం చేసిన మహాపండితుడు. వీరీ పురాణ గాథలను గురించి, లెక్కకు మిక్కుటమైన ఉపన్యాసాలను, పలు చోట్ల యిచ్చారు. వీరి పురాణ గాథా వ్యాప్తికై చేసిన కృషి నభినందిస్తూ వీరికి "ఉత్తమ సేవా సక్త"; "కవి చంద్ర సాహిత్య వల్లభ"; "ఉపన్యాస భారతి"; " అభినవ కృష్ణదేవరాయ" అన్న బిరుదులు ప్రసాదించి ప్రజలు మెచ్చుకున్నారు. వీరి సాహిత్య, పౌరాణిక సేవలను గుర్తిస్తూ శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం, వీరికి డాక్టరు పట్టము నిచ్చి సత్కరించింది.

శ్రీ శివయ్యగారు, ఈ ఉపన్యాసాలు, విదేశాలలో సైతం, కొన సాగిస్తూ అమెరికా, ఇంగ్లండు మొదలగు అనేక దేశాలలో పర్యటించి, తెలుగు పురాణ గ్రంథాలలో గల సాంకేతిక పరిజ్ఞానాన్ని గురించి తమ ఉపన్యాసాలలో ప్రస్తావించారు. వీరు లండన్ నగరమునకు కూడా తెలుగు సాహిత్య విస్తరణకు, ప్రయాణించి, వుపన్యాసములనిచ్చారు.

వీరు గణితము; ప్రజాపరిపాలన; మరియు తెలుగు సాహిత్యము అన్న మూడు అంశములలో తమ పోస్ట్ గ్రాడ్యుయేట్ M.A. పట్టం పుచ్చుకున్నారు. తర్వాత న్యాయశాస్త్రం L.L.B. కూడా చదివారు.

పండితులు విమర్శకులు, వాగ్ధాటి గల ఉపన్యాసకులు అయిన డా॥ శివయ్య గారు టెలివిజన్; ఆకాశవాణి ప్రోగ్రాములనేకములలో పాల్గొన్నారు.

ఇది వఱకూ వీరు ఆరు గ్రంథాలను, తెలుగు పద్యాలు; సాహిత్య నాటకము; కన్నడ "సర్వజ్ఞ" అన్న కవి రచనలకు అనువాదము చేశారు. వృత్తి రీత్యా, పరిపాలనా దక్షుడుగా వున్నా, తమ శేష జీవితాన్ని పదవీ విరమణ తర్వాత తెలుగు సాహిత్యము, పురాణేతి హాసాల వ్యాప్తికి ఎంతగానో పాటుపడుతున్న ధన్య జీవి. వీరికి వీరి కుటుంబానికి ఆయురా రోగ్యాలు ప్రసాదించాలని దైవాన్ని ప్రార్థిద్దాము.

* * *

"వృద్ధాప్యం, కష్టాలు ఎవరికైనా తప్పవు. అందువల్ల మనం నాలుగు ధర్మాలను నిర్వర్తించాలి. వృద్ధులైన బంధువులను, తల్లి దండ్రులను ఆదుకోవడం, ఆపదలో వున్న ఆప్త మిత్రులకి అండగా నిలవడం, ఆశ్రయం లేని సోదరిని కాపాడడం ఆ ధర్మాలు."

-సంస్కృత సూక్తి



# క్రీ॥ శే॥ సిరిగిరి రంగయ్యశెట్టి

క్రీ॥ శే॥ 1894 లో తిరుపతిలో జన్మించిన, శ్రీ రంగయ్య శెట్టిగారు, తమ సెకండరీ విద్యను మిషన్ హైస్కూలు, తిరుపతిలో అభ్యసించారు. శ్రీ సర్వేపల్లి రాధాక్రిష్ణన్ గారి సహపాఠిగా వున్నారు. మద్రాసు క్రిష్టియన్ కాలేజిలో చదివి, B.A. పట్టం పుచ్చుకున్నారు. గవర్నమెంటు వుద్యోగమని ప్రాకు లాడకుండా, తమ తాత ముత్తాతల వ్యాపారమైన ఇత్తడి పాత్రల వ్యాపారం చేస్తూ, సంఘ సేవలో నిమగ్నులయ్యారు.

1917 లో, శ్రీ రంగయ్య మునిసిపల్ కౌన్సిలర్ గా ఎన్నుకోబడ్డారు. ఫిబ్రవరి నెలలో, తిరుపతి కో ఆపరేటివ్ బ్యాంక్, ఫౌండర్ మెంబరుగా ఎన్నుకొనబడి, చాల మంది బీదలకు అప్పు లిచ్చి తోడ్పడ్డారు. బ్యాంక్ అభివృద్ధికి అవిరళ కృషి సల్పారు.

1915 లో మొదటి ప్రపంచ మహా సంగ్రామ కాలంలో తిరుపతి పట్టణ గౌరవ సభ్యుడుగా గుర్తింపబడి, అనధి కార ప్రతినిధిగా బియ్యము, యితర నిత్యావసర వస్తువులను రేషన్ ద్వారా యిచ్చే అధికారాన్ని బ్రిటిష్ ప్రభుత్వం వారు అప్పజెప్పారు.

తిరుపతి మునిసిపల్ కౌన్సిలర్ గా, మంగాపురం వద్ద స్వర్ణముఖీనదీ గర్భంలో గల బావుల నుండీ, తిరుపతికి నీటి సప్లై ఏర్పాటు చేయించారు. పట్టణ పరిధిలో రోడ్లు నిర్మాణానికి కూడా కారకులయ్యారు.

వీరి నిస్వార్థ సేవలకు గుర్తింపుగా, వీరిని అక్టోబరు నెల 19[illegible]5 లో మునిసిపల్ చేర్‌మెన్ గా ఎన్నుకొన్నారు, ఆ పదవిలో Oct 31 1931 వరకూ కొనసాగారు.

1921, సెప్టెంబరు 28న, మహాత్మాగాంధీ తిరుపతికి విచ్చేసిన

స్థాపం. శ్రీ [illegible]య్య గారు గాంధీ గారికి [illegible] స్మారక [illegible] [illegible] [illegible] [illegible] [illegible]. [illegible] [illegible] [illegible] [illegible] 7 [illegible] మహాత్మా [illegible] [illegible] 1.3.11 [illegible] మహాత్మా గాంధీ విగ్రహాన్ని ప్రతిష్ఠించినారు, శ్రీ [illegible] [illegible] [illegible], చలివేంద్రాలను, భోజన వసతి, వసు [illegible] [illegible] ఏర్పాటు చేశారు.

శ్రీ రంగయ్య 1940 లో తమ 46 వ ఏట, చిన్న ప్రాయంలోనే పరమ పదించారు. వారికొక కుమారుడు, కుమార్తె వున్నారు. శ్రీ రంగయ్య చేసిన, నిస్వార్థ సేవలకు గుర్తింపుగా వారి ఫోటోను ఊరేగింపుగా పట్టణ వీధుల్లో తీసుకెళ్ళి కో ఆపరేటివ్ బ్యాంక్ లోనూ, మునిసిపల్ హాస్పిటల్ ఆఫీసులోనూ గౌరవ ప్రదేశాల్లో ప్రతిష్ఠించారు. అవి యిప్పటికీ వున్నాయి.

శ్రీ రంగయ్య కుమారుడు, శ్రీ రామానుజులు, 1927 లో జన్మించారు. దేవస్థానం హైస్కూలు లోనూ, S.V. కాలేజీ లోనూ విద్య నభ్యసించారు. విద్యార్థి గానే, రాజకీయాలలో ఆసక్తి చూపారు. 1963 - 69 మధ్య కాలంలో, Honorary first class Magistrate గా, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం, వీరి సేవలనుపయోగించుకున్నది. ఈ మేజిస్ట్రేట్ పదవికి రాజీనామా చేసి, మునిసిపల్ కౌన్సిలర్ గా ఎన్నికై మే నెల 12, 1969 నుండీ 31-12-1973 వరకూ తిరుపతి పట్టణాభివృద్ధికి సేవలు చేశారు. వీరి కాలములోనే, ప్రభుత్వం తోనూ, మంత్రుల తోనూ, L.I.C. అధికారుల తోనూ సంప్రదింపులు జరిపి తిరుపతికి త్రాగు నీరు సప్లై చేస్తున్న కళ్యాణీ డ్యాం నిర్మాణపు అనుమతిని సంపాదించారు. 1972 లో శ్రీమతి ఇందిరాగాంధీ ఈ ప్రాజెక్టుకు ప్రారంభోత్సవం చేశారు. తిరుపతిలో మైక్రోవేవ్ స్టేషన్ నిర్మాణానికి, మునిసి పాలిటీ నుండీ హౌసింగ్ బోర్డ్ కాలనీకి స్థలం యిప్పించడంలో సఫలీకృతులయ్యారు.

అనంత వీధిలో నీటి పైపు లైను వేయించి సిమెంటు రోడ్డు కూడా వేయించారు. ఎలిమెంటరీ స్కూలు భవన నిర్మాణము చేయించారు.

1972 లో Co-op. Town Bank డైరెక్టరుగా ఎన్నికై, 1973 [illegible] సమున్నతమైన ప్రెసిడెంటుగా ఎన్నికయ్యారు. 1974 లో

లాకర్సు విధానం ప్రవేశ పెట్టారు. గెస్టు హౌసు అంటూ నిర్మించి, శ్రీ సుబ్బరావ్, అమాత్యులచే ప్రారంభింప చేశారు. గవర్నమెంటు బ్యాంక్ సెక్రెటరీకి వసతి గృహం కూడా కట్టించి, బాడుగ లేకుండా ఇచ్చే ఏర్పాటు చేశారు.

శ్రీ రామానుజులు మొదటి కుమారుడు చి॥ అశోక్, మెకానికల్ ఇంజనీర్‌గా 'దుబాయ్' లో వున్నాడు. కుమార్తె చి॥ భారతి, M.Sc. చదివి, శ్రీ రాజశేఖర అన్న మెకానికల్ ఇంజనీర్ & feet owner వివాహమాడి సుఖజీవనం చేస్తున్నది. రెండవ కుమారుడు. శ్రీ రవీంద్ర ఇంజనీరింగ్ పట్ట భద్రుడై, M.S. ఇంజనీరింగ్ కోర్సు, క్లార్కుసన్ యూనివర్సిటీ పోస్ట్‌డాం, న్యూయార్కులో చేశాడు. ప్రస్తుతం కంప్యూటర్ ఇంజనీర్‌గా అట్లాంటా, జార్జియా, అమెరికాలో వుద్యోగం చేస్తున్నాడు. ఈ అబ్బాయి వ్రాసిన విమానపు రెక్కలలో బాక్స్ బీమ్స్ వుపయోగము అన్న వ్యాసము అన్య దేశాల గుర్తింపు పొంది, బెంగుళూరు లో జరిగిన International conference on Advanced Structural testing, Analysis & design,కు ఆహ్వానితుడయ్యాడు. ఆ థిసిస్, అమెరికాలో "Jounal of Aircraft" మార్చి , ఏప్రిల్, 1992 , పత్రికలో, American Institute of Aeronautics వారు ప్రచురించారు.

చి॥ రవీంద్ర కనిపెట్టిన, "The Symbolic Manipulation Technique". మొట్ట మొదట సారిగా, విమానపు రెక్కల డిజైన్‌లో వుపయోగిస్తున్నారు.

శ్రీ రవీంద్ర కు ఉజ్వల భవిష్యత్తుందనడంలో సందేహం లేదు.



# శ్రీ జి. మునిరత్నం

శ్రీ జి. మునిరత్నంగారు జనవరి ఆరవతేదీ, 1936 న జన్మించారు. ఆ జన్మబ్రహ్మచారులైన వీరు, 1981 నుండీ రాయలసీమ సేవాసమితి స్వచ్ఛంద సేవా సంస్థ సంస్థాపక గౌరవ కార్యదర్శిగా ఎనలేని సేవలు చేస్తూ ఖ్యాతి గడించారు. బడుగువర్గాలు, స్త్రీలు, పిల్లలు, అవిటివారు, వృద్ధుల సంక్షేమార్థం వివిధ సంస్థలు స్థాపించి, అనేక ప్రణాళికల ద్వారా నిరంతర సేవలు చేస్తున్నారు. వీరి గణనీయ సేవలు గుర్తిస్తూ, భారత ప్రభుత్వం 1984లో వీరికి జాతీయ అవార్డును ప్రదానం చేసింది.

వీరు చేసిన సేవలలో ముఖ్యమైనవి:

ఆరు సంవత్సరాల వయస్సు వరకూ వున్న చిన్నపిల్లలకు శిశు సంరక్షక పోషక కేంద్రాలు 900 ని, మూడు నుండీ, ఆరు వరకు వయస్సుగల శిశువులకు విద్యనేర్పించే కేంద్రాలను, వెనుక బడిన ప్రాంతమైన రాయలసీమలో సంస్థాపించారు.

ఆరు నుండీ పదునాలుగేండ్లు వయసు పిల్లలకు Non-formal Education Centres, 1,100 దాకా, స్కూలు మానివేసిన పిల్లల సౌకర్యార్థమై వృత్తి విద్యలు నేర్పించే కేంద్రాలను 33,000 వరకూ స్థాపించి, దేశంలోనే ప్రజాసేవ రంగంలో అగ్రస్థానం చేరుకొన్నారు.

కేంద్ర ప్రభుత్వ ప్రోత్సాహంతో Integrated Child Development Services (ICDS) అను స్వచ్ఛంద సంస్థను 1984 లో ప్రథమంగా స్థాపించారు.

చిత్తూరు జిల్లాలో మూడువందల వయోజన విద్యాకేంద్రాలను స్థాపించి, అనేక నిరక్షరాస్యులకు విద్యాభిక్ష నొసగారు.

రాయలసీమ సేవాసమితి ఆధ్వర్యంలో, శిశువులకు సెలవు

క్యాంపులు; స్త్రీలకు నాయకత్వపు మెలుకువలు నేర్పించే క్యాంపులు; యువ కేంద్రాలు, ఆరోగ్య కేంద్రాలు; సెమినార్లు, దేశ సమైక్యతా ప్రబోధక క్యాంపులు ఎన్నెన్నో నడిపారు.

వృత్తి విద్యా పరంగా, జీవనోపాధి కల్పిస్తూ, ట్రైనింగ్ మరియు ఉత్పత్తి చేసే కేంద్రాలను స్థాపించి, 1000 మంది పల్లె వాసులైన స్త్రీలకు జీవనోపాధి కల్పించారు.

అంగన్ వాడి కేంద్రం సంస్థాపన ద్వారా 3,000 అంగన్ వాడీ పనులు చేసే స్త్రీలకు ట్రైనింగ్ పూర్తి చేయించి జీవనోపాధికి మార్గం కల్పించారు.

తల్లులచే త్యజింపబడిన పిల్లలకు ఇతర ఆధారంలేని స్త్రీలకు, ముసలి వారికి, బుద్ధిమాంద్యంతో బాధపడే పిల్లలకు, వెల్ ఫేర్ కాంప్లెక్స్ నొక దానిని సంస్థాపించే నిమిత్తం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము నుండి 20 ఎకరాల భూమిని సేకరించారు.

మరొక 75 ఎకరాల భూమిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నుండీ ఎనర్జీ ప్లాంటేషన్ కొరకు సేకరించి భారత ప్రభుత్వ ఆర్థిక సహాయంతో ఈ కార్యక్రమం మొదలు పెట్టారు.

రాయలసీమ నాలుగు జిల్లాలలోని 2,400 పల్లెలలో ప్రజాసంక్షేమ అభివృద్ధి కార్యక్రమాలు, సమన్వయ, పర్యవేక్షణా కార్యక్రమాలను రాయలసీమ సేవాసమితి చేపట్టింది.

విస్తృతంగా, మహిళా మండలుల స్థాపనకు కారకులై స్త్రీ, శిశు సంక్షేమ కార్యక్రమాలకు శ్రీకారం చుట్టారు శ్రీ మునిరత్నం.

92 కు పైగా స్వచ్ఛంద సేవా సంఘాలకు సలహాలిస్తూ, వారు చెయ్యవలసిన కార్యక్రమాలను రూపొందించు కోవడంలోనూ, వాటికి ఆర్థిక వనరులు సమీకరించుకోవడంలో మార్గాలను చూపిస్తూ ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కర్నాటక, కేరళ, పాండిచ్చేరి రాష్ట్రాలలో మార్గదర్శక పాత్ర వహించారు.

శ్రీ మునిరత్నం అనేకానేక దేశ విదేశ సమావేశాలలో పాల్గొన్నారు. వీరు విదేశాలలో విస్తృతంగా పర్యటించారు. అమెరికా, ఫ్రాన్సు

దేశాలను క్రిష్టియన్ చిల్డ్రిన్స్ ఫండ్ ఆహ్వానంపై స్త్రీ, శిశు అభివృద్ధి పథకాలను పరిశీలించడానికి దర్శించారు. 1987లో అమెరికా, కెనడా, జర్మనీ, బ్రిటన్, ఫ్రాన్సు సందర్శించి, అచ్చటి స్వచ్ఛంద సంస్థల సహకారాల అవకాశాలను పరీక్షించారు.

తరువాత 1989, నవంబరులో వియన్నా, ఆస్ట్రియాలో స్వచ్ఛంద సంస్థల ఆహ్వానంపై పర్యటించి, వారి సహకారం పొందారు. బ్రిటన్ నెదర్లాండ్స్, పశ్చిమ జర్మనీ కూడా ఇదే సందర్భంలో పర్యటించారు.

వీరు అనన్య ప్రజా సేవలకు గుర్తింపుగా వీరికి అనేక సత్కారములు జరిగాయి, అవార్డులు లభించాయి.

1984 లో శిశు సంక్షేమంలో గణనీయమైన సేవలు చేసినందుకు గుర్తింపుగా జాతీయ అవార్డు రాయలసీమ సేవాసంస్థకు లభించింది.

ఇండియన్ మర్చెంట్ చాంబర్ అసోసియేషన్ వారిచే ఇవ్వబడు చున్న శ్రీ జమునా లాల్ బజాజ్ ఫౌండేషన్ ఎండోమెంట్ అవార్డు, రాయలసీమ సేవాసమితికి 1987లో లభించింది.

1989 లో జాతీయ అవార్డు వ్యక్తిగతంగా, మునిరత్నంగారికి, శిశు సంక్షేమంలో వీరు చేసిన సేవలకు గుర్తింపుగా లభించింది.

ఇందిరాగాంధి జాతీయ సమైక్యత అవార్డు, "శిరోమణి" న్యూఢిల్లీలో శిరోమణి ఇన్‌స్టిట్యూట్ వారిచే, శ్రీ మునిరత్నంగారికి వ్యక్తిగతంగా బహూకరింప బడినది.

శ్రీ మునిరత్నంగారు ఎన్నో జాతీయ అంతర్జాతీయ సెమినార్లలో పాల్గొన్నారు.

వీరు మరిన్ని నిస్వార్థ సేవలు జాతికందించాలని, ఆకాంక్షించవచ్చు.

స్వచ్ఛంద సేవాసంస్థల నిర్వహణలో దేశంలో ఎన్నదగిన స్థానం లభించిన శ్రీ మునిరత్నం వినయమూర్తి. వేష భాషలలో నిరాడంబరత, కార్యదక్షత వారిలో ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. ఏ కాస్త సాయం అందించిన వ్యక్తికైనా కృతజ్ఞత తెలుపకుండా ఉండరు. వీరు స్నేహశీలి. వారికి ఆయురారోగ్యాలు ప్రసాదించమని దైవాన్ని కోరుకుందాము.



# శ్రీ బి. వెంకట్రామయ్య I.A.S.

సామాన్యమైన కుటుంబంలో జన్మించి, భక్తి శ్రద్ధలతో చదువుకొని, స్వయం కృషితో, ఉన్నత పదవుల నార్జించిన వ్యక్తులలో ఒకరుగా, ప్రముఖులుగా చెప్పకోవచ్చు, శ్రీ బి. వెంకట్రామయ్యగారిని.

జాయింట్ ఎక్సిక్యూటివ్ ఆఫీసరుగా, T.T.D.లో పని చేసిన, I.A.S. ఆఫీసర్, శ్రీ బి. వెంకట్రామయ్య, 15-7-1939 న చిత్తూరు జిల్లా, చంద్రగిరి సమీపాన గల, నర్శింగాపురం గ్రామంలో జన్మించారు. హైస్కూలు చదవులు, చంద్రగిరిలో ముగించుకొని, ఇంటరు, బి.కాం, S.V. Arts College, తిరుపతిలో చదివారు.

పట్ట భద్రుడైన వెంటనే, ఉద్యోగాన్వేషణతో, S.V. University లైబ్రరీలో చిరు వుద్యోగంలో చేరినా, భవిష్యత్తులో వున్నత పదవుల నలంకరించే, తృష్ణ, అదృష్టం, పట్టుదల, పెద్దల అండ దండలు వున్న వ్యక్తి కాబట్టే ఆంధ్రా యూనివర్శిటీలో చదివి తమ పోస్టు గ్రాడ్యుయేట్ M.Com. పట్టాను పుచ్చుకున్నారు.

తిరిగి వుద్యోగాన్వేషణలో పడి, చిత్తూరు కో ఆపరేటివ్ షుగర్ ఫ్యాక్టరీలో, అకౌంటెంట్ గా చేరి, 5 ఏండ్ల పాటు పని చేశారు. తదుపరి మదనపల్లె దివ్య జ్ఞాన కళాశాలలో కామర్స్ లెక్చరర్‌గా చేరి 18 మాసాలు పని చేసి, శ్రీ వేంకటేశ్వర ఆర్ట్స్ కాలేజీ తిరుపతిలో, లెక్చరర్ పనిలో 1969 నుండి 1978 వఱకూ ఉద్యోగం చేశారు.

పట్టుదల, భవిష్యత్ లో వృద్ధికి రావాలనే వ్యక్తి కాబట్టి, జనవరి '79 లో డెప్యూటి కలెక్టరుగా డైరెక్ట్ రిక్రూట్ మెంట్ ద్వారా ఉద్యోగం సంపాదించారు. తదుపరి, శ్రీ వెంకట్రామయ్యగారు, రెవిన్యూ డివిజనల్ ఆఫీసరుగా, అనంతపురం, గూడూరు, రాజంపేట పట్టణాలలో

పనిచేసి, మంచి పేరు తెచ్చుకున్నారు. ఆ తర్వాత, కడప సహకార చక్కెర ఫ్యాక్టరీ మేనేజింగ్ డైరెక్టరు గానూ; హైదరాబాదు రిలీఫ్ కమీషనర్ ఆఫీసులో అసిస్టెంట్ సెక్రటరీ గానూ; డిస్ట్రిక్ట్ రెవిన్యూ ఆఫీసర్‌గా, నెల్లూరు లోనూ పదవుల నలంకరించారు.

ప్రొమోషన్ ఇవ్వబడి, ఆంధ్రప్రదేశ్ హౌసింగ్ బోర్డు సెక్రటరీ గాను; హైదరాబాద్ ల్యాండ్ రెవిన్యూ ఆఫీసులో, సర్వీసెస్, అసైన్‌మెంట్ అసిస్టెంట్ సెక్రటరీ గానూ, తమ సేవలనందించారు.

I.A.S. క్యాడర్ కు సెలెక్టు కాబడి, తిరుపతి అర్బన్ డెవలప్ మెంట్ అథారిటీ వైస్ చేర్మన్ గానూ, మునిసి పాలిటీ స్పెషల్ ఆఫీసరు గానూ నియమింప బడ్డారు. రేణిగుంట S.V. షుగర్స్ ఫ్యాక్టరీ కి మేనేజింగ్ డైరెక్టరుగా కూడా అదే సమయంలో ఉన్నారు.

ఆగస్టు 1992 నుండీ, T.T.D. జాయింట్ ఎక్సిక్యూటివ్ ఆఫీసరుగా నియమింప బడి, నమ్రత తో, అమిత దైవభక్తి తో, ధర్మ ప్రచార పరిషత్ సెక్రటరీ, అడిషనల్ ఛార్జ్‌తో గణ నీయమైన సేవలు అందిస్తూ అందరి మెప్పునూ పొందుతున్నారు.

వీరు బాలాజి సత్సంగం స్థాపించి , అనేక పురజనులకు సద్భావన, సన్మార్గ దర్శకం, దైవభక్తి కలుగ చేస్తున్నారు. వీరికి అండ దండలుగా T.T.D.లో పనిచేస్తున్న శ్రీ P.S. శంకర రెడ్డి I.F.S. డెప్యూటీ కన్సర్వే టర్ ఆఫ్ ఫారెస్ట్ గారు, ఎనలేని సేవలు చేస్తూ అందరి మెప్పులనూ పొందుతున్నారు.

శ్రీ వెంకట్రామయ్యగారు, T.T.D. నుండీ బదలీ కాబడి, సాంఘిక సంక్షేమశాఖ జాయింట్ సెక్రటరీ గా హైదరాబాదు వెళ్ళుతున్న సందర్భాన్ని పురస్కరించుకొని, బాలాజి సత్సంగ సభ్యులు వారికి హార్దికమైన వీడ్కోలు సమావేశంలో, వారి గుణ గణాలను స్తుతిస్తూ, జ్ఞాపికల నిచ్చి 9-5-94 న సత్కరించారు.

వారు మరిన్ని వున్నత పదవుల నలంకరించాలని శుభాకాంక్షల నందజేశారు.



# కీ॥ శే॥ శ్రీ పరమాత్మ్మని రాధాపతి

తిరుపతి వాసులు శ్రీ పరమాత్మ్మని ఆదినారాయణయ్య, శ్రీమతి వెంకటసుబ్బమ్మ గార్లకు 12-5-1894 న జన్మించిన సంతానమే శ్రీ పరమాత్మ్మని రాధాపతిగారు. వీరి ప్రాథమిక విద్య తిరుపతిలోనూ ఉన్నత పాఠశాల విద్య దివ్యజ్ఞాన ఉన్నతపాఠశాల, మదనపల్లిలోనూ, కాలేజీ విద్య బి.ఎ. పట్టము మద్రాసు క్రిస్టియన్ కళాశాలలోనూ గడిచింది.

వీరు ప్రప్రథమంగా, దివ్యజ్ఞాన ఉన్నతపాఠశాల, మదనపల్లెలో తమ ఉద్యోగ జీవనం, ప్రారంభించారు. ఉపాధ్యాయవృత్తికి స్వస్తిచెప్పి, తిరుపతి జిల్లాకోర్టులో న్యాయవాద వృత్తి ప్రారంభించారు.

శ్రీ రాధాపతిగారి సంఘసేవా తత్పరత వారిని తిరుపతి కో-ఆపరేటివ్ బ్యాంకు సంస్థాపన, పరిపాలన వైపు మరల్చింది. వారు తిరుపతి టౌన్ కో-ఆపరేటివ్ స్టోరులో 1935 నుండి, 1950 మే 4 గు వరకు సేవలు చేశారు. ప్రొద్దున 6 గంటలకే స్టోరు తలుపుతెరచి, ప్రాంగణమును శుద్ధిచేయిస్తూ, సాయంత్రం తలుపులు మూసే వఱకూ, ఆపనుల మీదనే అంకితమయ్యేవారు. వారి అనన్యమైన దీక్ష, కార్యనిమగ్నత ఈతరం వారికి కనువిప్పు కలిగించగలవు.

శ్రీ రాధాపతిగారు 1921 నుండీ ఆ బ్యాంకు డైరెక్టరుగానూ, తదుపరి కార్యదర్శిగానూ, అధ్యక్షులుగానూ, సుదీర్ఘమైన 50 సంవత్సరములు, ఎవరూ ఇదివరకూ చెయ్యని, చెయ్యబోని సేవనందించారు.

అద్దె ఇండ్లలో ప్రారంభించిన ఈ బ్యాంక్‌కు ప్రతిష్ఠాకరమైన ఇప్పటి భవనం నిర్మించి అందులోకి మారేలా చేయడం, వీరి కృషి ఫలితమే.

సహకార సంస్థలు మరికొన్నింటిని వీరు స్థాపించారు. వాటిలో ముఖ్యమైనవి.

1. కో-ఆపరేటివ్ Toys Manufacturing Society.

2. కో-ఆపరేటివ్ ఖద్దర్ సొసైటీ.

3. హరిజన్ Boys Co-operative Society.

4. కో-ఆపరేటివ్ మిల్క్ సప్లై సొసైటీ.

5. కో-ఆపరేటివ్ స్పిన్నింగ్ & వీవింగ్ మిల్స్.

ఇవన్నీ కూడా షేర్లతోనూ, మెంబర్ల fixed security savings current deposits తోనే, దిన దినాభివృద్ధి చెందినవి.

కో-ఆపరేటివ్ టౌన్‌బ్యాంక్ fixed, recurring, savings, current, డిపాజిట్లతో Reserve Bank వారి పర్యవేక్షణతో, అసమానకీర్తి గడించింది. దానికి పాలక అధ్యక్షులుగా 26 సం॥లు శ్రీ రాధాపతిగారు పనిచేశారు.

మూడవదైన తిరుపతి Co-operative Housing Building Society, నేడు Tirupati Co-operative building society అను నామాంతరము పొంది, 1950 నుండీ, ప్రభుత్వ ఆదేశము మేరకు Low Income group, Middle Income group, Upper middle Income group క్రింద ఋణాలు మంజూరు చేయుచూ 250 ఇండ్ల నిర్మాణానికి కారకులయ్యారు. 32 సంవత్సరముల దీర్ఘకాలం కార్యదర్శి పదవి నలంకరించారు.

శ్రీ రాధాపతిగారు ఇన్ని ఘనకార్యములు ఔదార్యముతోనూ, కారుణ్యము, నిర్లిప్త, సహనములతో సాధించి, అందరి మెప్పులను పొందేవారు.

Town Bank ఆవరణలో సహకార సప్తాహము జరిపించి, అనేక సహకార సంఘాల ఉత్పత్తి వస్తువులను, బహుళముగా ప్రదర్శింపజేసి, తిరుపతికి ఎనలేని గౌరవ, ప్రతిష్టలు దక్కించారు.

పట్టణంలో వీరిఖ్యాతి దశదిశలూ వ్యాపించి, రాధాపతి అంటే సహకార సంస్థలుగా పరిగణించి ప్రజలు వీరి నిస్స్వార్థసేవను గుర్తించారు. వీరు నిరాడంబరజీవి. పురజనులకొక ఆదర్శమూర్తి, వీరి స్నేహితులలోనూ, ఈ సద్గుణములు, మానవత్వము, సంఘ సేవాతత్పరత మేల్కొల్పిన

ధన్యజీవి.

వీరు త్యాగరాజ ఉత్సవకమిటి జీవిత సభ్యులు, కార్యదర్శిగా సంగీత, నాటక కళలకు పునాది వేశారు. 36 సంII లు ట్రస్టు అభివృద్ధికి పాటు పడ్డారు. శ్రీ రాధాపతిగారికి సంగీత, నాటక కళలయందు ఎనలేని అభిలాష. ఇందుకు తార్కాణము, ఈనాటి త్యాగరాయ మంటపము, దాని నిర్మాణము, కార్యదర్శిగా వారుచేసిన సేవలు. వీరి సంఘసేవకు తార్కాణము తిరుపతిలో హరిజన హాస్టలు సంస్థాపన.

వీరి మేనల్లుడు, ప్రఖ్యాతి గడించిన Dr. N.V. రామకృష్ణయ్య, తిరుపతిలో మొదట M.B.B.S. పట్టభద్రుడు. వీరి అన్నగారు శ్రీ పరమాత్ముని సీతారామయ్యగారు, కడప జిల్లా బోర్డు ఉన్నతపాఠశాలలో, ప్రధానోపాధ్యాయుడుగా ప్రఖ్యాతి చెందారు. శ్రీ సీతారామయ్య శిష్యగణములో గణుతికెక్కిన వారిలో శ్రీ ఓ. పుల్లారెడ్డిగారి లాంటి వారెందరో వున్నారు. శ్రీ రాధాపతిగారి తమ్ముడు డాII పి. వెంకట్రామయ్య శ్రీకాళహస్తిలో మొట్టమొదట M.B.B.S., డాక్టరు.

శ్రీ రాధాపతిగారు, ఆంధ్రకేసరి శ్రీ టంగుటూరి ప్రకాశంగారికి, ఆప్తులు. పంతులుగారు తిరుపతికి వచ్చినప్పుడల్లా వీరియింట్లో విడిది చేసేవారు.

వీరు మాస్టర్ C.V.V. (కుంభకోణం మాస్టర్) గారి రాజ యోగాను భ్యసిస్తూ, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారితో కలసి, రాజయోగ విద్యా వ్యాప్తికి ఎనలేని సేవలు చేశారు.

ఇంతటి ఘనకీర్తి, సంఘసేవా చరిత్ర కల్గిన శ్రీ రాధాపతిగారు 19-12-1979 న, శివసాన్నిధ్యం చెందారు.

వారి జీవితం ఆదర్శమై, వారి అడుగు జాడలలో వారి సంతానం నడుస్తూ, వారి ఖ్యాతి ఆచంద్రార్కము, తిరుపతి పట్టణంలో నిలిచిపోవాలని, కోరుకుందాము.






స్వయం కృషి తోనూ, పట్టుదలతోనూ పైకి రావాలనే ప్రయత్నం చేస్తే , సాధించరాని పదవి వుండదని నిరూపించే, జీవిత చరిత్రే , కీ॥ శే॥ శ్రీ దేపూరు సుబ్బరాయులు గారిది. SSLC చదువులతో గుమస్తా గిరి తో ప్రారంభించిన తన ఉద్యోగ జీవనం, స్వయం కృషి తో B.A. పాసయి, IAS వుద్యోగం సంపాదించి, ప్రకాశం జిల్లా కలెక్టరుగా, TTD జాయింట్ ఎక్సిక్యూటివ్ ఆఫీసరు వంటి, అత్యున్నత పదవుల నలంకరించి సాధించిన ధన్యజీవి, శ్రీ సుబ్బరాయులు గారు.

చిత్తూరు జిల్లా తిరుపతి సమీపాన గల వడమాల అన్న పల్లెలో 3-1-1924 న జన్మించిన, శ్రీ దేపూరు గురువయ్య నాయుడు, శ్రీమతి దే. వెంకమ్మల సుపుత్రుడే , శ్రీ సుబ్బరాయులు. ప్రాథమిక విద్య వడమాల స్కూల్లో గడిచినా, మద్రాసు హిందూ థియోలాజికల్ ఉన్నత పాఠశాలలో SSLC వఱకూ 1937-40 ల మధ్య చదివారు శ్రీ సుబ్బరాయులు.

సర్వీస్ కమిషన్ పాసయి, తాడేపల్లి గూడెం, ఏలూరు కలెక్టరాఫీసులలో, చంద్రగిరిలోనూ గుమస్తా గిరి చేసిన తర్వాత మద్రాసు లోని బోర్డ్ ఆఫ్ రెవిన్యూ ఆఫీసుకు తిరిగి వచ్చారు.

సూపరింటెండెంట్ గా పై హోదాకు పెంపొందిన, వీరు మద్రాసులో పని చేస్తూ , ఆంధ్ర ప్రదేశ్ అవతరణానంతరం, 1956 లో హైదరాబాదు బోర్డ్ ఆఫ్ రెవిన్యూకు బదిలీ అయ్యారు. పై హోదాల నందు కుంటూ, డెప్యూటి తాసిల్దారు ట్రైనింగ్ పొంది ఆత్మకూర్ లో తాహసిల్దారుగా రెండేండ్లు 1958 వఱకు సేవలు చేశారు.

1958 లోనే, వీరు B.A. చదివి పాసయ్యారు. ఉన్నత చదువులు

సాధించిన వీరికి డెప్యూటీ కలెక్టరు హోదా లభించింది. 1970-78 మధ్య కాలంలో కడప, R.D.O గానూ, ఒంగోలు, నెల్లూరు కలెక్టరు P.A.గానూ ఉద్యోగం చేస్తున్న సమయంలో, I.A.S., పదవి లభించింది. 1978-80, డిస్ట్రిక్ట్ రెవిన్యూ ఆఫీసర్గా , ఏలూరు లోనూ, 1980-82 , ఒంగోలు కలెక్టరు గానూ, 82-86 మధ్య, T.T.D. జాయింట్ ఎక్సి క్యూటివ్ ఆఫీసరుగా వీరు వివిధ ఉన్నత పదవుల నలంకరించి వుద్యోగ విరమణ చేశారు.

వీరి అపారమైన పరిపాలనా అనుభవాన్ని వినియోగించు కుంటూ అనేక పారిశ్రామిక సంస్థలలో ఛైర్మన్ గానూ, డైరెక్టరుగా నియమింప బడ్డారు.

వాటిలో: మోనార్క్ అల్లాయ్సు అండ్ స్టీల్స్ లిమిటెడ్, హైదరాబాదు; కాకతీయ టెక్స్టైల్స్, హైదరాబాదు, రాఘవేంద్ర గ్యాస్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ ఛేర్మన్ గానూ, సాగర్ సిమెంట్స్, హైదరాబాదు; T.T.K. టెక్స్టైల్స్, మద్రాసు, సర్కార్ పేపర్ మిల్స్, నెల్లూరు; న్యాచు రల్ కెమికల్ ప్రాడక్ట్స్ లిమిటెడ్, హైదరాబాదు, పినాకినీ బెవరేజస్ ప్రైవేట్ లిమిటెడ్, నెల్లూరు; పాలేర్ కో ఆపరేటివ్ షుగర్స్ లిమిటెడ్, ఖమ్మం; భారతి స్ట్రిప్స్ లిమిటెడ్, న్యూఢిల్లీ; మదనపల్లి స్పిన్నింగ్ మిల్స్ లిమిటెడ్, మదనపల్లి - ఈ కర్మాగారాల యాజమాన్యంలో డైరెక్టరుగా శ్రీ రాయులు 1984-93 మధ్య కాలంలో పని చేశారు.

1990 - 91 లో శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయంలో One man commission గానూ; 1992 లో బోర్డ్ ఆఫ్ అమెనిటీస్లో గౌరవ సభ్యులుగా T.T.D.లోనూ, 1993 లో పద్మావతీ మహిళా విశ్వ విద్యాలయం, అడ్వైజరీ బోర్డులో సభ్యులుగానూ, శ్రీ రాయులు తమ సేవలనందించారు.

తిరుపతి బాలాజీ సత్సంగ సభ్యులుగా ఆసక్తి కరమైన, ఆధ్యాత్మిక విషయాల చర్చలలో పాల్గొనే వారు.

కొంత కాలంగా ఆరోగ్యం క్షీణిస్తూ శ్రీ సుబ్బరాయులు 23-10-93న మరణించారు.

శ్రీ సుబ్బరాయులుగారు మృధు భాషి, ఆశ్రయించిన అందరికీ, తనకు తోచిన సహాయం చేసే వ్యక్తి, దైవభక్తి పరాయణుడు కర్తవ్య నిర్వహణలో మనఃస్ఫూర్తిగా, అంకిత భావంతో సేవలు చేసిన వ్యక్తి. 1980 వరదలలో, వీరు చేసిన సేవలను అప్పటి ముఖ్యమంత్రి, శ్రీ N.T. రామారావ్, బాహాటం గానే సభలో పొగిడారు.

గాంధీ మహాత్ముని సిద్ధాంతాలలో నమ్మకం గల శ్రీ సుబ్బరాయులు కాంగ్రెసు వాదులు సైతం విరమించుకున్న ఖద్దరు ధారణ, 1970 నుండీ చేసే వారు. తిరుపతిలో స్థిర నివాసం చేస్తుండిన మంచి మనిషి.

వారి ఆత్మకు శాంతి కలుగు గాక అని ప్రార్థిద్దాము.

* * *

"వినయ సంపన్నుడు అన్నిటిని సాధిస్తాడు. గర్విష్టి అన్నిటిని కోల్పోతాడు. ఎందువల్లనంటే వినమ్రత ఔదార్యాన్ని సంపాదిస్తుంది. అహంకారం అసూయను ఆహ్వానిస్తుంది."

-రివరాల్



# కీ॥ శే॥ శ్రీ అత్తి రంగస్వామి అయ్యంగార్

కీ॥ శే॥ అత్తి శేషాచారి, శ్రీమతి కనకవల్లిల సంతానమే శ్రీ అత్తిరంగస్వామి అయ్యంగారు. ఆనాటి సంయుక్త మద్రాసు రాష్ట్రం లోని కంచీపురం సమీపంలోని అత్తిగ్రామంలో జన్మించిన, శ్రీరంగస్వామి అయ్యంగార్, తన ప్రాధమిక విద్య, సెంకడరీ విద్య, పవిత్ర స్థలం కంచీపురంలో సాగింది.

పత్రికా రచయితగా, తనజీవితం ప్రారంభించిన శ్రీ అయ్యంగార్, ప్రసిద్ధ ఆంగ్ల దినపత్రిక హిందూలో చేరకముందు, అనేక వ్యాసాలు వ్రాసి పత్రికలలో ప్రచురించేవారు. హిందూ ఆంగ్ల దినపత్రిక తిరుపతి డిస్ట్రిబ్యూటర్‌గా, 40 ఏండ్ల సుదీర్ఘకాలం, పనిచేశారు. ఆ పత్రిక సర్వ కాల (full time) విలేఖరిగా నియమింపబడి, తిరుపతి పట్టణాభివృద్ధికి ఎనలేని సేవలు చేశారు శ్రీ అయ్యంగారు. వీరి ఆప్తమిత్రులు శ్రీ ఎన్. వరదాచారితో కలసి, తిరుపతి విమానాశ్రయం నిర్మించడానికి వీరిర్వురు దేశ, రాష్ట్ర రాజకీయ నాయకులనెందరినో కలసి, చర్చించి, ఒప్పించి, సఫలీకృతులయ్యారు.

చిన్న, పెద్ద అన్న భేద భావంలేకుండా, అందరినీ దగ్గరచేర్చి, ఆయా వార్తలను పత్రికలో ప్రచురిస్తూ, తిరుపతి ప్రగతికి పాటుపడ్డ మహామనీషి శ్రీరంగస్వామి. దయ, కరుణ, ఆదరణ, మృదువచనము గల శ్రీ రంగస్వామి, మందహాస వదనముతో పురజనులందరికీ ఆప్తుడయ్యాడు.

శ్రీ రంగస్వామి శ్రీ వేదాంతదేశిక సాంప్రదాయ సుధా స్వాదిని సభకు కార్యదర్శిగా ఆ సంస్థకు విస్తృతసేవలు చేశారు.

హిందూ దిన పత్రికకు స్టాఫ్ రిపోర్టరుగా, రెండు దశాబ్దాలు, సేవలనందించి, పలువురు ప్రముఖులైన రాజకీయ నాయకులతో సన్నిహిత సంబంధం పెంచుకున్నారు. శ్రీ పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి, శ్రీ ఎం.

బలరామ్‌రెడ్డి; శ్రీ ఎం. క్రిష్ణస్వామి; శ్రీ అనంతశయనం అయ్యంగార్; గాన కోకిల శ్రీమతి ఎం.ఎస్. సుబ్బలక్ష్మి వారి భర్త శ్రీ టి. సదాశివం మున్నగు వారెందరితోనో వీరికి సాన్నిహిత్యం పెంపొంది వుండినది.

ఘనకీర్తితో, సేవాతత్పురులైన శ్రీరంగస్వామి, అప్పటి భారత ప్రధాని, శ్రీమతి ఇందిరాగాంధీ, కళ్యాణి డ్యాం ప్రాజెక్టు పునాదిరాయి వెయ్యడానికి తిరుపతికి విచ్చేసినప్పుడు, ఆ వార్తలు సేకరిస్తూ, ఏప్రిల్ నెల 1972 లో, మెదడులో నరాలు చిట్లడం కారణంగా, పరమ పదించారు.

వీరి మరణానంతరం రాయలసీమ విలేఖరుల సమాఖ్య, వీరికి "అత్యుత్తమ విలేఖరి" (Best Journalist) అని బిరుదునిచ్చి, గౌరవించింది. ఆ గౌరవపట్టాను, వారి కుమారుడు, శ్రీ దేవరాజన్ అప్పటి గవర్నరు శ్రీ కె.టి. అబ్రహం చేతులమీదుగా స్వీకరించారు.

శ్రీ రంగస్వామిగారి పుత్రుడు శ్రీ ఎ. దేవరాజన్ ప్రస్తుతం హిందూ స్పెషల్ కరెస్పాండెంట్. వీరి తండ్రి మరణంతో 1973లో part time విలేఖరిగా ప్రారంభించి, స్పెషల్ కరెస్పాండెంట్‌గా ఎదిగారు.

శ్రీ రంగస్వామి సతీమణి శ్రీమతి కనకవల్లి గత నాలుగు దశాబ్దాలుగా, హిందూ దినపత్రిక ఏజంటుగా వున్నారంటే, ఆ కుటుంబ సభ్యులందరూ, ఆ ప్రఖ్యాత దినపత్రికతో, సన్నిహిత సంబంధం, కలవారనే అర్థం అవుతుంది.

ఆ దినపత్రిక ద్వారా, తిరుపతి పట్టణానికి మరిన్ని సేవలు శ్రీరంగస్వామి కుటుంబ సభ్యులందించగలరని ఆశిద్దాము.



# కీ॥ శే॥ నదదూర్ వరదాచారి

తిరుపతి వాస్తవ్యులైన శ్రీ నదదూర్ వరదాచారి, ప్రాథమిక, సెకండరీ విద్య, ఈ పుణ్యక్షేత్ర పట్టణంలో జరిగింది.

బాల్యం నుండీ, స్వచ్ఛమైన, పూర్వాచారాలతో కూడిన, బ్రాహ్మణ జీవనంతో గడపిన, శ్రీ వరదాచారి యాత్రికులకు ఉచిత సేవ చెయ్యడంలో గడిపారు. విద్యార్థిగా, క్రికెట్, హాకీ, పరుగు పంద్యాలలో పాల్గొనే వారు. అనేక సార్లు క్రికెట్ ఆటలో అంపైర్‌గా కూడా వ్యవహరించారు.

దేశ స్వాతంత్ర్య సమరంలో పాల్గొంటూ, మహాత్మా గాంధీ ఆదేశాల మేరకు ఖాదీ వస్త్రాలనే ధరిస్తూ, తుది శ్వాస విడిచే వఱకూ, ఖాదీ పంచ, షర్టు, పైపంచ ధరించారు. తమ అచంచల దేశ భక్తిని ఆ విధంగా నిరూపించుకున్నారు.

ప్రసిద్ధ దిన పత్రిక ఇండియన్ ఎక్స్‌ప్రెస్, ఆంధ్రప్రభ విలేఖరిగా తమ జీవిత కాలంలో ఎనలేని సేవలు చేశారు. ఆలిండియా రేడియో విలేఖరిగానూ, ప్రెస్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా విలేఖరిగానూ, తమ సేవలను రాయలసీమకు ప్రత్యేకించి తిరుపతి పట్టణానికి అందించారు.

పత్రికా విలేఖరిగా, రచయితగా, వీరి సేవలను గుర్తించి, తిరుపతి పత్రికా విలేఖరుల సంస్థ అధ్యక్షులుగా వీరిని ఎన్నుకున్నారు. ఆ పదవిలో, వీరు ఒక దశాబ్దం పాటు, తమ సేవలనందించారు. బాల్య మిత్రుడు, హిందూ ఆంగ్ల దినపత్రిక విలేఖరి శ్రీ ఎ. రంగస్వామితో కలిసి, తిరుపతి విమానాశ్రయం నిర్మాణమునకు కారకులయ్యారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ నాయకులనేకులతో సంప్రతింపులు జరిపి, భారత దేశ విమానాశ్రయాల జాబితాలో తిరుపతిని చేర్చారు. శ్రీ

వరదాచారి కేవల పత్రికా రచయితగానే కాకుండా, తిరుపతి పట్టణ విద్యాభివృద్ధి కార్యకలాపాలలో నిర్విరామ కృషి సల్పారు. వీరి నిరంతర ప్రయత్నము, పట్టుదల వల్లనే 1970 లలో శ్రీ పద్మావతి మహిళా పాలిటెక్నిక్ తిరుపతిలో స్థాపింప బడింది. ఆ నాటి విద్యామాత్యులు శ్రీ భాట్టం శ్రీరామమూర్తి గారితో, ముచ్చటించి, ప్రప్రథమంగా తిరుపతికి మహిళా పాలిటెక్నిక్ కావాలనే ఆలోచనను వ్యక్తం చేశారు. ఆ భావనే చివరకు కార్య రూపం దాల్చి, రాయలసీమలోనే మొట్టమొదటి పాలిటెక్నిక్ గా శ్రీ పద్మావతి పాలిటెక్నిక్ సంస్థాపన జరిగింది.

పత్రికా రంగానికీ, సంఘ సేవలకు శ్రీ వరదాచారి చేస్తున్న అనన్య కృషికి గుర్తింపుగా, వారిని అనేక సంస్థలు గౌరవ పురస్కారంగా సన్మానించాయి. రాయలసీమలోనే కాక, రాష్ట్ర స్థాయిలో సహితము, వీరొక ప్రత్యేక స్థానం సంపాదించిన, గౌరవ పాత్రుడైన పత్రికా ప్రతినిధిగా పరిగణింప బడేవారు. హిందూ పత్రిక ప్రతినిధి శ్రీ రంగ స్వామితో సహా వీరికి అనేక మిత్రులు, శ్రేయోభిలాషులూ వుండేవారు. సోదరులుగా పత్రికా రంగంలో కవలలుగా మెలగుతున్న వీరు, బంధువులు కూడా.

శ్రీ వరదాచారి గారికి ముగ్గురు కుమార్తెలు. వీరందరూ వివాహమై, దైవ కృప వల్ల, సుఖంగా జీవనం గడుపుతున్నారు. వీరి సతీమణి శ్రీమతి రుక్మిణి అమ్మాళ్ 1990లో పరమపదించారు.

ఎల్లప్పుడూ చిరునగవుతోనూ, మృదువచనములతోనూ, అందరినీ ఆకట్టుకున్న, అందరిచే గౌరవింప బడుతున్న శ్రీ వరదాచారి, గుండెపోటుతో, 5-12-1982 న మద్రాసులో విష్ణు సాన్నిధ్యం చేరారు.

నిరాడంబరతకు, నిష్కాపట్యానికీ, మృదుత్వానికి, మంచితనానికి పెద్దరికానికి, సౌమ్యతకు, స్నేహానికి మారుపేరుగా ఖ్యాతి చెందిన, శ్రీ వరదాచారి లేని లోటు పూడ్యలేనిది. వారి ఆత్మకు శాంతి కలుగాలని కోరుకుందాము.



# డా॥ ఎన్.వి. రామక్రిష్ణన్

అయిదు దశాబ్దాలకు పైగా, ఎనలేని నిస్వార్థ సేవలు తిరుపతి పురజనుల కందించిన వైద్యనిపుణులు డాక్టరు ఎన్.వి. రామక్రిష్ణన్, పందొమ్మిది వందల పంద్రెండవ సంవత్సరము, సెప్టెంబరు, ముప్పై తారీఖున జన్మించారు. తన తల్లిదండ్రులకు జ్యేష్ఠపుత్రుడైన, డా॥ రామక్రిష్ణన్, తన ఏడుగురు తమ్ముళ్ళను, ఇంకొక చెల్లెలిని సంరక్షించి, విద్య గరిపి, వృద్ధికి తెచ్చిన ఆదర్శమైన, ఉదారస్వభావము గల సోదరుడు. డాక్టరు వృత్తిలో, పేరు గడించిన మహనీయుడు. రోటేరియన్‌గానూ, క్రీడారంగంలోనూ, సంగీత ప్రక్రియలో కూడా అభిరుచి కలిగి నిరంతర సేవలు చేశారు.

డా॥ ఎన్.వి.గారి తండ్రిగారు, డా॥ వెంకట్రామయ్య, తిరుపతిలో మొట్టమొదటి అల్లోపతి వైద్యవిధానంలో రిజిస్టర్డ్ మెడికల్ ప్రాక్టీషనర్. మద్రాసు సంయుక్తరాష్ట్రంలో, సివిల్ అసిస్టెంట్ సర్జన్‌గా ఉద్యోగం చేస్తూ, రాజీనామా చేసి, 1917 లో తిరుపతి పట్టణంలో హాస్పిటల్ ప్రారంభించారు. తన తండ్రి వృత్తిని అంకితభావంతో అనుసరించి, పేదలకు వైద్యసౌకర్యం కల్పించారు. డా॥ రామక్రిష్ణ.

వీరి తల్లి, శ్రీమతి రామమ్మకూడా సంఘసేవకురాలుగా, 1930 లో మొట్టమొదటి స్త్రీల కో- ఆపరేటివ్ సొసైటీ తిరుపతిలో స్థాపించి, బీదలు, మధ్యతరగతి స్త్రీలకు, కుట్టుపని చేతిపనులు నేర్పించారు.

డా॥ రామక్రిష్ణ తమ ఉన్నతపాఠశాల విద్యను, తిరుపతి దేవస్థానం హిందూ హైస్కూలులో చదివారు. కోయంబత్తూరులో ఇంటర్ పాసయి, విశాఖపట్నం ఆంధ్ర మెడికల్ కాలేజినుండీ, వైద్య పట్టభద్రులయ్యారు. తదుపరి, వీరు బెంగుళూరు పట్టణం, మింటో ఆస్పత్రిలో, కంటివైద్యం opthalmology లో పోస్టు గ్రాడ్యుయేట్

డిప్లొమా సంపాదించి, దీర్ఘకాలం, ఏకైక కంటివైద్యులుగా తిరుపతి పట్టణంలో, ఖ్యాతి గడించారు.

డా॥ ఎన్.వి. తిరుపతి గవర్నమెంటు ఆస్పత్రిలో, ఆనరరీ అసిస్టెంట్ సర్జన్‌గానూ, తిరుపతి దేవస్థానం గౌరవ వైద్యులుగానూ, మూడు దశాబ్దాలు సేవలనందించారు. రూయా ప్రభుత్వ ఆస్పత్రికి సలహాబోర్డు మెంబరుగా కూడా పనిచేశారు. వీరు జిల్లా మెడికల్ అసోసియేషన్‌లో చురుకైన కార్యకర్తగా, తిరుపతిలో స్టేట్ మెడికల్ అసోసియేషన్ సభలు దిగ్విజయంగా, ముప్పదేండ్ల క్రితమే జరిపారు.

వైద్యరంగంలోనే కాకుండా, డాక్టరుగారు, సంఘసేవకులుగా వివిధ రంగాలలో పాల్గొనేవారు.

తిరుపతి రోటరీక్లబ్ ఛార్టర్డ్ మెంబరుగా నిర్విఘ్నంగా వెయ్యిసభలకు హాజరైన వ్యక్తిగా కీర్తిచెందారు. వీరు తిరుపతి మునిసిపల్ కౌన్సిల్ సభ్యులుగా కూడా ఐదేండ్లు సేవలనందించారు.

తిరుపతి క్రికెట్ క్లబ్ అధ్యక్షులుగా డాక్టరుగారు, క్రికెట్ వ్యాప్తికి, ఎంతగానో పాటుపడ్డారు.

త్యాగరాజ ఫెస్టివల్ కమిటీ సభ్యులుగా, ప్రస్తుత కేంద్ర సముదాయానికి చోటును సేకరించడంలోనూ భవన నిర్మాణంలోనూ, గణనీయమైన కృషి చేసి కృతకృత్యులయ్యారు.

తమ నలుగురు బిడ్డలకు, వైద్య విద్యలో ప్రావీణ్యత కల్గించారు. వీరందరూ ఉన్నత పదవులనలంకరించి అశేషజనానికి ఈనాడు కూడా వైద్య సేవలనందిస్తున్నారు.

డా॥ రామక్రిష్ణన్, నిస్వార్థంగానూ, నిరాడంబరముగానూ, జీవితం గడిపి, వైద్యరంగంలోనూ, ఇతర రంగాలలో సంఘసేవకుడుగా ఖ్యాతి నార్జించి, 1989 వ సంవత్సరము, డిసెంబరు 10 వ తారీఖున తనువు చాలించారు.

డా॥ రామక్రిష్ణన్ ఒక వ్యక్తికాదు. వారొక సంస్థ అన్నాడొక మిత్రుడు. అది అక్షరాలా నిజము.



# కీ॥ శే॥ శ్రీ వాకుచెర్ల వెంకటముని చెట్టి

1918 లో తిరుపతిలో జన్మించిన, శ్రీ వాకుచెర్ల వెంకటముని చెట్టి, హతిరామ్‌జీ హిందూ హైస్కూలు (ఇప్పటి శ్రీ వెంకటేశ్వర హైస్కూలు) లో విద్యనభ్యసించారు. వారి తండ్రి తన ఆరవ ఏటనే మరణించారు. ఆకారణంగా సంసార భారము వహిస్తూ తమ పూల వ్యాపారం ద్వారా జీవనం ప్రారంభించారు. ప్రసిద్ధ పుణ్యక్షేత్రము యాత్రాస్థలమూ అయిన తిరుపతి పట్టణంలో అనేకమయిన దేవాల యాలుండడం వల్ల రోజురోజుకు దేశం నలుమూలల నుండీ వస్తున్న యాత్రికులకు పూలమాలల అవసరం క్రమేపీ పెరుగుతూ వచ్చింది. బెంగుళూరు, మద్రాసు నగరాలనుండీ పూలు తెప్పించి, 200 మందికి పైగా రిటైల్‌గా అమ్మకం దార్లనుపెట్టి ఈ వ్యాపారాన్ని మూడు పూవులు, ఆరుకాయలుగా అభివృద్ధి చేశారు శ్రీ చెట్టిగారు. పేద అమ్మకందార్లకు యిచ్చిన పూలఖరీదు, వారమ్మి తెచ్చి యిచ్చినప్పుడే తీసుకొనేవారు. వారిచ్చినంత తీసుకొనే వారు. ఈవిధంగా తన మంచి తనంతో పాటు, కుటుంబాన్ని కూడా సుసంపన్నం చేశారు వీరు. సంఘంలో పలుకుబడి గలిగి, బీదల పాలిట పెన్నిధిగా గణుతికెక్కారు వెంకటముని.

వీరి నిస్వార్థాన్ని, దాన గుణాన్ని పరోపకార బుద్ధినీ గుర్తించి వీరిని 1948లో తిరుపతి మునిసిపల్ కౌన్సిలర్‌గా ప్రజలు ఎన్నుకొన్నారు. మంచితనానికి గుర్తింపుగా వీరు వైస్-ఛైర్‌మెన్‌గా మూడు దశాబ్దాల సుదీర్ఘ కాలం పట్టణానికి సేవలు చేసారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోనే ఇదొక రికార్డు. వీరి హయాంలోనే తిరుపతి పట్టణంలో అనేక రోడ్లు కాంక్రీటు చెయ్యబడ్డాయి. కొత్త మునిసిపల్ ఆఫీసు, ప్రతిష్ఠాకర మైన భవనము, నిర్మించబడింది. పెరుగుతున్న పట్టణప్రజల దాహార్తిని తీర్చుగా, కళ్యాణోద్యాం నిర్మించ బడింది. క్రొత్తగా అనేక పాఠశాలలు, వాటి భవనాలు అన్ని వార్డులలో నిర్మింపబడ్డాయి.

వీరి నిస్వార్థసేవలకు మరొక గుర్తింపుగా వీరు 1982 లో తిరుపతి పట్టణాభివృద్ధి సంస్థ (TUDA, Tirupati Urban Development Authority) మొట్ట మొదట ఛైర్‌మెన్‌గా ఎన్నుకోబడినారు. తిరుపతి Slum కాలనీలలో రోడ్లు, నీటివసతి, మరుగుదొడ్లు నిర్మింప చెయ్యడమే కాక, రేణిగుంటకు, రక్షిత నీటిపథకాన్ని నిర్మించి, ప్రారంభింపచేశారు.

పట్టణ, పరిసర ప్రాంతాల సమగ్రాభివృద్ధికై, ఒక ప్రణాళిక (Master Plan) తయారు చేయించారు. ఈ ప్రణాళికలో రోడ్లు, త్రాగు నీటి వసతి, మురుగునీరు పారుదల, వాహనాల రద్దీకి సంబంధించిన సమస్యలు, వాతావరణ కాలుష్యము, పెరుగుతున్న జనాభాకు సరిపడి నకాలనీల నిర్మాణము వంటి అనేక సమస్యలు చర్చించి, పరిష్కార పథకాలు సూచించ బడినవి.

శ్రీ వెంకటముని రాజకీయాలలో కూడా పాల్గొని, టౌన్ కాంగ్రెస్ అధ్యక్షులుగా 1978 వరకూ ఉండినారు.

వీరు తిరుపతి గాంధీ పీస్ ఫౌండేషన్‌కు వైస్ ప్రెసిడెంటుగా పని చేశారు. మహాత్ముడు ప్రబోధించిన సత్యాహింసల మార్గంలో ప్రజలు నడిచేలా, వారి ప్రబోధాల వ్యాప్తికి పాటు పడ్డారు. గాంధీజీ స్వాతంత్ర్య సమర సేవలను, హరిజనోద్ధరణనూ ప్రజాస్మరణకు తేవాలని ప్రయత్నించే వారిలో ఒకరుగా, శ్రీ వెంకటముని మిగిలిపోయారు.

వీరు కో-ఆపరేటివ్ టౌన్ బ్యాంక్ ఉపాధ్యక్షులుగా, నాలుగు టర్మ్‌లు, అనగా 12 ఏండ్ల దీర్ఘకాలం తమసేవలను సంఘానికందించారు.

శ్రీ వెంకటముని చాల ధర్మపరులని పట్టణ ప్రజలలో గుర్తింపబడినారు. ఏ పేదవాడైనా, పెండ్లికిగాని, స్కూలులో చదువుకోవాలని గానీ, ఎవరో కుటుంబ సభ్యులు చనిపోయారని గానీ, తన్నాశ్రయించినప్పుడు, ఉదారంగా, కొన్ని వేల రూ॥లు దానం చేశారు. ఎదుటి వారి కష్టాలను గుర్తించి కనికరించి, సహాయపడే ఉదార స్వభావుడు, దయగల వ్యక్తివీరు.

తన శ్రీమతి 1982 న తన్ను ఒంటరి వాణ్ణి చేసి, మరణించిన సమయంలో, ఆమె స్మృతి చిహ్నంగా 5,000 రూ॥లు శ్రీ వెంకటేశ్వర

హైస్కూలులో డిపాజిట్ చేసి, ఆ వడ్డీతో పేద పిల్లలకు స్కాలర్‌షిప్ యిచ్చే ఏర్పాటుచేశారు. అది ఇప్పటికీ ఇవ్వబడుతున్నది.

ఇంతటి ఘనకీర్తి సంపాదించిన శ్రీ వెంకటముని, 1984 లో పరమపదించారు. వారి కీర్తి యింకా పట్టణంలో మిగిలేవుంది. ఈనాటికీ వారిచ్చిన భిక్ష ఆ 200 మంది బీద కుటుంబీకులు, పూల వ్యాపారంలో తరతరాలుగా తమ జీవనం గడుపుతున్నారు.

శ్రీవెంకటమునికి రాజకీయ జీవితంలో శ్రీ పి.ఎస్. గురువారెడ్డి, శ్రీ పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి, శ్రీ అనంతశయనం అయ్యంగార్, శ్రీ అగరాల ఈశ్వరరెడ్డి చాల సన్నిహితులుగా వుండేవారు.

ప్రఖ్యాతిగాంచిన శ్రీ వెంకటముని ఏకైక పుత్రుడు శ్రీ వాకిచెర్ల మునిరత్నం 1972 లో వి.వి. మహల్ నిర్మించి వ్యాపార జీవనం ఆరంభించారు. 1981 లో డి.ఆర్. మహల్ కొన్నారు.

తన తండ్రి గతించిన అనంతరం శ్రీమునిరత్నం రాజకీయ జీవనంలో ప్రవేశించి, కో ఆపరేటివ్ టౌన్ బ్యాంక్ ఎలక్షన్‌లో నిలిచి, అత్యధిక ఓట్లతో ఎన్నికై ఏకగ్రీవంగా ప్రెసిడెంట్‌గా ఎన్నికయ్యారు. 1985 నుండీ 1987 మార్చి వరకూ ఆ పదవిలో ఉన్నారు.

కాంగ్రెసు అభ్యర్థిగా 1987లో, తిరుపతి పట్టణ మునిసిపల్ ఛైర్‌మన్‌గా ఎన్నికై 1987 నుండీ 1992 వరకూ, 5 ఏండ్లు కొనసాగారు.

వీరి హయాంలో, 12 స్కూలు భవనాలు, మురికివాడలలో రోడ్డు నిర్మాణము జరిగాయి. 400 బోరు బావులు త్రవ్వించారు (వార్డుకు రెండు చొప్పున) వాటిలో కొన్నింటికి పంపులు బిగించి, త్రాగునీటి సరఫరా చేయించారు. మురికివాడలలో ఉన్నవారికి, నీటి టాంకర్ల ద్వారా నీరు సరఫరా చేశారు.

మునిసిపల్ ఆఫీసు ఆవరణలలో Open Auditorium నిర్మించారు. ఇక్కడ ఏటా రాష్ట్ర నాటకప్రదర్శన, పోటీలు జరుగుచున్నవి. కొత్త మునిసిపల్ మార్కెట్ సహితం వీరి హయాంలోనే నిర్మించారు. గాంధీ రోడ్డులోని 90 సెంట్ల విస్తీర్ణంలో ఉండిన కూరగాయల మార్కెట్ $4\frac{1}{2}$ ఎకరాల విశాల ప్రదేశానికి మార్చబడి, ప్రజలకెంతో సౌకర్యంగా వుంది. కళ్యాణీడ్యాం నుండీ రెండవ పైప్‌లైన్ 22 కి.మీ. దూరం వేయించారు.

బైపాస్ రోడ్డులో విశాలమైన పార్కు నిర్మాణానికి భూమి ఏర్పాటు చేసి కాంపౌండ్ గోడ, రోడ్లు వేయించారు. Underground drainage పథకం ( భూగర్భ మురుగు నీటిపథకం) ఇన్‌వెస్టిగేట్ చేయించి ప్లాను తయారుచేయించి T.T.D. వారిచే ఆర్థికసహాయం కోసం గట్టి ప్రయత్నంచేశారు.

1985 నుండీ 1990 వరకూ శ్రీ మునిరత్నం, టౌన్ కాంగ్రెస్ ప్రెసిడెంట్‌గా సేవలనందించారు. వీరు ఆంధ్రప్రదేశ్ మునిసిపల్ ఛేంబర్ ఆఫ్ కామర్స్, ఎక్సిక్యూటివ్ కమిటీ మెంబరుగా పదవి నలంకరించారు. A.P. స్టేట్ కో-ఆపరేటివ్ బ్యాంక్ అసోసియేషన్, రాష్ట్ర వైస్ ప్రెసిడెంట్‌గా కూడా 1985-87 మధ్య పనిచేశారు. Lions Club ప్రెసిడెంట్‌గా, డెప్యూటీ డిస్ట్రిక్ట్ గవర్నరుగా 1982-83 లో పనిచేశారు.

తమ తండ్రి సూచించిన బాటలో నడుస్తూ ఉడతా భక్తిగా, ఆశించిన వారికి, గుప్తదానం చేస్తున్నారు. ఒక అర్థ ఎకరాభూమిని కృష్ణదేవదాయ సంఘానికి చర్చికాంపౌండ్ వద్ద భూదానం చెయ్యనున్నారు.

వీరికీ, వీరి కుటుంబానికి ఆయురారోగ్యాలు ప్రసాదించాలని దైవాన్ని ప్రార్థిస్తూ మరింత వీరు సంఘసేవ, దాన ధర్మాలు బీదలకు అందిస్తారని ఆశిద్దాము.

* * *

"నేను సాధించిన విజయాల వెనుక రహస్యమేమి లేదు - కేవలం కష్టించి పని చేయడమే."

-ఇ. టర్నర్



# ప్రొ॥ కుంట్రపాక కమలనాథన్

వ్యవసాయ కుటుంబంలో, పేరు ప్రఖ్యాతి గడించి, మంచి విద్యావంతులైన కీ॥ శే॥ కుంట్రపాక పుల్లయ్యశెట్టిగారి పుత్రుడు శ్రీ కమలనాథన్ గారు, 5-12-1923 న చిత్తూరు జిల్లా, మదనపల్లె తాలూకా, రెడ్డివారి పల్లెలో జన్మించారు.

తమ హైస్కూలు చదువు మదనపల్లె పట్టణపు జిల్లా పరిషత్ హైస్కూలులోనూ, ఇంటర్మీడియేట్, బెసెంట్ థీసాఫికల్ కాలేజీ లోనూ గడిచింది. శ్రీ కమలానాథన్‌గారు మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో B.A. (Hons) పట్టం పుచ్చుకొని, పరిశోధన చేసి M.Litt.,Ph.D., డిగ్రీలను మద్రాసు యూనివర్సిటీలోనే సంపాదించారు. ప్రెసిడెన్సీ కాలేజీలో విద్యార్థిగా వున్న రోజులలోనే, వీరిని మద్రాసు ప్రభుత్వము వారు మద్రాసు సిటీబస్ ట్రాన్స్‌పోర్ట్ అడ్వైజరీ కమిటీలో సభ్యుడుగా నియమించారు.

1950 లో ప్రప్రథమ రాజనీతి శాస్త్ర అధ్యాపకుడుగా, అన్నామలై విశ్వవిద్యాలయంలో, నియమింపబడ్డారు. 1957 లో మద్రాసు పట్టణంలో, తాము విద్యనభ్యసించిన ప్రఖ్యాత ప్రెసిడెన్సీ కాలేజీలోనే అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా నియమితులయ్యారు.

ఆంధ్రరాష్ట్ర అవతరణ సమయంలో, 1950 లో, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ స్థాపన జరిగిన తోడనే రాజనీతి శాస్త్ర ప్రథమ అధ్యాపకుడుగా నియమింప బడ్డారు. వృత్తిలో అత్యున్నత పదవి, రాజనీతి విభాగానికి, డీన్‌గా ఎదిగారు. సుమారు 3 దశాబ్దాలు గణనీయమైన సేవల నందించి, 1983 డిసెంబరు 31 న పదవీ విరమణ చేశారు.

శ్రీ కమలనాథన్‌గారు తన అధ్యాపక జీవితములో అనేక ఉన్నత

పదవులనలంకరించిరి. రాజనీతి శాస్త్రవిభాగమునకు ప్రథమ అధ్యాపకుడుగానూ, అధిపతిగా నుండడమేకాక, యూనివర్శిటీ సిండికేట్, సెనేట్, అకడమిక్ కౌన్సిళ్ళలో సభ్యుడుగానూ Dean of Artsగానూ, యూనివర్శిటీ ఆధ్వర్యంలో నున్న అనేక కళాశాలలకు యూనివర్శిటీ తరపున, గవర్నింగ్ సంస్థ సభ్యుడుగాను సమర్థవంతంగా పనిచేశారు.

శ్రీ కమలనాథన్ హయాములో వెంకటేశ్వర విశ్వవిద్యాలయ రాజనీతి, ప్రభుత్వ పరిపాలనా శాఖ యెంతగానో రాణించింది. పదవి విరమించి ఒక దశాబ్దము గడిచినా ఎంతో ఉత్సాహంతో, చురుకుగా, అనేక ఆధ్యాత్మిక, సాంఘిక సేవలలో నిమగ్నులై వున్నారు.

గత దశాబ్దంగా, ఢిల్లీలోని ప్రఖ్యాతిగాంచిన Indian Institute of Public Administration పాలకసంస్థలో, ఎక్సిక్యూటివ్ కౌన్సిల్ మెంబరుగా ఎన్నుకోబడి, ఆ సంస్థ కార్యకలాపాలను నిర్వహిస్తున్నారు. అదే సంస్థకు చెందిన Standing Committee, Acadamic Committee లో సభ్యుడుగానూ ఆ సంస్థ ప్రచురిస్తున్న Indian Journal of Public Administration కు ఎడిటోరియల్ కమిటీ మెంబరుగానూ ఉన్నారు.

కేంద్ర ప్రభుత్వముచే నిర్వహింపబడుతున్న Indian Council of Social Science Research కి సభ్యుడుగా దేశములోని ప్రముఖ సాంఘిక శాస్త్రవేత్తగా నియమితులయ్యారు. పాట్నాలోని L.N. Mishra Institute of Economic Growth లోనూ, బెంగుళూరులోని Institute of Command Studies & Irrigation లోనూ గౌరవ ఆచార్యులుగా ఎన్నుకోబడ్డారు. Union Public Service Commission, New Delhi వారికి సలహాదారుగా కూడా వ్యవహరిస్తున్నారు. దేశములో అనేక విశ్వవిద్యాలయములలోనూ Board of Studies, Selection, Committee లో తీరిక లేక పనిచేస్తున్నారు.

అంతర్జాతీయ స్థాయిలో 1977 వ సంllము అతి ప్రతిష్ఠాకరమైన Oxford ternational Conference ఇంగ్లండులోనూ, అదే సంవత్సరము స్వీడన్‌లో జరిగిన International Peace Research Seminar లోనూ భారతదేశ ప్రతినిధిగా పాల్గొన్నారు.

British Council వారి ఆహ్వానంపై ఇంగ్లండులోని పలు విశ్వవి

ద్యాలయములను సందర్శించి, అచ్చటి అధ్యాపక బృంద ముఖ్యులతో Teaching & Research విషయముల గురించి చర్చించి, అనేక చోట్ల ఉపన్యాసములను ఇచ్చారు.

1981 లో మలేషియా, కౌలాలంపూరులో జరిగిన Second Telugu World Conference కు యూనివర్శిటీ ప్రతినిధిగా Executive Secretary, Centre for Studies in Peace & Non-Violence హోదాలో హాజరయి "Impact of Buddhism in Andhra Pradesh" అన్న శీర్షిక మీద ఉపన్యసించారు. ఆ అంశాన్ని ఆ సంస్థ వారు రేడియో ద్వారా ప్రసారంచేసారు.

University Grants Commission వారిచే నియమింపబడి, భారతదేశంలో అనేక విశ్వవిద్యాలయాలను దర్శించి, వివిధ కమిటీలలో వారికి తగిన సలహాల నీయడమే కాక, యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ సెలెక్షన్ కమిటీలలో సభ్యుడుగా పనిచేశారు. మద్రాసు విశ్వవిద్యాలయ, అప్పటి విశ్వవిఖ్యాత, వైస్-ఛాన్స్లర్ డా॥ లక్ష్మణస్వామి మొదలియార్, ప్రాచీనమైన మద్రాసు క్రిష్టియన్ కాలేజిలోని రాజనీతి శాస్త్రవిభాగాన్ని, పరిశీలించుటకు, One Man Commission గా నియమించడం డా॥ కమలనాథన్‌గారు విద్యారంగంలో సముపార్జించిన సమున్నతస్థాయికి తార్కాణము. వీరిని ప్రభుత్వము ఇతర విశ్వవిద్యాలయముల వైస్ ఛాన్సలర్‌లను ఎంపిక చేయుటకు Chairman of the Selection Committee గా ఎంపిక చేయడము వారికున్న పేరు ప్రతిష్ఠలకు నిదర్శనము.

ఇప్పుడు అహర్నిశము డా॥ కమలనాథన్ అధ్యాత్మిక చింతనతో అదే జీవిత లక్ష్యంగా శ్రీ రామచంద్ర మిషన్ వారి సత్సంగమార్గంలో దైవధ్యానం చేసుకుంటూ, ఆ సంస్థలలో ప్రశిక్షకుడు preceptor గా సేవచేయుచున్నారు.

దైవము వారికి, వారి కుంటుంబ సభ్యులకు ఆయురారోగ్య భాగ్యములనిచ్చి కాపాడాలని కోరుకుందాము.

# కీ॥ శే॥ కె.ఆర్. వెంకటాచల అయ్యర్

కుమార పురం, కేరళ లోని పాల్ఘాట్ వద్ద నున్న ఒక కుగ్రామం. ఆ గ్రామం లోనే శ్రీ కె. ఆర్. వెంకటాచల అయ్యర్, జూన్ నెల, 1924 లో జన్మించాడు. తన 10 వ ఏటనే మేన మామకు, హోటల్ నిర్వ హణలో సహాయం చెయ్యడానికి, చిత్తూరుకు తరలి వచ్చాడు. 1942 లో అంటే, తన 18వ ఏటనే, అమ్మవారి కుప్పంలో ఒక చిన్న హోటల్ స్వంతంగా స్థాపించాడు. ఇందుకు సహాయకులుగా తన కనిష్ఠ సోదరులు, శ్రీ కె. ఆర్. రామనాథన్ మరియు శ్రీ కె. ఆర్. గోపాల అయ్యర్ లను వినియోగించు కున్నాడు. నాలుగేండ్లలో, 1948 లో చిత్తూరు పట్టణానికి తరలి వచ్చి, అక్కడ హోటల్ స్థాపించాడు. మరు సంవత్సరమే, 1949 లో చంద్రగిరి పట్టణమునకు తరలి వచ్చి, అక్కడ హోటల్ ప్రారంభించాడు. ఫిబ్రవరి, 1955 లో, తిరుపతి పట్టణ గాంధీ రోడ్డులో, హోటల్ భీమాస్‌ను, స్థాపించాడు. మొట్ట మొదటి సారిగా, ప్రైవేట్ లాడ్జిని, తిరుపతి యాత్రా స్థలిలో ప్రారంభించిన వారు, శ్రీ వెంకటాచల అయ్యర్. అలానే పూర్తి ఏర్ కండిషన్ తో డైనింగ్ హాల్, ఎ.సి. రూములు ప్రప్రథమంగా తిరుపతి లో ప్రారంభకుడాయనే.

దిన దినాభి వృద్ధి చెందుతూ, పేరు ప్రతిష్టలు తెచ్చుకున్న హోటలు గా భీమాస్ మారింది. త్వరలో, 1964లో భీమాస్ అనెక్స్, లాడ్జింగ్ అండ్ బోర్డింగ్ విభాగాన్ని విస్తరించారు. 1982లో భీమాస్ డీలక్స్, స్టార్ హోటల్‌గా రూపొందింది. ఇందులో భూగర్భ, ఏర్ కండిషన్డ్ రెస్టారెంట్ స్థాపింప బడింది.

వీరి సోదరులు శ్రీ కె. ఆర్. రామనాథన్ అయ్యర్, శ్రీ K. R. గోపాల అయ్యర్, వీరికి రెండు కండ్లు, రెండు చేతులుగా, ఆది నుండీ నిర్విరామ కృషి సల్పారు.

1953 లో వివాహ మాడిన శ్రీ వెంకటాచల అయ్యర్‌కు, ఐదుగురు కుమార్తెలు, ఇద్దరు కుమారులు. కుమారులైన, శ్రీ కె.వి. రంగనాథన్ మరియు శ్రీ మోహన సుందరం, వారి తండ్రి అడుగు జాడలలో నడుస్తూ, వారి తండ్రి గారి వ్యాపారాన్ని నిరంతర శ్రమతో అభివృద్ధికి తెస్తున్నారు.

తమ హోటల్ వ్యాపారానికే దృష్టి కృషి పరిమితం చెయ్యకుండా, శ్రీ వెంకటాచల అయ్యర్, సంఘ సేవా తత్పరుడై, ఎన్నో యితర సేవలను చేశారు. వారు తిరుపతి కో ఆపరేటివ్ బ్యాంక్‌కు డైరెక్ట రుగా రెండు దఫాలు, తిరుపతి మునిసిపల్ కౌన్సిల్ మెంబరుగా ఒక సారి, హిందూ కుష్టు నివారణ సంఘంకు వైస్ ప్రెసిడెంటుగానూ, దీన జనానికి, కీ॥శే॥ శ్రీ అనంత శయనం అయ్యంగార్ గారికి తోడ్పడుతూ, అనన్య సేవలు చేశారు. ఇంకా శ్రీ అయ్యర్, శ్రీ శ్రింగేరి, శ్రీ కంచి శంకర మఠముల తిరుపతి గౌరవ ఉపాధ్యాక్షులు గానూ; వివిధములైన హిందూ ధర్మ పరిరక్షణ సేవలు చేశారు. విశ్వ హిందూ పరిషత్ లో చురుకైన మెంబరుగా, తిరుపతి పట్టణంలో జాతీయ సదస్సును ఏర్పాటు చేశారు. 24 ఏండ్లకు పైగా రొటేరియన్ గా ఎనలేని సేవల నందించారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర హోటలర్ల అసోసియేషన్ వైస్ ప్రెసిడెంటు గానూ, తిరుపతి హోటలర్ల అధ్యక్షులుగా, 1978 లో రాష్ట్ర వార్షికో త్సవం, జయ ప్రదంగా జరిపించారు.

ఉదార స్వభావుడు, దాన కర్త, అన్యహితాభిలాషి, అందరికీ మిత్రుడు, తిరుపతి పట్టణ సంఘ, మత, యితర సేవా సంఘాలలో విస్తృతంగా పాల్గొనే వాడు, నిగర్వి, నిరాడంబరుడు, సదా తన చిరు నగవుతో, ఆశ్ర యించిన అందరికీ సహాయపడే వ్యక్తి అయినందుననే, అందరి ప్రేమ, గౌరవ అభిమానాలకు పాత్రుడై, ఖ్యాతి కెక్కారు శ్రీ వెంకటా చల అయ్యర్.

అంతటి మంచి వ్యక్తి, గొప్ప వ్యక్తి, 4-2-1984 న విష్ణు సాన్నిధ్యం చేరారు. వారి ఆత్మకు శాంతి కలుగు గాక.

తండ్రి అడుగు జాడలలో నడుస్తున్న వారి కుమారులు శ్రీ కె.వి.

రంగనాథన్. పట్టణంలో అనేక సేవా సంఘాలలో సభ్యుడుగా, వుదార స్వభావుడుగా, దైవ భక్తి పరాయణుడుగా గణుతి కెక్కారు. శ్రీ రఘు సేవలను, శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ సెనెట్ మెంబరుగా నియమించి, వుపయోగించు కుంటున్నది. శ్రీశ్రీశ్రీ శృంగేరి, లేక మరే మఠాధికారి అయినా, శ్రీ రఘు ముందుండి ఆహ్వానించి, పాద పూజాది సత్కారాలను నిర్వహిస్తున్నారు. తిరుపతి త్యాగ రాజ సంగీత ట్రస్టుకు, వారి అనేక కార్యక్రమాలకు శ్రీ రఘు ఆయువు పట్టు.

వీరు మరిన్ని ఘన సంఘ సేవల నందించి, తిరుపతి పట్టణ ముఖ్య పౌరుడుగా ఖ్యాతి గడించాలని, వారి కుటుంబ వ్యాపారాభి వృద్ధి గణనీయంగా పెరగాలనీ, ఆశిద్దాము.

* * *

త్యాగము లేనిచో ఏ గొప్ప కార్యమున్ను సాధింపబడ నేరదు.

* * *

ఎవడు స్వార్థరహితుడై యుండునో అట్టివాడే శివునకు (భగవంతునకు) అతి సమీపమున ఉన్నవాడగును.

* * *

సత్యము, పవిత్రత, నిస్స్వార్థత - అను ఈ సుగుణములు కల వానిని అణగద్రొక్కగల సామర్థ్యము ముల్లోకములందెవనికిని లేదు. జగత్తంతయు ఎదురు తిరిగి నిలిచినను ఈ సుగుణములు కలవాడు ఒంటరిగా వారినందఱిని ఎదిర్చి నిలువ గలుగును.

# శ్రీ పసుపర్తి చెంగల్రాయ చెట్టిగారు



పసుపర్తి కుటుంబ మంటే, వివిధ వ్యాపార రంగాలలో పేరు గాంచిన, వైశ్య కుటుంబమని తిరుపతి వాసులందరికీ తెలుసు.

ఈ కుటుంబంలో ప్రసిద్ధులు, ప్రథములు శ్రీ పసుపర్తి చెంగల్రాయ చెట్టి గారు, పలమనేరు వద్ద నున్న పత్తి కొండ గ్రామంలో జన్మించారు. పలమనేరులో టోకు వ్యాపారం చేస్తూ వుండి, 1924 లో తిరుపతి పట్టణానికి తరలి వచ్చారు. గాంధీ రోడ్డులోని పి. చెంగల్రాయ చెట్టి & Sons అన్న కిరాణా షాప్ ప్రారంభించారు. సరియైన తూకము, నాణ్యత గల సరుకు, సరసమైన ధర, యీ మూడింటికి కట్టుబడి వ్యాపారం సాగించారు. ముందుగా చెప్పుకున్నా, పెండ్లిండ్లకు కూడా, సరకులు సరఫరా చేసి, అందరి మన్ననలను పొందారు.

శ్రీ చెంగల్రాయ చెట్టి గారి ఆర్గురు కుమారులలో ఒకరు మటుకు ఉద్యోగంలో స్థిర పడ్డారు. మిగిలిన ఐదు మంది వారి వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకుంటూ, జౌళి వ్యాపారము, రెడిమేడ్ దుస్తులు, సిల్కు దుస్తులు, ఫ్లోర్‌మిల్; ఖెమికల్ ఇండస్ట్రీ; డిస్ట్రిబ్యూషన్ ఏజెన్సీ; సూపర్ మార్కెట్; హోచరీ; రసాయన ఎరువులు, ఫైనాన్సింగ్ , పెట్రోల్ బంక్ వగైరా అనేక రంగాలలో నాయకత్వం వహిస్తున్న ప్రముఖ వ్యాపార కుటుంబంగా పేరు గడించారు.

శ్రీ పి. క్రిష్ణయ్య చెట్టి, శ్రీ పి. అప్పయ్య చెట్టి అన్న తన యిద్దరు సోదరులతో వ్యాపారం ప్రారంభించిన శ్రీ పి. చెంగల్రాయ చెట్టి , సేవా భావంతో చేస్తున్న వ్యాపారం దిన దినాభివృద్ధి చెందింది. వీరు మునిసిపల్ కౌన్సిలర్ గా కూడా తిరుపతి పట్టణానికి సేవలనందించారు.

శ్రీ చెంగల్రాయ శెట్టి గారికి ఏడుగురు కుమారులు, ఇద్దరు

కుమార్తెలు. వీరందరూ వివాహోదులై పిల్లలతో వివిధ రంగాలలో ఖ్యాతి గడించారు.

1) శ్రీ P. సుబ్రమణ్యా చెట్టి గారికి పసుపర్తి క్లాత్‌హాల్, పసుపర్తి సిల్క్‌ల వ్యాపార విభాగమున్నది. వీరు రొటేరియన్‌గా కూడా సేవలనందిస్తున్నారు.

2) శ్రీ P. శ్రీనివాసులు చెట్టిగారు, చార్టర్ రొటేరియర్ మెంబరు. వీరికి పసుపర్తి పెట్రోలియం కంపెనీ, ఫ్లోర్‌మిల్; పసుపర్తి ఎలెక్ట్రానిక్స్; పసుపర్తి ట్రాన్స్‌పోర్ట్స్; హ్యాచరీ, సింథటిక్ రెసిన్ వుత్పత్తి - వ్యాపారాలున్నాయి.

3) శ్రీ పి. బలరామ్ చెట్టి:- వీరు పసుపర్తి ప్రొవిషన్స్; చెంగ్రాయ చెట్టి ఏజన్సీ; హిందుస్థాన్ లివర్ వారి ఏజన్సీ, డిస్ట్రిబ్యూషన్ వ్యాపారాలు చేస్తున్నారు.

4) శ్రీ పి. రాధాక్రిష్ణ చెట్టి:- వీరు ఇంజనీరింగ్ పట్టభద్రులు, చీఫ్ ఇంజనీరుగా రిటైరయ్యారు. వీరి కుమారులు విశాఖపట్నంలో ఏజన్సీ వ్యాపారంలో స్థిర పడి యున్నారు.

5) శ్రీ పి. రఘురామ్ చెట్టి:- వీరు ప్రొవిషన్ షాపులోనూ, సూపర్ మార్కెట్, నూనె వ్యాపారము, డిస్ట్రిబ్యూషన్ వంటి రంగాలలో వున్నారు.

6) శ్రీమతి ఆర్. సరోజమ్మ:- వీరు ఇర్రిగేషన్ S.E.గా రిటైరైన శ్రీ రామచంద్ర రావ్ ధర్మపత్ని.

7) శ్రీమతి లలిత:- వీరు డి.సి.వి. క్రిష్ణమూర్తి ధర్మ పత్ని, వీరికి నాయుడు పేటలో రైస్ మిల్ వ్యాపారమున్నది.

8) శ్రీ పి. జనార్ధన్:- వీరికి పెట్రోలియం డీలర్ వ్యాపారము.

9) శ్రీ పి. పార్ధసారధి:- వీరు రసాయనిక ఎరువులు; సిమెంట్లు; పెస్టిసైడ్స్; ఫైనాన్సింగ్, హ్యాచరీ రంగాలలో వ్యాపారము కొనసాగిస్తున్నారు.

ఇంతటి విస్తృత కుటుంబము, గౌరవ ప్రదమైన వ్యాపారము సరియైన తూకము; నాణ్యత గల సరుకు, సరసమైన ధరలు అన్న ధ్యేయాలతో, గత ఏడు దశాబ్దాల నుండీ, ప్రజల మన్ననలను అందుకుంటున్నారు. వీరి మనమలు, ముని మనుమలు, మంచి విద్య నభ్యసించి, ఈ తరాల, భావి తరాల వారికి ఆదర్శ ప్రాయులై మరింత ఐశ్వర్య, సంపదలు పొందాలని ఆశిద్దాము.

* * *

బంధము నుండి విడుదలను పొందవలెనను కోరికయే ఆధ్యాత్మిక ప్రవృత్తి యొక్క రూపమును ధరించు చున్నది.

* * *

నిస్స్వార్థతయే మతము యొక్క సారాంశము.

* * *

వెయ్యి పర్యాయములు అపజయము పొందినను జయమునకై మరియొకసారి ప్రయత్నింపుము. నిరుత్సాహపడవద్దు.



# శ్రీ గోమటం శ్రీరంగాచారి, B.E. (Hons), M.I.E.

1952 లో తుంగ భద్ర ప్రాజెక్టుకు అమర్చ వలసిన గేట్లు ఎవరు తయారీ చెయ్యాలి అన్న ప్రశ్న వుత్పన్న మైనప్పుడు, ఆనాటి ఛీఫ్ ఇంజనీర్ శ్రీ యమ్. యస్. తిరుమల అయ్యంగార్, ఒక్క శ్రీ జి. శ్రీ రంగాచారి గురించే ఆలోచించారు. ఎందుకంటే అది వఱకే మద్రాసు రాష్ట్రంలో, రోడ్ ట్రాన్స్ పోర్ట్ లాబొరెటరీ నొక దానిని సంస్థాపించి, ఆయన ప్రఖ్యాతి చెంది వుండిన మెకానికల్ ఇంజనీరు.

గిండీ ఇంజనీరింగ్ కాలేజి నుండీ పట్టభద్రులై, అసిస్టెంట్ ఇంజనీర్ గా డైరెక్ట్ రిక్రూట్ మెంట్ కాబడి, డిస్ట్రిక్ట్ బోర్డు డివిజనల్ ఇంజనీరుగా, ఆయన పని చేస్తూ వుండే వారు. మెకానికల్ ఇంజనీరైనా, హైవే ఇంజనీరింగ్ లో ప్రత్యేకత సంపాదించారు. వీరు రచించిన "తక్కువ ఖర్చుతో రహదారులు" Low Cost roads అన్న వ్యాసము, అత్యుత్తమ మైనదిగా పరిగణించి, మైఖేల్ బంగారు పతకాన్ని బహూకరించారు. ఆ పతకం మరెవ్వరికీ ఆ తర్వాత యివ్వలేదు.

Soil mechanics లోనూ వీరు అమెరికాలో 1944 లో పాయింట్ 4 aid programme క్రింద పర్యటించి, ప్రత్యేకత సంపాదించారు. తుంగభద్ర ప్రాజెక్టు గేట్లను, తయారీ చెయ్యడానికి ముందు, యింతటి ఘన కీర్తి సంపాదించి వుండిన వ్యక్తి శ్రీ శ్రీరంగాచారి.

స్పిల్ వే గేట్ల గురించి, అంతగా అప్పుడు అవగాహన, వాటిని డిజైన్ చేసి, తయారీకి వలసిన, పరిజ్ఞానం లేదు. అయినా శ్రీ శ్రీరంగాచారి గారి అధ్వర్యంలో ప్రారంభ దశ నుండీ తుది వరకూ తుంగభద్ర డ్యాము మొదటి స్పిల్ వే గేటు ఏప్రిల్ 1954 లో నిర్మింపబడి, ఎరక్షన్ చెయ్య బడింది. షాపులో వెల్డ్ చేసి, ఫీల్డ్ లో రివెట్ చేసే విధానాన్ని మొట్ట మొదట సారిగా, అప్పటి కింకా వెల్డ్, దాని బలము (స్ట్రెంగ్త్) గురించి,

అంత విజ్ఞానము లేకున్నా, ప్రవేశ పెట్టారు. వెల్డ్ సరిగా వుందా లేదా అని పరీక్షించ డానికి X-ray testing, load tests అన్న విధానాలతో పరీక్షించి, తమ విధానంలో లోటు లేదని నిరూపించారు. ఈ విధానం త్వరలో దేశం నలుమూలలా ప్రాకి, ఖ్యాతి గడించింది. విస్తృతంగా వాడుకలోకి వచ్చింది.

ఏప్రిల్ 1956 నాటికి, తుంగభద్ర స్పిల్‌వే గేట్లన్నీ ముగింప బడి, వాటికై నిర్మించిన పెద్ద కర్మాగారము, అందులోని కార్మికులకు పని లేకుండా క్లిష్ట పరిస్థితి ఏర్పడింది. అప్పటి నుంచే, తుంగభద్ర కర్మాగారంలో యితర రాష్ట్రాల గేట్లు నిర్మించడం ప్రారంభమయింది. మొట్ట మొదట జవాయ్ గేట్స్ తయారీ ప్రారంభించారు.

1955 లో అమెరికా నుండీ బ్యూరో ఆఫ్ రిక్లమేన్ ఇంజనీర్ హోర్ట్జ్ తుంగభద్ర కర్మాగారం సందర్శించి, ఇక మీద ప్రాజెక్టులలో గేట్ల కోసం ఇండియా, ఇతర దేశాల మీద ఆధార పడనక్కర లేదని, వ్రాకుచ్చారు. ఈ విషయం మన దేశానికే ఒక గర్వ కారణం. అది వఱకూ విదేశాల నుండీ తెప్పిస్తున్న గేట్లు స్వదేశంలో తయారీ కాబడి నాయి. ఇండియాలో నున్న ప్రముఖ ఇంజనీర్లు 13 మంది, శ్రీ కన్వర్ సేన్ అధ్యక్షతలో, సోవియట్ యూనియన్‌లో తిరిగి వచ్చారు. అచ్చట Mefhods of Admimistration, control of labour అన్న అంశముల మీద అధ్యయనం చేసి వచ్చారు. శ్రీ శ్రీరంగాచారి గారు అందులో ఒకరు. అప్పటికే 50 గేట్లు తుంగభద్రలో తయారు చెయ్యబడి, స్వర్ణో త్సవం జరుపు కున్నారు.

ఆ తర్వాత global tendens లో గెలిచి కోటా బారేజి గేట్ల (రాజస్థాన్) పని 1956 లో తుంగ భద్రకు అప్పజెప్ప బడింది. ఆనాటికి 40 అ. X 44 అ. రేడియల్ గేట్లు తయారు చెయ్యడం, దేశంలో అదే ప్రథమం.

అది వఱకూ, హోయిస్టులలో వుపయోగించే పెరి గ్రిష్ బ్రేకులు, రాడికన్ గేర్ బాక్సులు విదేశాల నుండీ తెప్పించే వారు. వాటిని తుంగ భద్ర వర్క్ షాపు లోనే తయారు చేయించిన సాహసి, శ్రీరంగాచారి. ఈయనకు ఇందులో శ్రీ M. వెంకటనరసు శ్రీY. ఆదినారాయణశాస్త్రి

అన్న యిద్దరు ముఖ్య ఇంజనీరింగ్ శిష్యులు ఎంతగానో తోడ్పడ్డారు.

10-9-1903 న తిరుపతి లో జన్మించిన శ్రీ గోమటమ్ శ్రీరంగా చారి, 6'-6" ఎత్తు కలిగి, తమ సహచరులందరి తోనూ హుందాగా నడుచుకొనేవారు. ఎల్లవేళలా పుస్తకాలు చదువుతూ ముదుసలి ప్రాయంలో కూడా తన సాంకేతిక పరిజ్ఞానాన్ని పెంపొందించే ప్రయత్నంలో నిరతము నిమగ్నమై వుండేవారు. ఎంత తక్కువ ఉద్యోగి అయినా, అతని అభిప్రాయాలను అడిగి తెలుసుకొనేవారు. ఎక్సిక్యూటివ్ ఇంజనీర్ పదవిలో వున్నా శ్రీ ఈశ్వరయ్య అన్న ఫోర్‌మన్‌ను అనేక సార్లు సాంకేతిక విషయాలలో నిర్ణయం తీసుకొనే ముందు, సంప్రతించే వారు.

56 ఏండ్ల ప్రాయంలో వాలంటరీ రిటైర్‌మెంటు తీసుకొని, తుంగ భద్ర వర్క్ షాపు మెషినరీ డివిజన్ నుండి పదవీ విరమణ చేశారు.

ప్రతిభావంతుడు, విజ్ఞాని అయిన శ్రీ శ్రీరంగాచారి, ఆ మీదట, మద్రాసు పట్టణ శివారైన పట్టాభిరామ్‌లో, సదరన్ స్ట్రక్చరల్స్‌లిమిటెడ్ అన్న ప్రైవేట్ కర్మాగారాన్ని సంస్థాపించి, ఏకంగా 14 ఏండ్లు దాని జనరల్ మేనేజరుగా పని చేశారు. రైల్వే వ్యాగన్లు తయారీలో మంచి పేరు ప్రతిష్టలు చెందిన కర్మాగార మది.

ప్రస్తుతం, ఈ కర్మాగారాన్ని, తమిళనాడు ప్రభుత్వం స్వాధీనం చేసు కొని, ప్రతిష్టాకరమైన Bucket - Wheel Excavaters, Container cranes, power-house overhead cranes, పైపులు, గేట్లు వగైరా లన్నీ ఉత్పత్తి చేస్తూ రాణిస్తున్నది.

జనవరి 1960 లో, వెండితో గేటు ఆకారంలో షీల్డు చేయించి, తుంగభద్ర ఇంజనీర్లు సత్కార సభ లో, వీరికి బహూకరించారు.

శ్రీ శ్రీరంగాచారి గారు, మద్రాసు నగరంలో స్థిరపడి, అక్కడే తుది శ్వాస విడిచారు.

వారు మన మధ్య లేకున్నా, వారి శ్రమతో, దీక్షతో, నిపుణతతో ముందు చూపుతో స్థాపించిన రెండు పెద్ద కర్మాగారాలు తుంగ భద్ర

స్టీల్ ప్రొడక్ట్స్ లిమిటెడ్ తుంగభద్ర డ్యామ్ లోనూ, సదరన్ స్ట్రక్చరల్స్ లిమిటెడ్, పట్టాభిరామ్, మద్రాసులోనూ ప్రఖ్యాతి గాంచి, దేశ పురోగతికి పారిశ్రామిక రంగంలో తోడ్పడుతూనే వున్నాయి. వేలాది కార్మికులు వారు పెట్టిన ఉద్యోగ భిక్షతో, తరతరాలుగా జీవనోపాధి కలిగి సుఖ జీవనం చేస్తున్నారు.

వారి ఆత్మకు శాంతి కలగాలని, వారి కుటుంబ సభ్యులందరూ, ఆయురారోగ్యాలు కలిగి వుండాలని దైవాన్ని ప్రార్థిద్దాము.

* * *

మన గొప్పతనము మనము చెప్పు మాటలచేగాని, మనము ధరించు చిహ్నములచే గాని, మనము చేయు నినాదములుచేగాని నిర్ణయింప బడదు. మనయొక్క కార్యకుశలత్వము, నిరంతరకృషి, త్యాగము, సత్య సంధత్వము, నిర్మల చరిత్రములచేతనే నిర్ణయింప బడగలదు.

* * *

మానవ సంఘము నుండి దైవత్వమును తీసివైచినచో పశువుల గుంపు మిగులును.

* * *

సంపాదించవలెను. చేయవలెను. పొందవలెను. అనుభవించవలెను -అను ఇచ్ఛలు నశించినప్పుడే నిజమైన మనఃశ్శాంతి కలుగును.